**BAPU RAMANEEYAM**

NAVODAYA PUBLISHERS
Vijayawada - 520 002

*First Edition*
*APRIL 1990*

*Title & Inside Designs*
BAPU

*Printed at:*
D M E Printers,
Gee Bee Graphics
MADRAS - 21.

*Price:*
POPULAR EDITION Rs. 60-00
LIBRARY EDITION Rs. 85-00



శ్రీ రఘుపతి వెంకయ్య

15-10-1873 – 15-3-1941

చలనచిత్ర పరిశ్రమకు

ఆద్యులు పూజ్యులు

కీ.శే. రఘుపతి వెంకయ్యగారి

దివ్యస్మృతికి-

బాపు, రమణ

# స్మరణ

భారత చలనచిత్ర పితామహుడు దాదా సాహెబ్ ఫాల్కే సమకాలికుడు, దక్షిణ భారత చలనచిత్ర పరిశ్రమకు ఆద్యుడు పూజ్యుడు శ్రీ రఘుపతి వెంకయ్య.

అయన స్వయంగా స్టిల్ ఫొటోగ్రాఫర్. మదరాస్ మౌంట్ రోడ్డులో ఆయనకు ఒక స్టుడియో వుండేది. లండన్‌లో అయిదవ జార్జి సమక్షంలో జరిగిన ఒక చలనచిత్ర ప్రదర్శన గురించి పత్రికల్లో చదివిన ఆయన ఆ ప్రొజక్టర్‌ను దిగుమతి చేయించారు.

తొలి ప్రదర్శన మదరాస్ విక్టోరియాపబ్లిక్ హాలులో జరిగింది. అది నిశ్శబ్ద చిత్రం. చిత్రంతోపాటు ఒక గ్రామఫోను రికార్డు కూడా తిరగడంచేత ఆ నిశ్శబ్ద చిత్రానికి అనువైన శబ్దం కూడా వినబడే ఏర్పాటువుండేది. ఆ చిత్రాల ప్రదర్శనకాలం 3, 4 నిమిషాలు మాత్రమే. 'అండర్ ది పెనామా', 'స్వింగ్ సాంగ్', 'సీ సర్పెంట్' చిత్రాలు ప్రదర్శించబడ్డాయి.

ఈ ప్రదర్శన విజయవంతం కావడంతో ఆయన 1910 లో మదరాస్‌లో ఒక 'డేరా' సినిమాను నిర్మించారు. ఆ తర్వాత తమిళ నాడు, సర్కారు జిల్లాలూ, కొలంబో, బొంబాయి నగరాలూ టూరు చేశారు.

1912 లో మదరాస్ తిరిగివచ్చి గెయిటీ, క్రౌన్ (ఇప్పటికీ అవే పేరుతో వున్నాయి), గ్లోబ్ థియేటర్ (ప్రస్తుతం రాక్సీ) నిర్మించి మిలియన్ డాలర్ 'మిస్టరీ' 'క్లచ్చింగ్ హేండ్' బ్రోకెన్‌కోయిన్, గ్రేట్ రివార్డ్ మొదలైన చిత్రాలను దిగుమతి చేసి ప్రదర్శించారు.

1913 లో ఆయన చిత్ర నిర్మాణంలో అడుగుపెట్టారు. గ్లాస్ స్టూడియోను నిర్మించి, స్టార్ ఆఫ్ ఈస్ట్ ఫిలిమ్స్ సంస్థను ప్రారంభిం చారు. దీనిలో సి. పి. రామస్వామి అయ్యర్, కస్తూరి రంగ అయ్యంగార్, గోకుల్‌దాస్ మొదలైనవారు భాగస్థులు. అప్పటికి ఆయన పెద్ద కొడుకు ఆర్. యస్. ప్రకాష్ హాలీవుడ్‌లో సిసిల్. బి. డిమిల్ వద్ద దర్శకత్వంలో శిక్షణ పొంది వచ్చారు. ఆయన దర్శకత్వంలోనే గజేంద్రమోక్షం, మత్స్యావతారం, నందనార్, భీష్మప్రతిజ్ఞ చిత్రాలు నిర్మించారు శ్రీ వెంకయ్య.

చిత్ర పరిశ్రమకు మార్గదర్శకుడు, దర్శకుడు అయిన శ్రీ వెంకయ్యగారి పేరిట – ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నెలకొల్పిన "రఘుపతి వెంకయ్య అవార్డు" – 1987 సంవత్సరంలో - మా యిద్దరికీ లభించడం, అదృష్టంగా గౌరవంగా గర్వకారణంగా భావించి స్వీకరించాము.

వారిని స్మరిస్తూ ఈ చిన్న పుస్తకాన్ని సమర్పిస్తున్నాము.

బాపు, రమణ

ఈ పుస్తకంలో పొందు పరచిన
చిత్ర సమీక్షలూ వ్యాసాలూ, కార్టూన్‌లూ
1955-60 సంవత్సరాల మధ్య ఆంధ్రసచిత్రవారపత్రికలో
ప్రచురించినవి.

ఆ పత్రికాధిపతులూ, నాటి సంపాదకులూ అయిన
"అయ్యవారు" పూజ్యులు కీ.శే.శివలెంక శంభుప్రసాద్ గారిని
కృతజ్ఞతతో స్మరిస్తూ-
నేటి అధిపతులు శ్రీ రాధాకృష్ణగారికి నమస్కరిస్తూ-

బాపు, రమణ
ఏప్రిల్ 1990



# అశ్వరాజ్ వారి వినాయక చవితి

వాలుగాలిలో పడవలా సాఫీగా తాపీగా, సాగిపోయే 'వినాయక చవితి' (అశ్వరాజ్ పిక్చర్స్) చిత్రం ఆగస్టు 22న ఆంధ్రలో విడుదలయింది. అందరికీ తెలిసినదే అయినా, అందరూ ఏటేటా చెప్పి, చెప్పించుకునే కథను, దర్శకులు సముద్రాల రాఘవాచార్య (ఇదే తొలిసారి),తెరమీద కూడా రక్తిచెడకుండా చిత్రించారు. హాస్యం పేరిట వెకిలివేషాలకు ఆస్కారం ఇవ్వకుండా, కథావస్తువుకు తగ్గస్థాయిలోనే చిత్రాన్ని నడిపారు. దీని మాటలపాటల రచనకూడా ఆయనే చేశారు. సంగీత దర్శకుడు ఘంటసాల.



వినాయకుడు చంద్రుని శపించడం నాందిగా ఆరంభించి, శ్రీకృష్ణుడు తనపై పడిన నీలాపనిందను తొలగించుకొని, సత్యభామా, జాంబవతీయుతుడై ద్వారకకు చేరుకొన్న వృత్తాంతాన్ని సమగ్రంగా చిత్రించారు. ఇందులో మనోహరుడుగా భాసించిన కృష్ణుడు (ఎన్.టి. రామారావు) ప్రణయ ఘట్టాలలో అతి సున్నితమైన లలితమైన హాస్యాన్ని కూడా అందించాడు. కృష్ణ పాత్రకు రూపకల్పన, నిర్వహణ కూడా, అటు ఠీవిని, ఇటు చిలిపితనాన్ని కూడా మేళవించి నిలుపుకొన్నాయి. సత్యభామ పాత్ర నిర్వహణకూడా ప్రశంసనీయంగా ఉంది. చివర మటుకు, హఠాత్తుగా సత్యభామ 'నాగినీస్' బాణీలో పాడుతూ 'హెలెనీస్' డాన్సు చేయబోవడం చూస్తే మనసు చివుకు మంటుంది. సత్రాజిత్‌గా గుమ్మడి, రుక్మిణిగా కృష్ణకుమారి, ప్రసేనుడుగా రాజనాల, సత్యభామకోసం కృష్ణుడిపై పగపట్టిన శతధన్వుడుగా ఆర్. నాగేశ్వరరావు, నారదుడుగా ఆర్. ప్రకాష్, శివపార్వతులుగా జి. ఎన్. స్వామి (ఈ చిత్రానికి సహాయదర్శకుడు)సూర్యకళ, జాంబవతిగా సత్యాదేవి, వసంతకుడుగా బాలకృష్ణ నటించారు.

సముద్రాల



ఈ చిత్రంలో చక్కని పాటలూ పద్యాలూ శ్లోకాలూ పద్దెనిమిది ఉన్నాయి. తద్వారా సంగీత దర్శకుడు ఘంటసాల చక్కని తెలుగు సంగీతాన్ని వినిపించారు. ఘంటసాల, మాధవపెద్ది సత్యం, రామారావు, సుశీల, లీలారాణి, సరోజిని, వైదేహి, సత్యవతి, జమునారాణి ఆయా పాటలను శ్రావ్యంగాపాడారు. సత్యభామ, చెలికత్తెల యుగళగీతి, దానికి పసుమర్తి కృష్ణమూర్తి కల్పించిన నృత్యం చాలాబాగున్నాయి. కృష్ణలీలల నృత్యాలు కూడా ఆహ్లాదకరంగా ఉన్నాయి.

ఏనాటిదైనా, ఎలాటికథైనా సినిమాలోకి ఎక్కినపుడు సందేశా లివ్వడానికి సందేహించనవసరం లేదు. అందుకని, ఇందులో సామ్యా వాదాది నినాదాలను కూడా చెప్పించారు.

ఇవికాక ఖడ్గగదా మల్ల ముష్టియుద్ధాలు, రథాలమీద ఫోటోజెనిక్ తరుము లాటలూ, ఆఫ్రికాలో సింహాల పోట్లాటలూ అవీ ఉన్నాయి. పుణ్యం పురుషార్థమూసూ ... సత్కాల క్షేపం కావాలంటే నిక్షేపంగా వెళ్ళి కూర్చోవచ్చు.◆

**1957**

---

**అమ్మడు (శారద) పాపాయి (పద్మనాభం) కలిసి థర్మా మీటరుతో సూరమ్మ (సూర్యకాంతం) జరం కొలుస్తూంటారు.**

**అమ్మ : అమ్మబాబోయ్! బెజవాడంత వచ్చేసింది.**

**సూర : బెజవాడేమిటే!**

**అమ్మ : అవునత్తయ్యా 118 డిగ్రీలు వుంది.**

**సూర : అమ్మో! అయిసు బాబో అయిసు. అయినా 118 డిగ్రీ లుంటే మనుషులు బతుకుతారుటే?**

**అమ్మ : ఆఁ! బెజవాడలో మనుషులు బతకటం లేదా?**

**—దాగుడుమూతలు**



చలన చిత్ర రచన వచన వ్యాసంగర రంగంపై
సంగరం సరంగరాలు చెయ్యడాలు , కొయ్యడాలు
పొంగరం సరంగరాలు పొయ్యడాలు, తియ్యడాలు
రంగు హంగు పాటమాట చేపడాలు , వేపడాలు
శ్రుతులు లయులు కలపడాలు, యతులు మితులు మీరడాలు-
బా॥ సూత్రాత్పనడాలు , బా॥ తేహాత్ నూరడాలు
అక్షరూ॥ల ఆడడాలు , ద్వ్యర్థులు ఢీకొట్టడాలు
హైలాసులు కుట్టడాలు, 'ట్టించి గించిపొయ్యడాలు
మాటలు దక్కించుకోవడాలు, మాట దక్కడాలు
మాటల్లోపసషరా నాయనా! మరేవిటంటే మజాకా అనుకున్నవుట్రబాబూ
శతావధాని సముద్రాల చలచిత్రసీమలో శతసహస్రావధాని
సినీజన రంజన సీమకు ఆయన కలం రాజధాని
సాధించడం మాటలు కాదన్నదాన్ని - సినీమనకమనాన్ని
మాటలతోనే జయించి మించిన వాగ్ధాత ; వాగ్మి!



సినాదించుముందు కొత్త నిపానించుముందు...

## అన్నపూర్ణ వారి
# తోడికోడళ్ళు

శరత్‌చంద్ర చటర్జి పుస్తకాలు పాతిక వరకూ ఏకబిగిన చదివేసిన ఒక లాయరుగారిని అభిప్రాయం అడిగాడాయన మిత్రుడు.

“ఏముంది. బండెడు పాధధూళీ కుండెడు కన్నీళ్ళూ” అన్నాడు లాయరుగారు టూకీగా.

టాకీగా శరత్ కథ ‘నిష్కృతి’ని తెనిగించి, తెరమీది కెక్కించ డంలో, “తోడికోడళ్ళు” (అన్నపూర్ణా పిక్చర్స్) చిత్ర నిర్మాత మధుసూదనరావు, దర్శకుడు ఆదుర్తి సుబ్బారావు, రచయిత ఆత్రేయ కలిసి, కథలో సారాన్ని మటుకు పరిగ్రహించి, బండెడు పాదధూళి మీదా కుండెడు కన్నీళ్ళూ గుమ్మరించేసి, ఇందులో బెంగాలీ ధూళి

చెలరేగకుండా సర్దుబాటు చేసివేశారు. (అందువల్ల బెంగాలీ కథ గురించిన బెంగ అనవసరం.)

ఆపైన, పని తెలిసిన దర్శకుడూ, మితి తెలిసిన నటులూ కలిసి, ఒక మంచి తెలుగు చిత్రాన్ని తయారుచేశారు. ఇది ఎక్కడా విసుగెత్తకుండా కులాసాగా గంటకిగంటన్నర వేగంతోసాగిపోయి మూడు గంటల పొడుగు చిత్రం రెండు గంటల్లో పూర్తి అయినట్లనిపిస్తుంది.

మతి మరుపు కుటుంబరావుగారు అనే ప్లీడ రొకాయన డబ్బూ గట్రా బాగా గడించాడు. అదే ప్రయోజకత్వం, అదే పరమార్థం సర్వస్వం అని నమ్మినవాడు ఎం. ఎం. కుటుంబరావు. కక్కుర్తీ ఘరానా లేకపోయినా మొత్తానికి డబ్బు మనిషి. ఆయన భార్య అన్నపూర్ణమ్మగారు జబ్బు మనిషి. కృష్ణా రామా అనుకుంటూ, ఇంట్లో పిల్లల్ని ఆడిస్తూ కాలక్షేపం చేసేది. ఇల్లు చక్కబెట్టే భారం అంతా "మా యింటి మాలక్ష్మి" సుశీలకే ఒప్పగించారు దంపతులు. ఈ మా లక్ష్మి పదేళ్ళనాడు వారింట కాలుపెట్టాకనే, ఇంటిని సిరి వరిం

పేకాటా
పెళ్లాం మాటా



సిస్టర్! నో ఫియర్స్!
మిస్టర్! నో టియర్స్!



నాచే దుష్కృతి...
నాకే నిష్కృతి.....



చింది. అందుకని వారికి ఆమె మీద గురి. లాయరుగారి పినతండ్రి కొడుకు సత్యానికి ఆమె నిచ్చి పెళ్ళి చేశారు. సత్యం మంచి మనసు వాడు. కొన్నాళ్ళవరకూ సిగరెట్లూ అవీ కాలుస్తూ "కారులో షికారు చేసే నారి"మీదా, ఆ 'పాలబుగ్గలపాప' కట్టిన "చీర నేసిన వారి" మీదా కూడా కలిపి కవిత్వం చెప్పే స్థితిలో ఉన్నా క్రమ క్రమంగా, లోకంలో అన్యాయాలను చూస్తూ అడుగడుక్కీ ఆశ్చర్యపడుతూ బాధపడుతూ చివరకు కష్టజీవుల మధ్య నిలచి వారిని ఆదుకున్నంత మంచివాడు. ఐతే, అతడి ఈ యాత్రకి కారణం ఇచ్ఛాపూర్వకమైన సంకల్పం కాదు; వాళ్ళింటికి అనసూయ రావడం.

అనసూయ భర్త రమణయ్య, లాయరు కుటుంబరావుగారికి స్వయానా తమ్ముడు. పేకాటా, పెళ్ళాంమాటా యీ రమణయ్యకి జవదాటరానివి. వాళ్ళ ఒక్కగానొక్క బిడ్డడు అల్లరి మొద్దుగా పెరిగినవాడు. ఈ ఇస్తోకుపాడి పల్లెనుండి పట్నం వచ్చినప్పటి నుండీ సమిష్టి కుటుంబంలో కలతలు ఆరంభమయ్యాయి. అనసూయ దుర్గుణవతి. ఆవిడ ఇంట్లో సూటిపోటి మాటలు, పితూరీలు మొదలెట్టుతుంది. తత్ఫలితంగా "డబ్బు గడించి ప్రయోజకుడు" కాలేకపోయిన సత్యం ఇల్లువదలి వెళ్ళవలసి వస్తుంది. అన్నగారి ఆజ్ఞ ప్రకారం, పల్లెకు వెళ్ళి అక్కడ బంజరుగా పడివున్న మెరక పొలాన్ని కష్టపడి సాగుచేస్తాడు. అక్కడ కష్టజీవులనూ ఆదుకొంటాడు.

పట్నంలో కుటుంబరావుకీ అన్నపూర్ణకీ కన్ను మరగేసి డబ్బు దొంగిలిస్తున్న అనసూయ కన్ను మరగేసి దుర్మార్గాన చెలరేగ సాగిన రమణయ్య, మిల్లు మానేజరు వైకుంఠాల అవసరాలు పట్నంలో ఇనప్పెట్టి దగ్గిర్నించి చివరికి పల్లెలో పొలం మీదకి తిరుగుతాయి. ఆ వేళకి తగవు పెరగి, దున్నేవాడిదే పొలం అన్న నినాదందాకా, దాని మీద నుంచి హైకోర్టు దాకా వెళ్తుంది కథ.

హైకోర్టువారు దీన్ని పరిష్కరించడం ఎందుకన్నట్టు లాయరు కుటుంబరావే, తన స్వతస్సిద్ధమైన బేఖాతరీ తరహాలో, మతిమరుపు తనంతో, సాగుచేసుకోండి పొండి అని వివాదాస్పద భూమిని మంజూరు చేసేస్తాడు. ఆ నినాదం; ఆ సమస్య అక్కడితో వదలి వేశారు. దుష్టులెవరో శిష్టు లెవరో తెలుసుకున్న కుటుంబరావు, శిష్టుల

కష్టాలకీ, తన మతిమరపు తనయు, తన నిర్లక్ష్యం కారణమని గ్రహించి ఆ మంచివాళ్ళకి తన ఆస్తిని రాసిచ్చి నిష్కృతి చేసుకుంటాడు. మంచివాడైన సత్యం అతని భార్య సుశీ ముస్తాబై జటకా ఎక్కి ఝాం మని పట్నం వచ్చేస్తారు. జంకూగొంకూ లేకుండా (సిస్టర్‌నోఫియర్స్) దుర్మార్గపు పనులుచేసి, అందర్నీ అవస్థపెట్టిన విలన్ వైకుంఠం చివ రికి, కంటనీరు పెట్టాల్సిన అవసరం కూడా లేకుండా టూకీగా తనకి తనే చెంపలేసుకొని దాసుడి తప్పులు దండంతో సరిపెడతాడు.

ఇదీ కథ. ఇందులో హాస్యం, చక్కని నృత్యాలూ, మనసుకు హత్తుకునే సన్నివేశాలూ పొందుపరచి ఓన్ని హుషారుగా నడిపారు.

ఈ హుషారుకి సగంబలం, కుటుంబరావుగా నటించిన రంగా రావు సామర్థ్యం. చాలా రోజుల తరువాత, ఈ చిత్రంలో రంగారావుకు నటించడానికి, ప్రేక్షకులకు చూచి ఆనందించడానికి సజీవమైన ఆహ్లాదకరమైన భూమిక రూపొందింది. ఓన్ని ఇంత చక్కగా తీర్చి దిద్దినందుకు దర్శక నిర్మాతలూ, నటుడూ గూడా అభినందనీయులు. ఆత్రేయ వ్రాసిన పాటలు, దీనికి అన్నివిధాలా తగిన స్థాయిలో చైతన్యంతో ఒప్పాయి. హుషారుగా సాగాయి. "ఇది" అనే పదం మీద ఆత్రేయ విన్యాసాలు మొదట్లో 'కొంత ఇది'గానే ఉన్నా దరి మిలా "కాస్త ఇది" అనిపించి పోను పోను 'మరీ 'ఇది' గా తయా రయ్యాయి. పాటలన్నీ బాగున్నాయి. వాటి వరసలు విన్నవారికి నోట కొచ్చేటంత తేలికగా, నేర్చుకోవాలనిపించేటంత అందంగా హాయిగా ఉన్నాయి. సుశీల, జిక్కి, ఘంటసాల మొదలగువారు ఈ పాటలు పాడారు. సంగీత దర్శకుడు వేణు. ఇవికాక, ఇ. వి. సరోజ, చోప్రాల నృత్యం ఒకటి ప్రత్యేకం చెప్పుకోతగ్గది.

నటీ నటులు అందరూ ప్రతిభావంతులే. సుశీలగా సావిత్రి, అన్నపూర్ణగా కన్నాంబ, అనసూయగా సూర్యకాంతం, మిల్లు మేనే జరుగా జగ్గయ్య, రమణయ్యగా స్టార్ వాల్యూకు రెట్టింపు ప్రతిభగల రేలంగి, పడ్డీవ్యాపారస్థుడుగా చదలవాడ మొదలగువారంతా ఆయా పాత్రల అవధుల మేరకు చక్కగా నటించారు.

ఉన్నవారిలో, ప్రత్యేకం ప్రశంసించ తగ్గ కృషి నాగేశ్వరరావుది: అతడు నటించిన సత్యం పాత్రకు సమగ్రమైన రూపకల్పన జరిగినట్లు

కనబడదు. ఈ పాత్ర గుణగణాలకూ, లక్షణాలకూ, మాటలకూ, ప్రవర్తనతో ఆద్యంతం పొసగలేదు. ఉన్న భూసంస్కరణల సమస్యతో జోడించి, దానిని అయోమయంచేసి వదలివేయడంవల్లా, పరిస్థితుల మూలంగా పల్లెటూరు వచ్చి, పరిస్థితులు అనుకూలించగానే మళ్ళీ మామూలుగా పట్నం వెళ్ళిపోయినట్లు చూపించడంవల్లా ఈ పాత్రకు ఆపాదించిన నిజాయితీ కొంత దెబ్బ తిన్నట్టు కనబడుతుంది. ఈ లోపం కొట్టొచ్చినట్టు కనబడకుండా, నమ్మ తగినంత చక్కగా నాగేశ్వరరావు ఈ భూమికను పోషించడానికి ప్రయత్నించి మంచి ఫలితాలు సాధించాడు. కొంత బాగా రూపొందించిన భూమిక ఉన్నపుడు, సమర్థుడైన నటుడు దానిని నిర్వహించినపుడు మాత్రమే ఎవరికైనా ఈ అంశాలు చర్చనీయాలు అవుతాయి. లేకపోతే రోజూ వినబడే నినాదాలలాగా వేటినీ పట్టించుకోకుండా వదలివేయవచ్చు.

ఎందుకైనా, నినదించేముందు కాస్త నిదానించి మరీ అందుకు పూనుకోవడం వాంఛనీయం.◆

**1957**

ఆత్రేయ





# బాపు కార్టూనులు

సుందరం సరుచిరం
సుస్వరం సుమధురం
శోభనం మోహనం
గానరాజ్యేశ్వరం

మల్లీశ్వరి సంగీతం
మళ్లీ కావాలంటే
మళ్లీ మల్లీశ్వరినే
తియ్యాలా? వెయ్యాలా?
వెడెలామరియొకపరి
పాడాలా నీలాంబరి
ఉయ్యాలా"ఊపాలా?
వెయ్యాలా! చెప్పుమయ్యా
నిరుడు విరిసిన
స్వరసరోజాలెక్కడయ్యా!
కరడుగట్టిన
గానసుధలను కరుగవయ్యా

నైషధం పరమౌషధమ్మని
ఎవరు అన్నారు?
మీరేల విన్నారూ?
మీలోని సుప్త సుప్త
సప్తస్వర వనౌషధం
మాక్కావాలి మేష్టారూ!

ఆదర్శవాదికి ఆదర్శం ఏమవుతుంది? మామూలుగా తోడునీడ, వెన్నెముక, జీవిత రథసారథి, పోనుపోను జోహారు, అనక చిరకీర్తి లాంటివి అవుతుంది. ఉండుండి ఒక్కొక్క సారి మెడకు గుదిబండ అవుతుంది. స్వార్థానికీ, త్యాగానికి మధ్య సరిహద్దుమీద నిల్చుని అటో ఇటో తెల్చుకోవలసిన వాడికి పెద్ద సమస్య అవుతుంది. మంచివాడైతే, పట్టుదలగలవాడైతే,

# అనుపమ చిత్రం
# ఎం.ఎల్.ఎ

ఆ గుదిబండని ఓ పక్క మోస్తూనే, మరోవంక దాన్నే పట్టుకుని తను పడిపోకుండా వేళ్ళాడుతూ నిలబడవలసిన విచిత్రమైన పరిస్థితి ఏర్పడుతుంది. కాని, దర్మాధర్మాల, పాప పుణ్యాల, నీత్యవినీతుల నిర్వచనాలు కలిసిపోయి సరిహద్దులు జరుపేసుకోవడానికి, ఆత్మ వంచనకూ పరవంచనకూ సదుపాయాలు వున్న ఈ రోజులలో ఉప్పు కారం తినే మనిషి అప్పుడేం చేస్తాడు?



తిలక్



పెంచ్యాల

ఆదర్శానికి విడాకులిచ్చి పదవుల నిచ్చెన పైకెగబాకుతాడా? లేకపోతే, దాంతో కలిసి కిందపడి దెబ్బలు తింటాడా?

ఈ ప్రశ్నతో సతమతమైన ఒక రాజకీయవాది కథను "ఎం.ఎల్.ఏ". (అనుపమ ఫిలింస్)లో చిత్రించారు. నిత్య జీవితంలో కనబడే, వినబడే ఆదర్శవాదుల కథల తరహాలెలావున్నా, కథలలో ఆదర్శవాదులు, కాస్త అటూ ఇటూగా ఆదర్శప్రాయమైన నిర్ణయం చేసేసి నీతిగీతి పాడేస్తారు.

"ఎం.ఎల్.ఏ" చిత్రంలో శాసన సభ్యుడుఎదుర్కొన్నసమస్యకూ, పడ్డ ఆవేదనకూ ప్రాతిపదికలో తులంకన్న బలం లేకపోయినా, ఉన్నంతలో నమ్మతగినంతగా నటుడు జగ్గయ్య, ఆ పాత్రకు చిత్త శుద్ధిని, నిజాయితీని సమకూర్చి ఒప్పించాడు. దాసు "ఎం.ఎల్.ఏ." కావటానికి ముందు మామూలుగా ఆదర్శ యువకుడు. పైజమాలాల్చీ, వెయిస్ట్ కోటూ వేసుకొని, ఫోటోజెనిక్‌గా (మేకప్‌లో కోటా ఒక పాల తగ్గిస్తే మరింత బాగుండేది) తల తాటిస్తూ ఉంటాడు. అతడు ఆదర్శ యువకుడని సావిత్రి, రమణమూర్తి, పెరుమాళ్ళూ వాళ్ళూ మనకి చెబుతారు. కాని 'దామోదరం' వేషధారి గుమ్మడి నడిగితే, సర్కారు ఉద్యోగంలో ఉంటూ, ఏదో (ఏది) పెర్మిట్లవ్యవహారంలో రహస్యాన్ని తనకు అమ్మి లంచంతిన్నాడని చెప్పేవాడే. ఇది తెలుసు కాబట్టి అలుసు తీసుకొని ఈ దాసును వాడుకోవచ్చునన్న ఊహతో భూస్వాములు దామోదరం. ఆ కో వారు శాసన సభ ఎన్నికలలో దాసుకు మద్దతు ఇస్తారు. మంచివాడు 'మనవాడు' అన్న నమ్మకంతో, గాంధేయ మార్గాను సారి భూషయ్య ఆధ్వర్యాన రైతులు కూడా అతన్ని బలపరుస్తారు ఇలా "ధనికులం, రైతుకులంకలసి" అతన్ని గెలిపించారు. తండ్రి చాటున ఉంటూ బీదసాదలకు సేవచేసే నిర్మల దాసుని పెళ్ళి చేసుకొని కథనడుపుతుంది. ఈ కథకు, 1957 అక్టోబరు 9 వ తేదినాటికి (ఆనకచాలాకాలందాకా) కూడా 'వార్త' అనిపించు కునే ఘట్టంలోనే ఉండే "భూవసతికి గరిష్టపరిమితి" సమస్యను మితిమీరని విధాన జోడించి తెలుగు చలనచిత్ర చరిత్రలో 'అనుపమ' కార్యం తలపెట్టి ఒప్పించారు. ఆనక, ఎందుకో అందరికీ తెలిసినా, 'ఇదెందుకు చెపుమ?' అనిపించే ప్రేమాయణాన్ని ఈ రాజకీయ రామాయణంలో మిళాయించారు - 'దీక్షితగలకుండా.

'ఎం. ఎల్. ఏ' దాసు కౌలుదార్ల రక్షణ సమస్యను మంత్రి గార్లకు విన్నవించుతాడు. బళ్ళు పెట్టించడం, రోడ్లువేయించడం లాంటి, సత్కార్యాలు త్వరగా తెమిలేలా చూచి మంచి వాడనిపించు కుంటాడు. లావు పాటి 'లా' పుస్తకం చదువుతున్న శాసనసభ్యుడు, సరిగ్గా పదిపేజీలేమిగిలితే, అది మాపటికే చదివెయ్యాలికానీ రేపటికి హాయిదావెయ్యరాదనీ, భూసంస్కరణల గురించిన రికార్డులు చాలా ఉన్నప్పటికన్నీ మంచి బాలుడు రామువలె పెందల కడనే పడుకుని మర్నాడే చదవాలనీ అంతగా అయితే, సావిత్రి ఉరఫ్ నిర్మలకి కొన్ని ఇచ్చి వాట సారాంశం (పరీక్షలో 'గైడు' లా) రాయించుకొని చదివెయ్యొచ్చుననీ సందేశాలు బట్వాడా చేస్తాడు.



"ఇవన్నీ బాగానే ఉన్నాయి. ఖులఖులాగ్గా నీ యిష్టం వచ్చినంత దేస్సేవచెయ్యి కానీ, భూసంస్కరణజోలికి పోకు సుమా" అని హెచ్చరిస్తాడు అతనికి పెట్టుబడి పెట్టిన గుమ్మడి. దాసుకి ఈయనతో పాత మొహమాటా లున్నాయి. పైగా ఎం.ఎల్. ఏ. అయ్యాక, క్వార్టర్సులో ఉండి కాలక్షేపం చెయ్యకుండా, ఆలోచిస్తూ బాధపడుతూ తిరగడానికి డాబాలాంట సదుపాయాలున్న పెద్దబంగళాలో కాపరం పెడతాడు దామోదరం మద్ధతుతో.

ప్రజలు తనను నమ్మి ఎన్నుకున్నారన్న సత్యం మీద గౌరవంతో విధ్యుక్త ధర్మ పరిజ్ఞానంతో, దాసు భూకమతాలకు పరిమితి వ్యావహారం తలపెట్టి , మంత్రి దగ్గరకు రాయబారం వెళ్ళి వినతి పత్రం


వన్ మినిట్ !
మేకప్ తుడుచుకుని
వచ్చేస్తా -






షాట్ రెడీగా వుందట !
మేడమ్ - నచ్చిందో లేదో
స్పష్టంగా చెప్తే
ఇంకో విగ్గు మారుద్దాం

సమర్పించ నిశ్చయిస్తాడు.

అప్పటికే, దూర దృష్టితో ఆలోచించి, భూవసతిని ఫ్యాక్టరీ ఆస్థిగా ఫిరాయిం చెయ్యడానికి పథకం వేసుకున్న దామోదరం వర్గానికి కోపం వస్తుంది.

పూర్వం ఒకసారి లంచం తీసుకున్న సంగతి అధికారులకి తెలిసిపోయిందనీ, ఐదేళ్ళు ప్రమోషన్ ఇవ్వకూడదని ఆర్డరు వేశారనీ తెలుపుతూ దాసు తనకు రాసిన ఉత్తరం బయటకు తీసి, దాంతో "నీ భవిష్యత్తును గంగలో కలిపేస్తాను" అంటూ దాసును భయపెడతాడు దామోదరం. దాసు భయపడతాడుకూడా. చివరికి, ఊళ్ళోవాళ్ళూ కట్టుకున్న పెళ్ళాం గూడా అసహ్యించుకోవడంతో తెగించి, "కళా వెంకట్రావుగారి" దగ్గరకు రాయబారం వెళ్ళి వినతి పత్రం అంద జేస్తాడు.

"భూవసతికి 30ఎకరాల గరిష్ట పరిమితి ఉండాలండి"అంటాడు దాసు. భూసంస్కరణల రికార్డులను ఆరోజు రాత్రి తను చదవక, సావిత్రి చదివి సారాంశం వ్రాసి ఇచ్చినందువల్ల అదిమెట్టో, మాగాణో స్పష్టంగా చెప్పడు. మెట్టగురించి ఎవరూ పట్టించుకోరు గాబట్టి, మాగాణీ అని అందరికీ తెలుసు కాబట్టి ఫరవాలేదు.

చివరికి దామోదరానికి కోపం వచ్చేస్తుంది. ఆ ఉత్తరం బయట పెడదామని చూస్తాడుగానీ, కొన్ని సినిమా కారణాలవల్ల అది రమణ మూర్తికి దొరుకుతుంది. దాన్ని అతడు దాసుకు చూపి చింపి పారేస్తాడు. అక్కడితో దామోదరానికి మతిపోతుంది. అందువల్లనే దాసును లోగడ శిక్షించిన గవర్నమెంటు అధికారుల ద్వారా ఆ గుట్టు బయట పెట్టవచ్చునని తట్టదు. అంతేకాదు. దాసుని ఖూనీ చేయించాలను కుంటాడు కూడా. దానికేనా పాత సినిమా అయిడియా వాడుతాడు. అతరువాతది- దాసు తన భార్య శీలమును శంకించుట, స్వగతంగా, ప్రకాశంగా పవర్‌ఫుల్ డైలాగులు అనుకుంటూ, వింటూ, బాధ పడి ఆనక లారీకిందపడి, ఆస్పత్రిలో చేరుట- తక్షణమే అతని స్టార్ వాల్యూ పెరుగుట, గ్రూపు ఫోటో అన్నీ ఉన్నాయి.

నిర్మల నిర్మల కాదనీ మారువేషంలోవున్న 'సుశీల'అనీబుజువు అవుతుంది.

కథాంతం ఎలావున్నా, అనేక విధాల మెచ్చుకోతగ్గ చిత్రం. "ఎం.ఎల్.ఏ." మనుషుల్ని రెండుతో భాగించి మంచిచెడ్డా అని ఖచ్చితంగా పోతపోసినందువల్ల రాజకుమారుడూ రాక్షసుడూ శ్రీమహావిష్ణువుల కథల పరిమళం అక్కడక్కడ గుబాళించినా, రాజకీయవాదుల స్వరూప స్వభావాలను, ఆదర్శాలకు, వాటిని వెనకేసుకొచ్చే పెద్దలకూ ఉండే చుట్టరికాల లోతుపాతులు, తీరుతెన్నులనూ తెలుగునాట ఎన్నికల తిరునాళ్ళనూ, దర్శకుడు తిలక్ ఇందులో ప్రతిభావంతంగా చిత్రించి చక్కటి వ్యాఖ్యానంగా రూపొందించారు. ఇందులో నటీనటులంతా కూడా, అతి ఉత్సాహంతో సహకరించి మనం గొప్పగా చెప్పుకోతగ్గ మంచి తెలుగు చిత్రాన్ని రూపొందించారు. బాక్సాఫీస్ సూత్రాలు తాళ్ళుగా తయారై, బలవంతం చేసివుండకపోతే, దర్శకుడు తిలక్, ఈ నటీనటులతో ఇదే కథావస్తువుతో ఇంతకన్నా ఉత్తమచిత్రాన్ని రూపొందించ గలిగేవారని అది అఖిల భారత స్థాయిలో పేరు తెచ్చిపెట్టగలిగేదని అనుకున్నపుడు వర్తమాన పరిస్థితుల మీద ఎవరికైనా చిరాకు కలుగుతుంది...

ఈ చిత్రంలో కథావస్తువును బట్టి, ఆశయాలూ, ఆదర్శాలూ, ఆచరణ, ధర్మంలాంటి మాటలు తప్పనివే అయినా, వాటిని యతిప్రాసలతో కూర్చి, సామెతలలో పేర్చి మాటలు సంభాషణలన్నింటిలోను చేర్చి గుప్పించడంతో, ఆశయాలూ, ఆదర్శాలూ, అప్పడాలూ, వడియాలూ అని వినబడే పరిస్థితికి వచ్చాయి. వెనకటికెవరో శుద్ధగ్రాంథికం మాట్లాడబోయి 'క్రందిపప్పు' అస్పష్టంగా, సజీవంగా చైతన్యవంతంగా ఒప్పిన మనుషులనోట, కథపేరిట పడికట్టురాళ్ళలాంటి మాటలు పనిగట్టుకు అనిపించడం భావ్యం అనిపించలేదు. పెరుమాళ్లు, సావిత్రి ఉత్తమంగా నటించిన పాత్రలు వీటివల్ల కొంత అవాస్తవ ప్రాయాలయాయి. పెరుమాళ్లు నటన పాత చిత్రా లన్నిటికన్న పదునుగా తూకంగా సాగింది. ఉన్నవారిలో గుమ్మడి ఉత్తమంగా నటించాడు.

దర్శకుడు తిలక్ ఈ చిత్రంలో రమణమూర్తి అనే కొత్త నటుడిని పరిచయం చేశారు. జంకూ గొంకూ లేకుండా, చెప్పుకోతగ్గ సౌలభ్యం ఉట్టిపడేలా ఆ నటుడు తన పాత్రను హుషారుగా నిర్వహించాడు. ఇతనికి మంచి భవిష్యత్తు ఉందని ఆశించవచ్చు. కొత్త నటుడు అన్న భావం చూస్తున్నంతసేపూ కలగదు. ఎలాగా డబ్బున్న వాడి

వేషం కాబట్టి ఇంకో రెండుసార్లు దుస్తులు, ఒకసారేనా 'హెయిర్ స్టైలు' మార్పించి వుంటే బావుండేదనిపించింది. దిలీప్‌కుమార్ వేషం వేసుకుని, రాజ్‌కపూర్ పద్ధతిలో వ్యవహరించి నట్లనిపిస్తుంది- నిజం అది కాకపోయినా, అతగాడి జతగా గిరిజ ఎన్నడూ లేనంత హుషారుగా నటించింది. ఇందులో ఆమె వేషం విలాసం రూపురేఖలూ కూడా బావున్నాయి.

ముఖ్యంగా ఔట్‌డోర్ దృశ్యాలలో (ఇవి చిత్రంలో పుష్కలంగా ఉండి ప్రాణానికి హాయి అనిపించాయి. ఈ జంట పాల్గొన్న సన్నివేశాలు చాలా బాగున్నాయి.—'జామిచెట్టు మీదనున్న జాతి రామచిలుకా" అనేపాట (రాజా, జిక్కి) మనోహరంగా ఉంది. మొత్తం మీద ఈ చిత్రంలో తొమ్మిది పాటలూ వినడానికి చాలా బాగున్నాయి. రెండు మూడు తగ్గిస్తే ఇంకా బాగుండేది. పెండ్యాల (భాగ్యరేఖ) నాగేశ్వరరావు ఇందులో కూడా తియ్యటి తెలుగు సంగీతాన్ని, మధురమైన దాన్ని వినిపించారు. ఒకచోట మాత్రం గీతారాయ్ బ్రాండు 'ఆహా ఊహల' పాట తప్పిందికాదు. గులాబీకి ముళ్ళలాగ, అన్ని శాఖలలోను పరిస్థితి ఇలాగే ఉంటోంది. అక్కడ సూర్యకళ బొంబాయి వాళ్ళ డాన్సు లాంటిది వేసింది. ఉన్నవాటిలో ఉత్తమోత్తమం అనదగ్గది ఘంటసాల, జానకి అనే కొత్త గాయని పాడిన జానపదపథాన సాగిన 'లంబాడోళ్ళ రామదాసా' అనే పాట చాలా రోజులు జ్ఞాపకం ఉంటుంది.

ఈ కొత్త గాయనికి, కుర్షీద్ అనే నర్తకికీ కూడా తిలక్ ఈ చిత్రంలో అవకాశం ఇచ్చి వినతగ్గ పాటనీ, కనతగ్గ నృత్యాన్నీ సమర్పించారు. ప్రజాదరణ పొందవలసిన చిత్రం ఇది.◆

**1957**

---

"తాతయ్యలకు బోల్డు ఆస్తి వుండును. దానిని వాళ్ళు మనుమలకు ఇచ్చెదరు. అంతవరకు మనము అమ్మడిని పెళ్ళి చేసుకోరాదు అని అమ్మ చెప్పెను." అంటూ పాపాయి (పద్మనాభం) పరిచయం.

—దాగుడుమూతలు



బాపు కార్టూనులు
సంతకం అక్కరలేని కవి ఆరుద్ర
అంత్యప్రాసతో ఆయన వ్రాలుముద్ర
ఆరుద్ర 'పాఠశాల పాట' చాల
వడిగా ఒరవడి దిద్దింది తెలుగు సినిమాల
అది 'ప్రాసాంతకం' అన్నది గిట్టని వాళ్ళ కట్టుడు పన్ను
దానికి విగ్రహం తాత్పర్యం అడగద్దు నన్ను
మాటలు పన్నడంలో గడసరి
పాటలు పేనడంలో పొడగరి
జీవితం అంత అద్భుతంగా ఉపమించడంలో నేర్పరి
పోయట్రిక్కు ప్రయోగించటం – సరేసరి
అర్జంటు రచనల్లో కూడా మరి
అరమెరుపైనా – తప్పని సరి!

# ధ్రువతార

గ్లిసరిన్ లేకుండా కడవలకొద్దీ కన్నీళ్లు కురిపించగల తార అనిమటుకే సినీమనీషులు, కన్నాంబను ఒకప్పుడు మెచ్చుకునేవారు. తరువాత కొన్నాళ్ళకి తెలిసింది; గ్లిసరిన్ లేకుండా తను కంట నీరు పెట్టడమే కాక, వేలాది ప్రేక్షకులను శోకావహుల్ని చేయగల ప్రజ్ఞ ఆమె సొత్తు అని అందరూ గ్రహించారని. ఆ తరవాత ఇంకొకటి తెలిసింది.



కన్నాంబ కోపం నటిస్తే కథలో పాత్రలే కాక, సినిమా తీసేచోట సాటి నటీనటులూ సినిమాలో ప్రేక్షకులు కూడా భయపడతారనీను. తర వాత మరోటి తెలిసింది. కన్నాంబ మాతృవాత్సల్యం ప్రదర్శిస్తే ముగ్ధులు కాని ప్రేక్షకులుండరు అని. బహుశా ఆమెలో నిజమైన ప్రజ్ఞ ఉన్నందువల్లనే ఆమె గ్లమర్ స్టార్ కాకపోయి ఉండాలని చాలా మంది అంటూ ఉంటారు.

సినీతారా పథంలో ఆమె స్థానం ఎక్కడవున్నా నటిగా ఆమెది ధ్రువస్థానం.

సినీలోక భ్రమణంలో వెళ్ళ గలిగినంత ఎత్తుకు వెళ్ళాక, అక్కడనుంచి దిగిపోవడం సాధారణం. ఎవరో కొందరే అలా స్థిరంగా నిలబడగలరు. కొందరే, అటు ప్రేక్షకుల అభిమానంతోపాటు ఇటు సాటి నటీనటుల గౌరవమూ సంపాదించి నిలుపుకోగలరు. కన్నాంబ 24 సంవత్సరాలుగా ఈ అరుదైన స్థానంలో నిలచింది. వయసుతో పాటు మనిషి పెరగకుండా తరగకుండా, ఎప్పుడూ ఒక్కలాగే ఉండడం కూడా సినిమా ప్రపంచంలో బహు అరుదు. కన్నాంబను సెట్ మీద చూసినవారు ఈవిడ నానాటికీ పెద్దదవుతోందా చిన్నదవు తోందా అని విస్తుపోతూ వుంటారు.

తెలుగు నాటక రంగస్థలం మీదా సినిమాలోనూ గడించిన అనుభవంతోను, కొన్నాళ్ళు కష్టపడి నేర్చుకున్న తమిళంతోను కన్నాంబ ఈనాడు తమిళ చలనచిత్ర ప్రపంచంలో కూడా గౌరవనీయ మైన స్థానం ఆక్రమించుకుంది. ఆమె విగ్రహం, మాటతీరూ కూడా కావాలంటే పదహారణాల దక్షిణాది ఫక్కీలో కుదురుతాయి అమెకు.

తమిళ చిత్రాలలో, ఆమె నడిపిన కణ్ణగి పాత్రకు, చాలా గౌరవం ఉంది. ఒకనాడు దొమ్మేటిపక్కన రంగూన్‌రౌడీలో ప్రభా వతి పాత్రకూ, హరిశ్చంద్రలో చంద్రమతికీ, తెలుగుదేశంలో లభించి నంత గౌరవం ఇక్కడ ఈ పాత్ర నిర్వహణ పొందింది. ఈ రోజున తమిళనాడులో, ఆదర్శమాతకు రూపకల్పన కన్నాంబనుచూసే చేస్తారు. ప్రజ్ఞకొద్దీ పైకి వచ్చిన వారి పేరుమటుకు వాడుకునేవారు అక్కడా ఇక్కడా ఎక్కడా ఉంటూనే వుంటారు. ఆ కారణంగా కన్నాంబ ఒకొక్కక్కసారి తలా తోకాలేని పాత్రలు భరించవలసి వస్తోంది. ఉన్నపళంగా పాత్రలో కరిగి లీనమై పోవాలన్న దురభి

ప్రాయాలూ అపోహలూ లేని సటి కాబట్టి, ఆమె, తగని భూమికను చేపట్టినా దాని పక్కన నిలబడి చాతుర్యంతో, సమర్థుల స్థైర్యంతో దానిని ఉద్ధరించి, తిరుగా నడపగలదు. అయితే ఇటువంటి ప్రజ్ఞ ఉన్నదన్న ధీమాతో తరచుగా ఆమె ఆ ప్రజ్ఞను పరీక్షకు పెట్టడం తగదు. తన ప్రజ్ఞకు తగినపాటినే ఎన్నుకోవడం మంచిది; వాంఛనీయం.◆

28-10-59

---

రామం (అక్కినేని): అవసరం లేకపోయినా రోజూ అందరి దగ్గిరా అప్పులెందుకు చేస్తావ్?

అప్పారావు (రాజబాబు): చంద్రుడెందుకు వెన్నెల కాస్తాడు?
పువ్వు లెందుకు పూస్తాయి?
పిల్లలెందుకు నవ్వుతారు ?
కోకి లెందుకు కూస్తుంది ?
కృష్ణశాస్త్రి ఎందుకు పొయెట్రీ రాస్తాడు?
ఈ అప్పారావు అందుకే అప్పులు చేస్తాడు.

—అందాలరాముడు

---

కంట్రాక్టరు (రావుగోపాలరావు) హలంతో :

ఏంటి పిల్లా. అయన మీద పడ్డావ్. కళ్ళు మసకేశాయేటి.

హలం : కాదు. అయనే మన పాసెంజరనుకున్నాను.

క : ఒళ్లు కరుసయిపోతుంది జాగర్తమరి. సోమరాజు గాడికీ ఆడి బావగారికీ నీకు డిఫరెన్సు తెల్దం లేదు.

హ :- సోమరాజో కావరాజో, ఎంతమందిని గుర్తుపెట్టుకోను. ఒక్క చోట నాలుగు రోజులు డూటీ ఎయ్యవు.

—ముత్యాలముగ్గు

# బాపు కార్టూనులు



"ఏం బాబూ - దా - ఏవిటి కథ!
కులాసాగా వుంటున్నావా!
ఝువిరేటే! కాలం మారిపోచ్చి
అంటున్నావా!
ఖాదు బ్రదర్ - నువ్వే మారిపోచ్చిలేదు
అదీ కథ - వింటున్నావా!
హేదో ఆయనలా వాగుతాడూ
మనకెందుకనుకుంటున్నావా - ఆఁ?

అటుసూరీడింటు పొంచిన
అదేమిటని విస్తుపోకు
గిరుక్కుమని వెనుతిరిగి న
మస్కరించు - తెల్లబోకు
ఎగిరిపడే కెరటాలను
రొమ్ము విరిచి ఎదిరించకు
ఎగిరి గంతువేసి మీది
కెగసి స్వారి చేయుమా ది
గాలు పడకు విడకు మొడుపు
దర్జాగా బతుకు నడుపు"

జీవన్నాటక రంగంపై
నటరంగంపైన తెరంగంపై
ముత్త్రరాల పెద్దంతరాలపై
ముక్కుమాటలతో ముద్దుబాటగా
మారక సాగే సీనియర్సార్ -

ఆయన 'సీయస్సారు' చైర్మన్ పాండీబజారు
పక్కనొక్క బ్యాకు కారు
దాని పక్కదాని పేరు - ఫిల్మీ పాండీబజారు



# శర్వాణీ వారి అక్క చెల్లెళ్ళు

## నేనా? మా అక్కా?
## తిరగేసిన బొక్కా!



పడితే పడ్డవాళ్ళ పళ్ళు రాల్తాయి. పార బడితే పక్కవాళ్ళవి రాల్తాయి. అయితే చెడ్డవాళ్ళకి మాత్రమే పైసదుపాయం జరుగుతుందని (పార) పడ్డవాళ్ళు నిక్షేపంలా ఉంటారని సినిమా నీతి.

కథలలో సుధలలాగ చెప్పాకో తగ్గడబ్బా, చెల్లెలధికారాలా ఉన్న వాళ్ళు పొరబాటున పారబడినా

ఎంత పెద్ద సినిమా కథలు సంభవిస్తాయో చెప్పలేము.

'అక్క చెల్లెళ్లు' (శర్వాణీపిక్చర్స్) చిత్రంలో సుధవల్ల పెద్ద సినిమాకథే జరిగింది.

ఒక ధర్మారావుగారికి బోలెడు డబ్బూ, ఇద్దరు కూతుళ్లూను. అందుకని ఆయన ఆస్తిని, రెండుతో భాగించి పంచిఇచ్చాడు. పెద్దమ్మాయి పద్మ చాలా మంచిది కాబట్టి, (క్రాస్‌వర్డ్ పజిల్సులో కాంబినేషన్ పెర్ముట్యేషన్ సూత్రాల లెక్కల ప్రకారం) ఆమె భర్త సుదర్శన్ జూదరి. అతగాడు భార్య వాటా డబ్బు పట్టుకుని 'పేకాట (వి)కుల'తో జూదంఆడి, ఓడి, పోయాడు. కాస్త అటూ ఇటుగా, ధర్మారావుగారి రెండోకూతురు సుధకు పెళ్లిఅయింది. ఒక మధు, ఆమెతోలుతున్న కారుకి అడ్డపడి, ఆదెబ్బకితూలి వారింటి అల్లుడుగా పడ్డాడు. (పతివ్రత భూమికను చొక్కా తిరగేసినట్టు మార్చి, ఈ పాత్రను రూపొందించారు) తక్షణం ధర్మారావుగారు కాలధర్మంచేస్తూ పెద్దకుమార్తెను, ఆమెకుమారుడు మురళిని చిన్నల్లుడికి, కుమార్తె సుధకీ ఒప్పగిస్తారు. పద్మ ఇమిటేషన్ బడదీదీ లాగా ఇంటికి పెత్తనం వహిస్తుంది. అపుడు, సూర్యకాంతం భద్రమ్మ అనే విలన్ వేషంలో వచ్చి ఆ కుటుంబంలో కలతలురేపుతుంది. ఆస్తికి అధికారిణి అయిన సుధను 'బడదీదీ' ఖాతరు చేయటం లేదంటూ అరంభించి, సుధలో అహంకారాన్ని మేల్కొలుపుతుంది. అక్కడితో ఆ పిల్లకి తిక్క రేగి, తోబుట్టువును ఇల్లువెళ్లగొడుతుంది— 'ఎక్కడ ఉండాల్సినవాళ్లు' అక్కడే ఉండాలంటూ పద్మ అత్తింటికివెళ్లిపోతుంది. అయితే సుధ భర్త, మధు తను ఉండాల్సినచోట ఉండడు. వదినె కొడుకుకోసం బెంగ పెట్టుకొని, రోజూ పారుగూరు వెళ్లిచూసివస్తాడు. లెక్క ప్రకారం ఊరూవాడా, సూర్యకాంతం అతడి నెత్తిన అభాండాలు వేస్తారు. సుధ కూడా భర్తగుణాన్ని శంకిస్తుంది. పద్మ అత్తింట ఉండ లేకఇల్లువదలిపోతుంది; కొద్దిసేపటిలో ఆమె కొడుకు సంబరంలో తప్పిపోతాడు. పద్మ, దేవుడిపాదాలమీద తలమోదుకొని ఏడ్చిమతి పోగొట్టుకుని. క్యారక్టర్ యాక్షన్ చేస్తూ ఉంటుంది.

కాలంనాడు 'రాండమ్ హార్వెస్ట్'లో కనబడ్డ 'టెక్నిక్'కు దేశవాళీ తర్జుమా ఏమిటో దరిమిలా అనేక భారతీయ చిత్రాలు చూచిన ప్రేక్షకులకు గుర్తుఉండి ఉంటుంది. తలకి దెబ్బ తగలడంవల్ల మతి

పోయిన వాళ్లకి, మళ్ళీ తలమీద అలాటిదెబ్బ తగిలితేనే (గాద్రెజ్ తాళంలాగా), స్మృతి కలుగుతుంది. చలనచిత్ర మనస్తత్వశాస్త్ర వేత్తలకు ఈ వైద్యంమీద గురి ఎక్కువ అనిపిస్తుంది. ఈ చిత్రంలో కూడా పద్మ మళ్ళీ చిన్న కొండమీంచి తూలిపడడంవల్లనే కోలుకుం టుంది. ఈ లోగా మధుసూదనరావు నేపథ్యగీతాలకు తగిన నటన ప్రదర్శిస్తూ కొండలా గుట్టలాపడి తిరగడం, సుధతన పొరపాటు తెలుసుకు తేలిగ్గా నాలిక్కరుచుకోవడం, గారడీవాడి పాలబడి, అదే గాడిలో బాగుపడి మంచిమంచి పాటలు (చాలమంచివి) నేర్చుకున్న మురళి అందంబలేతిరగడం,వెర్రిబాగులవాడుగా,నిష్ప్రయోజకుడుగా కనుపించి అందర్నీ తెగనవ్వించే ఇంద్రజాలం ప్రొఫెసర్ 'హాహ' ఇంద్రజాలంచేసినట్టే,అందర్నీ ఒకచోటికి చేర్చి,అపార్థాలు సర్దివేయడం చకచక జరిగిపోతాయి. అంతా సుఖంగా ఉంటారు.

వాళ్ళ కష్టాలకు కారకులైన దుర్మార్గులు భద్రమ్మనీ, పూజారి గవరయ్యనీ, గ్రూపు ఫోటోలోకి పిలవకుండా తగిన శాస్తి చేస్తారు.

ఒక విధంగా, ఈ కథా, దీన్ని ముందుకు లాగిన నాలుగు 'జోడాల ఘోడాలూ' కొంతవరకూ అవి సాగిన దారీకూడా పాతవే అయినా కథ నడిపిన దర్శకులు సార్వభౌమ, అమానుల్లాలు సృజ నాత్మకమైన ప్రతిభను ప్రదర్శించి, ఉన్నంతలో చెప్పుకోతగినంత గొప్పగా, తెరమీద కథను చిత్రించారు. సాధారణంగా కనపడే చాదస్తాలకు చోటివ్వకుండా, అనేక ఘట్టాలను క్లుప్తంగా, పదునుగా చిత్రించారు. అయితే ప్రేక్షకుల గ్రహణ శక్తిమీద, ఇంకాస్త గౌరవం ఉంచి, ఈ చిత్రంలోని "తనలోతాను"లూ "తనతోతాను"లూ కాస్తంత తగ్గించి ఉంటే ఇది మరింత రాణించి ఉండేదనిపిస్తుంది. కథకు కూడా కాస్త పుష్టి చేకూరేది.

అక్కచెల్లెళ్లుగా శ్రీరంజని, కృష్ణకుమారీ, మధు, సుదర్శన్‌లుగా అమర్‌నాథ్, రాజనాల, ప్రొ॥ హాహగా రమణారెడ్డి, అతడి జంటగా లక్ష్మకాంత, దుర్మార్గులుగా సూర్యకాంతం, వంగర వెంకటసుబ్బయ్య, ధర్మారావుగా పెరుమాళ్ళు, ఆయన గుమాస్తాగా సి.ఎస్. ఆర్,మురళిగా బాల నటుడు నాగేశ్వరరావు పాత్రోచితమైన నటన ప్రదర్శించారు.

ఈ చిత్రంలో విశేషాకర్షణ పాటలూ,వాటికి పెండ్యాల నాగేశ్వర రావు కూర్చిన వరసలూను.◆

1957


బాపు కార్టూనులు
అద్భుత నటనము హీరోయినులకు
అక్కరలేదని నమ్మిక జనులకు
వంపుల సొంపులు చెంపల కెంపులు
తారకు తప్పని సరియగు నింపులు
సన్నటి చక్కటి చిన్నది యున్నది
కృష్ణకుమారికి బిరుదై యున్నది

# సినీ విశ్వరూపం




ఆమె సినీ-దేవతావస్త్రాలు కట్టుకుంది. 'పుల్లద్రాక్షలు' పొదిగిన కిరీటం ధరించింది. రెండు చేతుల్లో రెండు గిన్నెలున్నాయి. ఒక దాని మీద కళ అని రాసివుంది. రెండో దాని మీద బాక్సాఫీస్ అని వుంది వాలఖిల్యుల పరిమాణంలో (అచ్చ తెలుగులో లిల్లిపుట్‌లన్నమాట) ఉన్న మనుషులు గిన్నెలచుట్టూ సందడిగా తిరుగుతున్నారు. కొందరు కళ వున్న గిన్నెవేపు మరికొందరు బాక్సాఫీసుపాత్ర వేపూ

వెళ్తున్నారు. కొందరు కళవేపు పోతున్నవారిని బాక్సాఫీసు పగ్గాలతో వెనక్కిలాగుతున్నారు. బండలా పడివున్న కొందరు ఎవరికాలో తగిలి దిగ్గున లేచి పరుగెడుతున్నారు. నవ్వుతున్నారు. నవ్వు కుంటున్నారు. ఏడుస్తున్నారు. ఏడ్చుకుంటున్నారు. కొందరు పొట్టివాళ్లు పొడుగువాళ్ల మీదకి పొట్టివాళ్ల నిచ్చెనలు వేసి ఎక్కుతున్నారు. కొందరు పొట్టి వాళ్లు పొడుగు నటిస్తున్నారు. వాళ్లని చూసి ఎవరో చప్పట్లు కొడు తున్నారు. వాళ్లని ఎవరో వెక్కిరిస్తున్నారు. కొందరు అటు వాళ్ళని ఇటు లాగుతున్నారు. పునాదులు లేని ఒక తెల్లగోడ మీద గొలుసుల బొమ్మలు ఆడబోయిన బొమ్మల్ని చిటుకు చిటుకు కుడుతున్నాయి. కొన్నిటిని ముద్దెట్టు కుంటున్నాయి. కొన్నిటిని హైపోడెర్మిక్ సిరింజి పోట్లు ఇచ్చి మత్తెక్కిస్తున్నాయి. బోలెడు జనం ఆ గోడకేసి చూసి నవ్వుతున్నారు. వెక్కిరిస్తున్నారు. కొందరు అందు మీదకి ఎగ బాక చూస్తున్నారు. కొందరు జారిపోతున్నారు. అందుకెవరో ఏడుస్తున్నారు. వాళ్ళ నెవరో రూపాయి కిరాయికి ఓదారుస్తున్నారు. ఈ రహస్యా న్నెవరో అరుస్తున్నారు. వాళ్ళనెవరో కరుస్తున్నారు. ఎవరో కొందరికి వళ్లుమూస్తున్నారు. ఇంకొకరికి కళ్లుమూస్తున్నారు. జీవితం ఆక్సిడైజ్ కావడానికి ఇంధనమైన ధనం మాహాత్మ్యాన్ని తెలిపే ఉద్గ్రంథం 'చెక్కుబుక్కు'ను శ్రద్ధగా చదువు కుంటూన్న ఒక సినీ మార్కు ద్రౌపది దరిజేరిన ఒక దుశ్శాసనుడు పైట దిగలాగేస్తున్నాడు. మరో చండశాసనుడు అది వల్లకాదని ఎగలాగుతున్నాడు. ఆవిడ ఇదేం పట్టించుకోకుండా బుద్ధిగా బుక్కు చదువుకుంటుంది.

ఈ సమ్మోహన కరమైన మనోహరమైన బీభత్సమైన భయం కరమైన చలచ్చిత్ర విశ్వరూపం చూసి దిగ్భ్రమ చెంది, రెండు చేతులు పైకెత్తి నమస్కారం పెట్టి మైకం కమ్మి పడిపోతున్న రాజుని రాయుడు పట్టుకున్నాడు. ఆ సన్నివేశాన్ని మంద్ర స్వరంలో వ్యాఖ్యానించాడు రాయుడు.

"రాజా! అదే జనులపాలిటి ఆకర్షణ, వికర్షణ. ఆనందదాయిని, అనారోగ్యకారిణి, జీవన ప్రదాయిని, కళావని, రసధుని, ప్రకాశని నాశని, శని, అని, ఖని అయిన చలన చిత్ర పరిశ్రమ విచిత్ర చిత్రం దర్శించి తరించు. ఓ రాజా! ప్రపంచంలో అన్ని రంగాలలో ఉన్న

చైతన్యం యావత్తు ఇక్కడ పుంజీభవించింది. జీవననాడి ఇక్కడ ఉధృతంగా స్పందిస్తుంది. ఇది బొత్తిగా కళాకాదు. ఉత్తిడబ్బాకాదు. జీవితం...దానికి జెల్లియం అద్దం...పెద్ద అబద్ధం. గొప్ప నిజం. లక్షపొరలు కమ్మిన నిజం. లక్షరూపాలు ధరించగల జీవన ఖనిజం వెలుగూ నీడ, నిజం అబద్ధం, దురాశా నిరాశా, డబ్బూకళా, సోలో డ్యూయెట్, లాంగ్‌షాట్ క్లోజప్, బుర్రా గర్రా, కామెడీ ట్రాజెడీ, ఫేడిన్ ఫేడవుట్, శాంతం కోపం, కృతజ్ఞత-ఘ్నత, స్తుతీ నింద, కుడి ఎడమ, ఎక్షయిట్‌మెంట్ సెక్షయిజ్‌మెంట్, ప్రేమ ద్వేషం, నీతి నాతి, అచ్చులూ హల్లులూ, అలా వలా_కలా ఇలా కళా తలా తిలా అన్నీ వుంటాయి. శ్రీనివాసులూ స్త్రీనివాసరావులూ శ్రీక్నివాసమూర్తులూ ఇంకా అనేక రకాల కచటతపలూ ఉంటారు. భూలోకం మీద మజిలీకొచ్చిన మానవుడు ఈ చాయలకొస్తే మిగతా స్థలాలలోకన్న ఎక్కువ అవతారా లెత్తుతాడు. కష్ట సుఖాలతో గుణావగుణాలతో సంఘర్షణ పడి అతడి హృదయం సానబట్టిన వజ్రం అవుతుంది. మనసు పక్వం అవుతుంది. జీవితం అరముగ్గుతుంది. ఇక్కడే జీవన రాగసుధ రుచి తెలుస్తుంది. జీవనరాగం కనిపిస్తుంది - వినిపిస్తుంది.

అనుభవానికి దొరుకుతుంది. మందగించిన చైతన్యానికి చైతన్యం అబ్బుతుంది. ఓ రాజా! ఇక భయపడకు. లే - ముందడుగు వేసి మందిలోకి రా...ఇంకో నిమిషం తరవాత వదలి పొమ్మన్నా పోవు. నీలో భయం బయట పడడానికి భయపడుతుంది. ప్రతి పనికీ నువ్వు పనికిరావని సన్నాయి నొక్కులు నొక్కే నీలోని సంకోచం సంకోచం చెందుతుంది. నీ ఆత్మవిశ్వాసం కాలరెత్తుకు బయటకు వస్తుంది. ఈ తెర వేలుపుల స్వర్గసీమలో ప్రవేశించడానికి మార్గంలో వాతావరణం ఎలాటిదో, దాని ప్రభావం ఏమిటో తెలుసుకోడానికి నన్ను స్ఫూర్తి క్కగా వాడుకో. నా వెనకాలే రా. షార్క్ స్కిన్ చొక్కా, గాబర్డిన్ లాగూ, రిస్టు వాచీ, ఉంగరం సర్దుకో. అవే ఈ వాతావరణం నీకు హాని చెయ్యకుండా రక్షించే కవచ కుండలాలు. జేబులో పర్సే నీకు పాకు ఎబ్సార్బరు. లే. కాలరెత్తుకో. మొహాన టెక్కు తగిలించుకుని టెక్కుంగా ఎగరెయ్. చిన్నవాళ్లు ఎదురైతే హంగు చెయ్యి. పెద్దలయితే తగ్గిపోయి స్నేహం నటించు. పద రాజా. నీకు జయమగు గాక.◆

—విక్రమార్కుడి మార్కు సింహాసనం


నేడే చూడండి
వండర్ డాగ్ టామీ నటించు
గ్రామసింహం
రెండోవారం కలెక్షన్లు
పికప్పయ్యాయట


A
నేడే చూడండి
మహిళలు ఇది మా చిత్రం అంటున్నారు
గొప్ప కుటుంబచిత్రం
మనం A సినిమాలు చూసే
వయసొచ్చే సరికి - ఆవిడ -
తల్లివేషాలకి దిగిపోయి - శాలువా
కప్పేసుకుంటుంది - మన
జీవితమిలా వెళ్ళిపోవలసిందే!



# ప్యాసా

'చచ్చినవాడి కళ్ళు చారెడేసి' అన్నవాళ్ళు, కేవలం యతి షొగ్గా కుదిరింది గదా అనే ఆ మాటను అనలేదు. లోకపు తీరును చూచి చూచి, తూచి చూచి మరీ ప్రవచించారు.

లోకోక్తులలో ఎంత సత్యం ఉందో అంతటి సౌందర్యం కూడా ఉంటుంది. ఎంతటి వాడితనం ఉందో అంత పనివాడితనం ఉంటుంది, అనల్పమైన శిల్పం ఉంటుంది. దానివల్లనే ఆ ఉక్తులలో శక్తి స్థిరమై నిలుస్తుంది. అవి ఎన్నాళ్ళయినా మాసిపోవు, మారిపోవు, చెరిగిపోవు.

వాటిలో కనబడే ఈ శిల్పం, పనివాడి తనం తీరి కూర్చుని తీర్చి దిద్దిన వనిపించదు. కృత్రిమత్వం కనిపించదు. అవి స్వచ్ఛమైన పాలు. వాటిలో నీరు కలపలేదు. కలిపితే ఎలా తయారవుతాయో తెలుసు కోవాలంటే, "ప్యాసా" (గురుదత్ ఫిలింస్) చిత్రాన్ని చూడవచ్చు. బొంబాయి బాక్సాఫీస్ తీర్థ మాహాత్మ్యం బాగా తెలుసుకోవాలంటే మరోసారి కూడా చూడవచ్చు, (పనిలో పనిగా, "గొప్ప ప్రయత్నం చేసిన ఒక మంచి కళాకారుడి కృషిని" ప్రోత్సహించినట్లవుతుంది.)

చచ్చినవాడి కళ్లు చారెడు. అందుకనే, "నువ్వు అమాంతం గొప్పవాడివి కాదలచుకుంటే హఠాత్తుగా చచ్చిపో" అన్నాడు— మనుషులనూ, వాళ్ల మనసులనూ తూచి చూచి, గుణగణాలను కాచివడబోసి వంట బట్టించుకున్న ఒకాయన; ఊచిపుచ్చకు చెంప కాయ కొట్టినంత గట్టిగా.

అలా ఎవడేనా హరీమన్నా, అన్నాడని ఖరారుగా తెలిసినా మర్నాడు తెల్లారేసరికల్లా నలుగురూ "ఆ పోయిన ఫలానావాడు చాలా గొప్పవాడేస్మీ! ఆ వైనం వాడు బతికుండగా మనం పసిగట్టలేక పోయాము" అని పబ్లీకున ఒప్పేసుగుని, వాడి కళ్లు చారెడేసి ఉండే వని "తీర్మానాలు పెట్టేస్తారు" శక్తికి మించిన మంచితనంతో.

కాబట్టే, ఆ చచ్చినవాడు మళ్ళీ బతికొచ్చి, నేను చావలేదు స్మండీ అదృష్ఠవశాత్తూను అంటే, తక్షణం ఆ యొక్క లోకుల దృష్టిలో వాడి చారెడేసి కళ్లూ చింతాకులంత చిన్నవై ఊరుకుంటాయి. వాళ్లు వాణ్ని భరించలేరు; వాడు బతికున్నానని నిజం చెబితే సహించ లేరు అని ఛాట్; సత్యాన్ని నిరూపించి స్థాపించడం "ప్యాసా"దర్శక నిర్మాత గురుదత్ లక్ష్యం.

ఈ లక్ష్యం లక్షణం గురుదత్‌కు మన చలనచిత్ర కళాకారులలో అగ్రశ్రేణి స్థానాన్ని ఇస్తుంది. అయితే, దీన్ని ప్రజలకు అందచేయడం కోసం అతడు కల్పించిన కథను పరికిస్తే, అందులోమటుకు పరిణతి నందిన కళాకారుడి ప్రతిభ తాలూకు క్రీనీడలు కూడా కనబడవు.

ఇందులో ఉన్న మంచి ముత్యంలాంటి జీవిత సత్యాన్ని, దాని చుట్టూ కథ పేరిట పూసిన బొంబాయి మసినీ పోల్చిచూసినపుడు, ఆ సత్యాన్ని చూచిన దృష్టికీ, దాన్ని ఈ చిత్రకథలో అమర్చడానికి చోటు వెదకిన దృష్టికీ చాలాదూరం ఉందనిపిస్తుంది. అదెవరిదో ఇదెవరిదో తెలియదుగాని, రెండోదిమటుకు ఏమంత అఖండమైనదనిపించదు. "లోకానికి" గట్టిగా మొహం వాచేలా చీవాట్లు పెట్టేసి, సంఘాన్ని కాస్త సంస్కరించేసి, వీలైతే దేశాన్ని మరో అరంగుళం ఉద్ధరించెయ్యాలన్న ఉత్సాహం, వేడీ మాత్రం ఇందులో కనిపిస్తాయి. కాని, ఎందుకు కోప్పడుతున్నావు అని ఎవరూ అడిగే అవసరం లేకుండా ముందు జాగ్రత్త ఉండాలన్న అలోచన ఉన్నట్లు కనిపించదు.

"ప్యాసా" ఒక కవి కష్టాల కథ. అతను పద్యాలు రాస్తాడు.

ఆతడు మంచి కవిత్వమే వ్రాస్తాడు అని గురుదత్ ఫిలింస్‌వారు ముందుగా సర్టిఫికేట్ ఇచ్చారు. ఆ పద్యాలను లోకం ఆదరించలేదు. అయితే 'లోకానికి', ఫలానా విజయ్ అనే వయోజనుడు కవిత్వం రాస్తున్నాడని పన్నెండు రీళ్ళు ఫిలిం తిరిగేవరకూ తెలీదు. కాబట్టి

లోకం అంటే, మొదటి రెండు రీళ్ళలోనూ చెప్పుకోవలసిన అర్థం ఒక చిన్న బస్తీలోని పత్రిక సంపాదకుడు అని. దర్శకుడు గురుదత్ అతన్ని కూడా వరి వెర్రివెంగళాయిగా, సర్కస్ బఫూన్‌గా, కుడి ఎడమలు తెలియని అవివేకిగా (బొంబాయి ఫిలిం వయోజనుల దృష్టి అంతకు మించి ముందుకుపోలేదు. ఇది మామూలే.) చూపించి నందువల్ల, కథ ప్రకారం కాబోయే మహాకవీ, మనుష్యుల తత్వాలను, జీవిత సత్యాలను చక్కగా ఆకళించుకు మరీ కవిత చెప్పగలిగిన ధీశాలీ అయిన విజయ్, అటువంటి వాడిచుట్టూ తిరగడమే ఒకతప్పు. (ప్రపంచంలో ఇంక పత్రికలే లేనట్టూ, ఆ ఉన్న పత్రికకూడా చిన్నదనీ, కాబట్టి ఈ కవితను అచ్చువేసినా అట్టే ఇచ్చుకోలేదనీ చూస్తే తెలుస్తూనే ఉందీ. అ పైన, ఆ జడ్డి సంపాదకుడు తనను ఆదరించ నందుకు ఈ కవి సరాసరి పార్కుకెళ్ళి అక్కడ బెంచిమీద పడుకుని బెంగెట్టుకోవడం తప్ప మరోప్రయత్నం చేయకపోవడం మరో తప్పు. బియ్యే గ్రాడ్యుయేటు వాడు, ఉద్యోగం లాంటి ప్రయత్నాలు చేస్తాడని అతన్ని చదివించినవాళ్లు ఆశించడం సహజం. అది చెయ్యకపోతే విసుక్కోడం కూడా సహజమే. అదీ ఒక తప్పుగానే "బొంబాయి సినిమా వైద్యులు" చూపించారు. కాగా ఐదారురీళ్లయ్యాక 'లోకం'. అన్నమాటకు మరో అర్థం. ఒక ప్రచురణకర్త తనభార్య కాలేజీరోజుల్లో ఈ కవిని ప్రేమించిందని, ఇంకా మధన పడుతున్నదనీ తెలిసినందు వల్లా, అతడు ఆ కవిత్వంమీద పేరూ డబ్బూ గడించుకోలేకపోయి నందువల్లనే తన భార్య అతని ప్రేమను ఒకప్పుడు త్రోసిరాజన్నదని తెలుసుకునే తెలివితేట లున్నందువల్లా, ఆ ప్రచురణకర్త స్వయంగా ఈ కవి పురోభివృద్ధికి దోహదం చేయకపోవడం సహజం. ఇంతకుమించి కవికి అన్యాయం చేసిన 'లోకం' ఏమిటో ఈ కథ ప్రకారం బోధపడదు. అసలు లోకానికేం తెలీదుగదా. ఇతడు బాధ పడుతున్నాడని! లోకానికి తెలిసే ప్రయత్నాలు చేసినట్టు సూచనప్రాయంగా చెప్పడం కూడా జరగలేదు.

కాని ఇదె గురుదత్ విన్యాసాలకు ఆధారం. ఆకవిని చూచి మనం జాలిపడాలని కోరుతూ అతడు చూపిన కారణం. ఈ విధంగా బద్ధకిష్టి అయి ఉండి, పైగా లోకం తనకి అన్యాయం చేసిందని బాధ పడి, అందుకోసం తనమీద అందరూ జాలిపడాలనే వాడినిచూస్తే చిరాకు కలుగుతుంది.


మీరెళ్లింది ఏ సినిమాకో!
బుద్ధిమంతుడు!


ఈ బరువు తగ్గించే మాత్రల్లకి
గుణమేదైనా కనబడితే
వెంటనే ఫోన్ చేసి చెప్పమన్నాయ్!
100 DAYS

అయినా గోరంతలనే గురుదత్ కొండంతలుచేసి చూపించారు. ఒక విషయాన్ని కళాదృష్టితో చూచి చూపించినపుడు, భూతద్దం ఉపయోగించడం, అతిశయోక్తులు విరివిగా వాడడం పరిపాటే. కాని, దానికైనా ప్రాతిపదిక కట్టుదిట్టగా ఉండాలి. నిజమే అని నమ్మతగ్గదిగా ఉండాలి.

పైకి ఎగిరేవాడు ముందర కాలూనడానికి కాస్త గట్టినేల చూచుకు మరీ ఎగరడం అవసరం. ఊబి నేల మీధ ఎలాగో నిలిచి అక్కడినించి ఎగరబోతే అది ఫీలు కాదు.

అయితే, ఇది సినిమాకాబట్టి, అందులోనూ బొంబాయి సినిమా కాబట్టి, కథకి చికిత్సచేసినవారు బొంబాయి ప్రవీణులు కాబట్టి అసాధ్యాలు సుసాధ్యాలు కావడం అద్భుత విషయంకాదు.

సరే, ఆ కవి ఓరోజున రైలుకిందపడి చనిపోయాడని పుకారు పుడుతుంది. అతన్ని ప్రేమించిన ఒక పతితస్త్రీ, తనదగ్గిర ఉన్న కొద్ది డబ్బూ పెట్టి, అతని అముద్రిత కావ్య ఖండాలను అచ్చువేయిస్తుంది. గురుదత్ కోపానికి గురి అయిన 'లోకమే,' తక్షణం పుస్తకాలు చదివి కవిప్రతిభ గ్రహించి అతన్ని గౌరవిస్తుంది.

తీరా సంతాపసభలు జరిగేవేళకు. కవి స్వయంగావచ్చి ఒక పాటపాడి, నేను చనిపోలేదని చెప్పిచూస్తాడు. కాని సహజంగానే అతని పూర్వకథ తెలియని ప్రజలు ముందర నమ్మరు; తెలిసిన ప్రచురణకర్త, అన్నదమ్ములూ స్వార్థపరులై, అతనికి అన్యాయ్యం తలపెడతారు.

కవికి లోకంమీద కోపం, ఆ తరువాత ఏవగింపు, కలుగుతాయి. తనుచనిపోయాడన్న అబద్ధమే నిజమని ఖాయపరచి, వహీదారహమాన్‌తోకలిసి అలా దిగంతాలవేపు షికారెళ్లిపోతాడు సాయంసంధ్యలోకి.

అక్కడ ఇల్లూ వాకిలీ తిండీ గుడ్డా దొరికాయో లేదో మనకి తెలియదు.

అదీ కథ.

అతి సహజం అయినా అద్భుతంగా గోచరించగల ఈ జగతిరీతి గురించిన సత్యాన్ని తెలియ చెప్పడానికి పై విధంగా కట్టిన ఈ కథలో

"బొంబాయి నిపుణుల చికిత్స" ఫలితంగా, ఆ రెండు లక్షణాలూ కూడా శూన్యం అయిపోయాయి. అయినా అనేక విధాల "ప్యాసా" చిత్రం ప్రశంసనీయమైన కృషి ఫలితం అనాలి. 1956 బాక్సాఫీసు సూత్రాలూ వెకిలి నృత్యాలూ లేవు. కథ చిత్రణ, నటన, సంగీతం, కథాంశం (కథకాదు) స్థాయికి తగ్గట్టు ఒప్పాయి. ఛాయాగ్రహణం (వి.కె. మూర్తి)కూడా కథ తత్వాన్ని చూసేవాడికి తెలియ చెప్పగలిగే శక్తితో, చైతన్యంతో సాగింది.

కథతో ప్రత్యక్షసంబంధం లేకపోయినా, చాలారోజులు మనసులో మెదిలి ఆలోచనలు రేకెత్తించి, తోటి మానవుల మీద జాలిపడడానికి కాస్తంత తీరుబాటు చేసుకునే సత్సంకల్పం కలిగించేటంత గొప్ప సన్నివేశాలు ఉన్నాయి. వీటిలో దర్శకుడి ప్రతిభ మెచ్చతగినది.

గురుదత్, దర్శకత్వంతోపాటు ముఖ్య భూమికను కూడా నిర్వహించాడు. అతన్ని ప్రేమించిన పతితగా వహీదారెహమాన్, వంచించిన వనితగా మాలాసిన్హా, ఆమె భర్తగా రెహమాన్. ("రాజ్‌రాణి") నటించారు. జానీవాకర్, మహమూద్, కుంకుం ప్రభృతులు పాల్గొన్నారు.

నర్తకిగా పేరు గడించుకున్న వహీదా ఈ చిత్రంలో ఉత్తమ శ్రేణినటిగా తన ప్రతిభను నిరూపించింది. నటులలో అత్యుత్తమంగా పాత్రను పోషించినవాడు రెహమాన్.

కృత్రిమంగా, అసహజంగా, కనిపించే కథవల్ల, సానుభూతి బదులు చిరాకు కలిగించే తరహాలో రూపకల్పనచేసిన భూమికవల్ల, కవిగా గురుదత్ ప్రదర్శించిన నటన రాణించలేదు. భ్రుకుటి ముడిచి, దిగులుగా ప్రేక్షకులవంక చూడడం తప్ప అతడు చేసినదాట్టే కనపడదు. పాటలు పాడిన సన్నివేశాలుమటుకు బాగున్నాయి. పాటలకు శచిన్ దేవ్ బర్మన్ కూర్చిన సంగీతమూ చాలా హాయిగా ఉంది. ఉన్న వాటిలో రఫిపాడిన 'కహాఁ హై' అనే పాట చాలా బాగుంది.

మొత్తానికి, ఉన్న లోపాలన్నీ లెక్కకు తీసుకున్నా 'ప్యాసా' మంచి చిత్రం; గురుదత్ మంచిదర్శకుడు. ఎటొచ్చి బెంగాలీ, మహారాష్ట్ర, తెలుగు కళాకారుల శక్తిని ఈ సందర్భంలో ప్రస్తావించుకోరాదు. "ప్యాసా" బొంబాయి చిత్రాలలో మహావృక్షం. ◆

1957

# జ్ఞాన పథ బాటసారి

“పోతన” దగ్గరినుంచి “మాయబజారు” వరకు శ్రీ కె. వి. రెడ్డిగారు తీసిన ఆరున్నొక్క చిత్రాలలోనూ దృక్పథం, శిల్ప ప్రకారం ఒక పద్ధతిలో కనిపిస్తాయి. చెప్పదలచుకున్న సంగతేమిటో ముందు స్పష్టంగా తేల్చుకోవడం, అంత స్పష్టంగానూ చెప్పడం, చెప్పేదాంట్లో కలుపు చేరనీక పోవడం రెడ్డిగారి చలనచిత్ర చిత్రణా శిల్పానికి ముఖ్యావృతం. గడచిన రెండు దశాబ్దాలలో తీసిన ఈ ఏడు చిత్రాలూ అయ



నకు దర్శకుల శ్రేణిలో అగ్రస్థానాన్ని సంపాదించి పెట్టాయి. ప్రజా బాహుళ్యాన్ని ఆకర్షించి సంతోష పెట్టాయి. ఆ తరహా చిత్రాలు తీయ డానికి పాఠ్యపుస్తకాలై నిలబడ్డాయి.

కె. వి. ముక్కుకు సూటిగా పోయే మనిషి. అయితే కె. వి. గడుసువాడు కాబట్టి బయల్దేరే ముందు ముక్కును బాక్సాఫీసుకు గురి చేసిపెట్టి అప్పుడు దాన్ని పట్టుకొని సూటిగా వెళ్ళిపోతాడు. దారిలో జోడుగుర్రాల సవారిచెయ్యడు. కళతో కసరత్తు చెయ్యడు. సినిమాటిక్ ఇంద్రజాలానికి వడిగట్టడు. పేరూ డబ్బూ తెచ్చుకోవడం ఇంద్రజాలం అయితే కె. వి. మహేంద్రజాలి అని చెప్పుకోవాలి.

కె. వి. గల్లా పెట్టెలు నింపే డైరెక్టరనిపించుకోటానికి ముందు గల్లాపెట్టె దగ్గరే ఉండేవాడు. వాహినీలో ప్రొడక్షన్ మానేజరుగా ఉండి పరిస్థితులూ, గతులూ అర్థం చేసుకున్నారు. మన జనం ఎందరు, ఎలాటివారు, దనం ఎంత. ఎలా వస్తుంది, ఎంతలో తీస్తే విధిగా లాభం వస్తుంది, ఎవరికోసం తీస్తే వస్తుంది అనే విషయాలను ఆయన అప్పట్లోనే తేల్చుకున్నారు. తెలుగు సినిమా మహారాజ పోషకులు మెడ్రాసు లోను బెజవాడల్లో లేరనీ, వాళ్ళు పల్లెపట్టులోను ఉన్నారనీ, రెండెడ్ల బళ్ళమీద వస్తారనీ, బైస్కోపు మూడు గంటలకు తక్కువైతే మళ్ళీ అటురారనీ ఆయన నమ్మకం. ఇది మరచి, సీమ సినిమాలను చూసి పత్రికల, పట్టు చొక్కాలవాళ్ళ మాటలు నమ్మి, అలా చేయబోవడం నేల విడిచి సాముచేయడమేనని ఆయన అంటారు. అందువల్ల ఆయన ప్రయాణించేది 'జానపద పథంలోనే.

ఆయన చిత్రాలన్నీ 'సగం సత్యం, సగం స్వప్నం', వాటిలో పాత్రలన్నీ అనగనగా మార్కు మనుషులలానే తిరుగుతాయి. దొంగ రాముడు వంటి సాంఘికానికీ, మాయాబజారువంటి పౌరాణికానికీ ఒకే స్థాపత్య సూత్రం.

కె. వి. శ్రమశిక్షణ, కార్యదక్షత ఈ కాలపు సినిమా లోకంలో విడ్డూరాలుగా, చాదస్తాలుగా కనిపిస్తాయి కొందరికి. అయినా 17, 331 అడుగైన పొట్టిచిత్రాన్ని తీయాలనుకుంటే, సరిగ్గా అంతే తీయగలిగే సామర్థ్యంగల ఏకైక దర్శకుడు ఆయనే! మరో చోట అయితే కథ, డైలాగులూ మార్చేసే వాళ్ళంతా కూడా రెడ్డిగారి సెట్ మీద ఆయన మాటను మన్నిస్తారు. ఆయన శ్రద్ధగా కథ గురించి ఆలోచించుకు

వచ్చాడని అందరికీ తెలుసు. ఆయన దగ్గర పనిచేయడం అందరూ గౌరవంగా భావిస్తారు.

దేశం వెళ్ళి తెలుగు జీవితపు నుడికారాన్ని మారుతున్నదాన్ని ఆకళించుకునే అవకాశం తగ్గిపోయింది. నగరంలో స్థిరపడ్డ చాలమంది కవులూ, రచయితలూ, కళాకారులలాగే, వార్తలద్వారా తెలిసే పరిస్థితులను ఊహాపోహలతో గుణించి తెలుగుతనాన్ని లెక్కగట్టడం సర్వత్రా పరిపాటి అయిపోతోంది. అందుకే ఈనాడు చాలా రచనలు చిత్రాలుచలనచిత్ర లోకానికి మాత్రమే సహజమైనవిగా ఉంటున్నాయి. ఇదే పరిస్థితిలో రెడ్డిగారు సాంఘికం చేపట్టడం జరిగింది. అది 'తెలుగు నేల విడిచిన సామే' అయింది.

ఒక తరహా బాగా వంటబట్టిపోయిన వ్యక్తి మరొదాన్ని అవలంబిస్తే ఒకొక్కసారి రాణించదన్న దానికి నిదర్శనంగా 'పెళ్ళినాటి ప్రమాణాలు' నిలబడుతుంది.

కృతకమైన సాంఘికంకన్న సహజమైన జానపదం లక్షరెట్లు మెరుగు. కె. వి. దగ్గర ఉంటే పది లక్షలు మెరుగు. దైవమిచ్చిన జానపదానికి మకుటంలేని రాజు కె. వి.♦

---

పాల్గాట్ మాధవన్ (చంద్రమోహన్):

"నీవు లేక నేను లేను
నేను లేక నీవు లేవు
మనము లేక ప్రేమ లేదు
ప్రేమ లేక మనములేము"

గోపీ! ఇదిలే ఒక పెద్ద సందేహండా...నీవు లేక
నేను లేను ప్రేమలేదు, మనము లేదు అని కదా పాట?
అప్పా—ఎవరూ లేకపోతే పాట ఎప్పిడి ?
ఎవరు పాడతాయి ?

—రాధాకల్యాణం

## ఒట్టి కొమ్మ్యనులు



అక్కినేని నాగేశ్వర్రావు
ఎక్కలేని ఎత్తుల్లేవు
సాగలేని దూరాల్లేవు
భారాల్లేవు
ఐనా - ఈనాడు
తెలుగుసినిమానావ
నతనుచేర్చదలచే రేవు
నీటికీ - నేటికీ
నూరామడనిపించే
హైదరాబాదు!

# అంజలీవారి సువర్ణసుందరి



## బాక్సాఫీసు సూత్రాల బాలశిక్ష

పెళ్లి, పెడాకులు, వారసులు, వారసత్వాలు వగైరాలకు సంబంధించిన న్యాయాన్యాయసూత్రాలను క్రోడీకరించడం అవసరం అని చాలామంది ఉద్ఘాటించేవారు పూర్వం. దరిమిలా హిందూకోడ్‌బిల్లు రూపొంది పార్లమెంటు ఆమోదం పొంది స్థిరపడింది.

అలాగే భారతీయ చలనచిత్రాల బాక్సాఫీస్ సూత్రాలనుకూడా క్రోడీకరించి పడేయడం మంచిదని చాలామందికి లోగడ అనిపించింది. సదరు కార్యక్రమం సమగ్రంగా నెరవేర్చినవారు ఇంతవరకూలేరు. ఒక్కొక్కరు కొన్ని సూత్రాలను మాత్రమే సెల్యూలాయిడ్‌మీద భద్రపరచారు. హాలీవుడ్ తాలూకువీ, బొంబాయిలో దిగుమతి అయినవీ, అక్కడే ఉత్పత్తి అయినవీ, అక్కడనుండి వివిధ ప్రాంతాలకు రవాణా అయినవీ, ఆయాప్రాంతాల 'సంస్కృతి'

నీ బాక్సాఫీస్ హృదయాన్ని మాత్రమే సూత్రించినవి - ఇలా శత సహస్రాధిక సూత్రాలు చెల్లాచెదరుగా ఉన్నాయి. ముందు తరాలవారు ఓ పట్టాన వాటిని ఆకట్టుకు రావడానికి అందుబాటులో లేకుండా ఒక్కొక్క చిత్రంలో కొన్ని, కొన్నిటిలో మరికొన్ని, అన్నిటిలోనూ కొన్ని కొన్ని ఉంటున్నాయి. అన్నీ ఉన్నవి కొన్నైనా లేవు.

ఈ దృష్ట్యా అంజలీపిక్చర్స్‌వారి "సువర్ణ సుందరి" చిత్రాన్ని బాక్సాఫీస్ సూత్రాల పెద్దబాలశిక్ష అనవచ్చు; అలా అని, ఈ చిత్రాన్ని చూడవచ్చు; ఈ సూత్రాల కూర్పులో దర్శక నిర్మాతలు చూపిన నేర్పును మెచ్చుకోనూవచ్చు. ఎందుకంటే మూడున్నర మైళ్లు పొడుగున్న ఈ చిత్రగాథలో నడుస్తున్నప్పుడు శ్రమ, విసుగు లేకుండా దారిలో బోలెడు మజిలీలున్నాయి. భారతీయ నృత్యాలు, బొంబాయిడాన్సులు, తెలుగు పాటలు, హిందీగీత్‌లు, హాస్యం, దేశవాళీ, రెడ్ ఇండియన్ కోయవాళ్లు, కొట్లాటలు, అట్టల బండలూ, వెదురు బుట్టలకొండలూ, ఇ.వి. సరోజ వేషంలో పార్వతీ దేవి, ఇంకా సురలు, అసురలూ ఇత్యాదయః...

ఇవి కాక, కోడిగుడ్లూ గట్రా కురిపించే మాయా కమండలం, హాస్యరహస్యం అవగతం చేసుకున్నాననుకున్న దండం (మనకి నవ్వొచ్చేలా అందర్నీ కొడుతుంది), జెట్ విమానం చప్పుడుతో గంటకి దాదాపు రెండు మూడు మైళ్లవేగాన ఆకాశాన ఎగిరే దర్భాసనం, లేక పట్టుకుచ్చుగల తివాచీలాటి చాపబాపతు శాస్త్రీ, ఈ కథలో ప్రముఖ భూమికలు నిర్వహించాయి. (సదరు సామగ్రి శాండిల్య మహర్షి తాలూకుదని అభిశప్తుడగు నటు డొకడు చెప్పాడు. అతడు సగంవరకూ, "ఋషి-గడ్డం" ఉన్నమనిషీ; మిగతా సగం రబ్బరు కొండచిలువాను. పెద్ద గుహలో ఉంటాడు. అగ్నిగుండం, పొగా అవీ చూట్టానికిబాగున్నాయి.)

ఇవీకాక, కథ కొంత అయేసరికి ఒహనాగకన్నెవచ్చి, కథా నాయకుడినిచూచి "నువ్వుపగటిపూట రాజసులోచనగా తర్జుమా అయి పోనూ" అని మరొక బాక్సాఫీస్ శాపము లేక వరము ప్రసాదిస్తుంది.

ఇలాగే ఇంకా చాలాశాపాలున్నాయి. విశేషం ఏమిటంటే, వాటికి కథ అవసరాలు తెలుసు. అందుకే భార్య తాకిన మాత్రాన నాయకుడు శిలగా మారాలంటూ ఇంద్రుడిచ్చిన శాపం, చాలా తాపీగా— శాస్త్రోక్తంగా అమలు జరుగుతుంది. అది పూర్తి అయేలోగానే

రక్షించమని నాయకీ, ఆమె కుమారుడూ శివపార్వతులను ప్రార్థిస్తూ పాటపాడుతారు. కాని కైలాసంలో వారిద్దరూ (రమణారావు, సరోజ) దాదాపు అదే పాటవరసకు, లయకు అనుగుణంగా నృత్యం చేస్తున్నారాయె; అందువల్ల ఇక్కడి పాటతోపాటే అక్కడి నృత్యం పూర్తికావాలి. అంతవరకూ దర్శనం ఇవ్వడం వీలుపడలేదు. వాళ్ళు దర్శనం ఇచ్చిన తరువాతకూడా ఇంకోచిత్రం ("సువర్ణ పుష్పం లేక బంగారు పూవు") నిర్మించడానికి కావలసినంత కథగల మహత్కార్యాన్ని ఆ చిన్నపిల్లాడికి ఒప్పగించి చక్కాపోతారు. ఆ పిల్లవాడు మాయా తివాచీఎక్కి దేవలోకం వెళ్తాడు. (కమండలం విరిగితే తనూ, దండమూ, పనిచేయరాదనితెలిసినా కష్టాల్లో ఉన్న కథ అవసరాన్ని బట్టి ఆ తివాచీ పనిచేసి స్వామి భక్తిని ప్రదర్శించింది. తివాచీల స్వామిభక్తి గణనీయముగదా!)

అతడు వచ్చేలోగా, ఏ భాషారానివాడు జర్మన్ శాస్త్రీయ గ్రంథాన్ని ఫ్రెంచి వ్యావహారిక భాషలోకి అనువదించేటంత వేగంతో కథానాయకుడు శిలగా తర్జుమా అవుతూ ఉంటాడు. సకాలంలో బంగారు పూవు వస్తుంది. కథ కంచికి వెళ్తుంది; ఐనా మనం ఇంటికి బయల్దేర కూడదు. ఆ తరువాత గ్రూపుఫోటో ఉంది. ప్రేక్షకుల సందేహాలు కొన్నిటిని ఆ ఘట్టంలోనే నివృత్తి చేశారు.

ఈ విధంగా కాలక్షేపానికి నిక్షేపం అనతగ్గ ఈ చిత్రంలో నటీనట వర్గం అంతా యథోచితంగా నటించారు. "సువర్ణ సుందరి" పాత్రకు రూపకల్పన, చిత్రణ, నటన, బాగున్నాయి. దిష్టితగలకుండా కాబోలు - ఒకచోటమటుకు బొంబాయి వాళ్ళ మోళీ తరహా నృత్యం చేయించి, దానికి, "గీతాః రాయాః" పద్ధతిలో "బొమ్మలూ బొంమ్హలూ" ఫక్కీ "సంస్కృతిక" ఉచ్చారణతో పాటపాడించారు.

నాగేశ్వరరావు "భరించిన" జయంతుడి పాత్రకు, 'జానపద కథానాయకుడి చైతన్యం' ఉండవలసినంతగా లేదు. కొంతసేపు గుళ్ళో కూచుని స్వర్గలోకపు చిన్నదానికోసం బెంగపెట్టుకోవడం, ఆ తరవాత రాజసులోచన అయిపోడం జరిగింది.

శాపఫలితంగా జ్ఞాపకశక్తి పోయినందువల్ల భార్యను వెదకే అవసరం తప్పిపోయింది. కాగా, నీలాపనింద నెత్తినవేసుకుని ఇల్లు వదలివచ్చిన రాకుమారుడుగా, అతనికి ఉండవలసిన విధ్యుక్తధర్మ

పాలనా పరిజ్ఞానం కూడా, దర్శక రచయితలశాపంవల్ల లేకుండా పోయింది. అందువల్ల ఎవరో వచ్చిచెప్తేనో, ఎదో జరిగితేనోతప్ప, ఉన్న చోటునుండికదలడు. అలాగే కాలక్షేపం చేస్తాడు. ఈ విధంగా అసమగ్రంగా, అవధులు తక్కువగా తయారైన ఈరకం పాత్రలు పోషించడానికి ప్రతిభ చూపనక్కరలేదు; ప్రభచాలు. ఐనా, నటుడు నాగేశ్వరరావు, మూసపోసిన ఈ పాతవేషానికి ఐదు నిండు ప్రాణాలూ ప్రతిష్ఠించి, గొప్పగా ఒప్పించడానికి తన ప్రతిభనుకూడా వినియోగించి దానిని రాణింపచేశాడు. ఎన్నోకష్టాలు పడి పడి, భార్యాబిడ్డలను కలుసు కొన్న క్షణంలోనే తిరిగి, తెలిసి తెలిసి వారికి దూరంఅయిపోతున్న వ్యక్తి ఆవేదనను, (చివరఉన్న కొద్ది సన్నివేశాలలోనూ) హృదయాన్ని కదలించేలా వ్యక్తంచేశాడు. ఈ చిత్రం మొత్తంమీద ఆ అంశగల సన్నివేశాలు అవే.

(ఆంధ్రలో నాలుగోవారం నడుస్తున్న ఈ చిత్రాన్ని మొన్న 25 న పారగన్ టాకీసులో చూపించారు.) ◆

**1957**

---

దొర (రావు గోపాలరావు) మనూరికి ఫాక్టరీ వచ్చిందంటే–సింత సెట్టు కెన్నాకులో అన్ని లకీల రూపాయలు కురుస్తాయి. నీ బిడ్డ కొండంత సదువులు సదివేసి అమెరికా ఎల్లిపోతాడు. మీ సాదరుకి సాలుకి పదేల డాల్డాలు అంపిస్తాడు.

పాల్ (సారథి): డాడీ! డాలర్స్ అనాలి. డాల్డాలు కాదు.

దొర: డాలరంటే తేలిపోద్దిరా. డాల్డా అంటే మాటకి బరువుంటది. (జనం వైపు తిరిగి) డాల్డా అనగా సీమరూపాయలు. మన రూపాయల కన్నా మందంగా వుంటాయి. చాలా అందంగా వుంటాయి. —మనవూరి పాండవులు



# మూడు ముత్యాలు

" 'అపురూపమైనది' అని చెప్పుకు మురిసిపోతగ్గ చిత్రం ఇది" అన్నాడొక చలనచిత్రకారుడు "ముసాఫిర్" అనే హిందీ చిత్రం చూచి.

ఆ చిత్రం చూచినవారికి, ఈ మాట విచిత్రంగా, ఏమంత పెద్ద అతిశయోక్తిగా కనిపించదు. బొంబాయి నుండి కూడా అప్పుడప్పుడు మంచి చిత్రాలు వస్తాయన్న లోకోక్తి నిజమేననిపిస్తుంది. ఇంతకు ముందు ఈ పద్ధతిలో ఈ శిల్పంతో మలచిన చిత్రాలు రాలేదు కాబట్టి "అపూర్వం" అని కూడా అనిపిస్తుంది.

ముత్యాల వంటి మూడు కథలను ఇందులో మెచ్చ తగ్గ చాకచక్యంతో కలిపారు. ఎటొచ్చి మూడోది నకిలీ ముత్యం. అది పక్కన ఉండడంవల్లనే మిగతా రెండింటి విలువ మరింత కొట్టొచ్చినట్టు కనబడింది. ఆ కథలలోని సౌందర్యం అక్షరాలా మనోహరంగా, భాసించింది. దర్శక నిర్మాత (ఫిలింగ్రూప్) హృషీకేశ్ ముఖర్జీ అందమైన ఆ కథలు రెండింటినీ (మొదటి రెండూ) అంత మనోహరంగా, చలనచిత్రకళకి చెప్పుకోతగ్గ అర్థనిర్వచనం అనిపించేటంత చక్కగా, రూపొందించారు. అంత మంచిపని చేసినందుకు "పాపపరిహారార్థం" అన్నట్టుగా మూడో కథని (అదే ప్రధానమైనది) వాటికి జోడించారనిపిస్తుంది. ఈ "ఘనత" దర్శకుడు పూర్తిగా స్వీకరించాలా- అందులో పాల్గొన్న ప్రముఖ నటుడికి భాగం ఇవ్వాలా అన్నది వాళ్ళు తేల్చుకోవలసిన సమస్య.

మూడింటికీ కథాస్థలం ఒకటే—ఒక చిన్న అద్దెకొంప. కష్టాల కడలినుండి సుఖతీరాలకు వెళ్ళే దారిన పోయే వారికది మజిలీ.

మూఢ విశ్వాసం అంటే అనవచ్చు. కాని కారణం ఏమైనా పుట్టెడు కష్టాలతో ఆ యింటికి వచ్చిన కుటుంబాలు ఇట్టె గట్టెక్కి ఆనందంగా మరో యింటికి వెళ్తాయి. కవిత్వపు పరిభాషల్లో చెప్పుకోవాలంటే నిరాశాభరిత హృదయాలలో ఆశాజ్యోతి ఉదయించి దుఃఖతిమిరాన్ని పటాపంచలుచేసి వేస్తుంది. జీవితం బాగుందన్న సంతోషం బాగుంటుందన్న ఉత్సాహం, ఉండాలన్న ప్రగాఢ ఆశాభావం కలుగుతాయి. ఉసూరున వచ్చిన వాళ్లు ఝాంమని నవ్వుతూ పేలుతూ వెళ్తారు.

మొదటి కథలో బంతిపూల రథమల్లె నిండుగా, కాంతివంతంగా ఉన్న ఓ అమ్మడూ, ఆమెకు మనసిచ్చి పుచ్చుకున్న ప్రాణేశ్వరుడూ ఆ యింట అద్దెకు దిగుతారు. అతగాడు పుచ్చుకోనిదల్లా పెళ్ళికి వాళ్ళ నాన్నగారి అనుమతి ఒక్కటే. అయన ఓ పట్టాన పెళ్లి మంజూరు చెయ్యడన్న నమ్మకంకొద్దీ, ఈ అమ్మాయినే పెళ్ళాడాలన్న పట్టుదల కొద్దీ అతగాడు, ఎవరికీ చెప్పకుండా అమెను తీసుకుని బస్తీ వచ్చాడు. కీడెంచి మేలెంచాలని, అ అబ్బాయి ఓ పురోహితుణ్ణి తీసుకువచ్చి, బాజా భజంత్రీలు లేకపోయినా, అగ్ని సాక్షిగా, శాస్త్రోక్తముగా ఆమె మెడలో పుస్తెముడేసి అ వైనం తండ్రికిరాస్తాడు—ఇంకనైనా వచ్చి ఆశీర్వదించమని.

తండ్రి మండిపడి జవాబు రాయకుండా చక్కా వస్తాడు కుర్రాణ్ణి లొంగదీయాలన్న పట్టుదలతో. అయన భార్యకూడా వస్తుంది. కోడల్ని ఇంటికి తీసుకెళ్ళాలన్న సంకల్పం, భార్యాభర్తలూ, భిన్న సంకల్పాలూ కలసి ఆ యింటికి వచ్చి తలుపు తట్టినవేళ, ఆ వృద్ధుల్ని ముగ్ధుల్ని చేసేటంత తీయనిపాట వినబడుతుంది. (సంగీత దర్శకుడు సలీల్‌చౌదరి ఆ పాట కట్టాడు. లతా మంగేష్కర్ పాడింది) కొద్ది నిముషాల తరవాత గృహలక్ష్మి వచ్చి తలుపు తీసి ఎదురుగుండా ఉన్న పార్వతీ పరమేశ్వరుల్ని చూచి ఇంటాయనా, ఆయన భార్యా పలకరించి అద్దె పుచ్చుకువెళ్ళడానికి వచ్చారనుకుంటుంది. భర్త బజారు కెళ్లాడని చెప్పి, లోపల కూర్చో

పెట్టి మర్యాద చేస్తుంది. ఆ రోజునే తను గృహలక్ష్మిగా తన యింట వంట మొదలుపెట్టినందువల్ల వచ్చిన అతిథులిద్దరినీ భోజనాని కుండమంటుంది. మావగారు మండిపడబోతాడు గాని, కలకంఠి కంట కన్ని రాలకడం చూచి చల్లారిపోతాడు. ఇంకాసేపు అయేసరికి, ఆమె వినయం వందనం, రూపురేఖా, తీరుతెన్నూ చూసి సంతోషపడ తాడు. ఆమె పెట్టిన కమ్మని వంటకాలు తిని గుమ్మైపోతాడు.

ఇంత మంచి కోడలు ఎంత పుణ్యం చేస్తే దొరుకుతుందన్న భావంతో అతని మనసు నిండిపోతుంది.

ఇంకో నిముషం తరవాత, సుపుత్రుడు బజారునించి వచ్చి వంటింట్లో సాక్షాత్తు తలిదండ్రు లుండటం చూచి గుండె గుభేలుమని కొయ్యబారిపోతాడు.

అతన్ని చూడగానే తండ్రి గట్టిగా చీవాట్లేస్తాడు అయితే, అవి, అంతకుముందు ఆయన సంకల్పించిన ప్రకారం, కొడుకు ఈ పిల్లని పెళ్ళాడినందుకు కాదు.

ఇంత చక్కని కోడల్ని, ఇంటికి మా లక్ష్మిని తీసుకువచ్చి, ఇలాటి పాడు కొంపలో చాప గుడ్డా మంచం ముక్కా లేకుండా, చెంబూ తప్పేలా లేకుండా, నౌకర్లూ చాకర్లూ లేకుండా ఇలా ఉంచి కష్టపెడతావా గాడిదా అని కూతలేస్తాడు.

అంతా ఆనందంగా స్వగృహానికి వెళ్తారు. పెద్ద సంఘటనలూ, సంఘర్షణలూ, కృత్రిమమైన పతాక సన్నివేశాలూ లేని ఈ కథని, మరపురాని మధుర ఘట్ట మనిపించే రీతిన దర్శకుడు చిత్రించాడు. కోడలుగా సుచిత్రాసేన్, కుమారుడుగా శేఖర్, అతని తలితండ్రులుగా దుర్గాఖోటే, నజీర్‌హుసేన్, కథకూ, దాన్ని చిత్రించిన శిల్పానికీ తగ్గ స్థాయిలో నటించారు.

రెండో కథలో పది కాలాలపాటు జ్ఞాపకం ఉండే తరహా నిశిత విమర్శ ఉంది. అందరికీ తెలిసిన నిరుద్యోగ సమస్యా స్వరూపాన్ని, అది చెప్పగల ('ఇందులో చెప్పలేదు.) విషాదగాథల రూపాన్ని లీలగా చూపించారు.

ఇందులో తండ్రిగా నజీర్ హుసేన్, కోడలుగా నిరూపారాయ్,



ఆయన పిచ్చము
మొదటి వారం ఫ్లాటన్నారు గానీ
రెండో వారం
పికప్పయిందంట!





నాగేసర్రావా! సావిత్రా?



చిన్న కుమారుడుగా కిశోర్‌కుమార్ నటించారు. కిశోర్‌కుమార్ నటన చాలా మందికి 'అతి'గా కనిపిస్తుంది కాని, ఒక్క క్షణం ఆలోచిస్తే అలా అనిపించదు.

పై రెండు కథలలోనూ శిల్పం చూస్తే, కథకచక్రవర్తి ఓ. (అరిన్) హెన్రీ జ్ఞాపకం వస్తాడు.

మూడో కథని చూశాకమటుకు, "లాస్ట్ లీఫ్" అనే పేరిట నేను రాసిన కథకీ దీనికీ పోలికల్లేవు" అని చెబుతాడనిపిస్తుంది.

ఇందులో దిలీప్‌కుమార్, ఉషాకిరణ్, డెయిసీఇరానీ నటించారు.

అసలు ఇది కథ కాదు; తెరల వెనకనించి, కిటికీ కటకటాల అవతలనించీ దిగులుగా చూస్తూ దిలీప్‌కుమార్ ప్రదర్శింప ప్రయత్నించే 'షోకేళీ వ్యథ..'

మొత్తం మీద దిలీప్‌కుమార్, అతని నటన, వేషభాషలూ, ఇది చిత్రించిన విధమూ, చూడగా మనకి బోధపడని ఊహాలేవో బోలెడున్నాయి అనిపిస్తుంది. ఉంటే గింటే, కూడా ఊహలు మంచివే కాని, మనవి కాదనికూడా అనిపిస్తుంది. కాగా ఈ చిత్రం పొడుగునా విలక్షణమైన వయొలిన్ సంగీతం వినిపిస్తుంది. సంగీతం, భాషా జాతి భేదాలకు అతీతమైతే కావచ్చుగానీ, 'మన' కథ చెప్పుకుంటున్నపుడు ఇంగ్లీషులో బాధ పడడం, మరో భాషలో కోప్పడడం ఏమంత అఖండంగా రాణించదు. మన ఇంట్లో ఎలా ఉన్నా పరవాలేదు కాని, కళ, పేరిట 'పబ్లీకున' అలాటి పని చేస్తే అది ఘనత అనిపించుకోదు.

ఇందులో భగ్న ప్రేమికుడి హృదయ బాధని సంగీతంలోకి తర్జుమా చేసిన సలీల్‌చౌదరి, సింఫనీ నొటేషన్స్ దగ్గిర్నించి, (రాక్ అండ్ రోల్ మినహా) రకరకాల మట్లూ ఎరువు పట్టుకొచ్చి, వాటిని హిందుస్థానీ రాగాల్లో మిళాయించేశారు. ఎదటి మనిషి హృదయాన్ని కదలించవలసిన ఘట్టాలలో, ఆ హృదయానికి సన్నిహితమైన సంప్రదాయం సంగతి, తరతరాలుగా వంటబట్టిన దేశీయస్వరార్ణవం సంగతి గుర్తుంచుకొని వ్యవహరిస్తే లక్ష్యం సిద్ధిస్తుంది. లేకపోతే, ఆశించిన ఫలితం లభించడానికి బదులు, ఆ ప్రయత్నం యావత్తు క్షణంలో సగంలో హాస్యాస్పదం అయిపోయే ప్రమాదం ఉంది.

దీనికి తోడు దిలీప్‌కుమార్, విలక్షణమైన తరహాలో ప్రవేశించడం, ఎవరో తనకి అన్యాయం చేశారన్నట్లు (కథ ప్రకారం అతనే నాయికికి అన్యాయం చేశాడు) లోకాన్ని ఒక తరహాలో చూడడం, కటకటాల వెనకనుంచి తప్ప కనబడకపోవడం, మాటలు అస్పష్టంగా తప్ప అనకపోవడం మొదలైనవన్నీ చూస్తె "దేశవాళీ ఆర్సన్‌వెల్స్" బిరుదు గడించాలన్న ఊహ ఉన్నట్లనిపిస్తుంది. (అది ఘనత అయినట్లు). ఈ ఎరువు శిల్పానికి, బరువు మాటలు జోడించడంతో ఈ పద్ధతిలో అర్థం సామాన్యులకు బోధపడదనిపిస్తుంది.

"వాస్తవికతను" పోషించాలన్న ప్రయత్నం దిలీప్‌కుమార్ నటనలో అద్యంతం కనబడుతుంది.

దానికి పొసగని విధంగా, ధ్వనిగర్భితమైన సంభాషణలు-పుస్తకాల్లో రాసుకు చదువుకునేవి—అతడు వల్లిస్తూంటే, ఆ నటనకూ ఈ భాషకూ పొసగక, ఫలితం కృత్రిమంగా తయారైంది.

"ముసాఫిర్" చిత్రంలోని ఈ మూడవ కథలో పక్షపాతంవల్ల కాళ్ళు పడిపోయిన ఒక చిన్న పిల్లవాడికి, ఆ శక్తి రావడం ముఖ్యాంశం.

ఈ చిత్రం ద్వారా ఇవ్వదలచిన సందేశాన్ని ఈ కథ ద్వారానే దర్శకుడు బట్వాడా చేయ ప్రయత్నించారు :

కిటికీ పక్కనున్న చెట్టుకి పువ్వులు పూయగానే, నడక వచ్చేస్తుంది అని దిలీప్‌కుమార్ ఆ పిల్లవాడిని నమ్మిస్తాడు. ఆ ప్రకారం ఓ రోజు పొద్దున్నే అతడు లేచేసరికి చెట్టుకి పువ్వులుంటాయి. వేంటనే ఆ కుర్రవాడు లేచి నడిచేస్తాడు. (ఇది సినిమా సైకాలజిస్టుల చికిత్స).

దీనికి ఆధార భూతం అయిన ఓ హెన్రీ కథ లాస్ట్ లీఫ్‌లో సంగతి ఇందుకు భిన్నమైనది. అందులో అమ్మాయి, పెరట్లో చెట్టు నించి రోజూ రాలిపోయే ఆకులు చూస్తూ, అవన్నీ రాలిపోయేసరికి తన ప్రాణాలూ పోతాయన్న దురభిప్రాయంతో, పిచ్చి నమ్మకంతో దిగులుపడుతుంది. ఆ సంగతి తెలిసిన చిత్రకారుడు రాత్రి పూట చెట్టు ప్రక్క గోడ మీద ఆకుబొమ్మ చిత్రిస్తాడు. మర్నాడు ఉద

యానికి చెట్టు మీది ఆఖరి ఆకు నిజంగా రాలిపోయినా, గదిలోంచి చూచిన అమ్మాయికి మటుకు గోడ మీది బొమ్మ, ఆకు రాలలేదన్న అభిప్రాయం, తద్వారా ధైర్యం, ఆశాభావం కల్గిస్తుంది. ఆమె కోలుకుంటుంది.

నిజంగా అటువంటి ఏర్పాటు లేకపోతే ఆ అమ్మాయి ప్రాణాలు పోవడం ఖరారని ఆ కథను అర్థంచేసుకున్న వారెవరూ అనరు; కాని దాన్ని తిరగేసి, ఈ కథలో పై విధంగా వాడుకున్న వారన్నారు. తేడా ఒకటే; ఆ ఊహ మంచిదైనా మనదికాదు; ఈ ఊహ "మనది" అయినా మంచిదికాదు.

"ముసాఫిర్ చిత్రాన్ని మే 2 న మద్రాస్ అశోక్ టాకీస్‌లో పత్రికల వారికి చూపించారు.♦

**1957**

---

పెళ్లయి అత్తారింటి కెడుతున్న కూతురి(వాణిశ్రీ)తో తండ్రి(కాంతారావు):

"నీ అందం ఆరోగ్యం, నీ చదువు సంస్కారం—యివే నిజమైన నగలు. నీ వినయం వందనం, నీ నిదానం నిగ్రహం—యివే నిన్ను కాపాడే ఆయుధాలు...కాల్లో ముల్లు గుచ్చుకుంటే అది కంట్లో గుచ్చుకోలేదని సంతోషించాలి తప్ప ఏడుస్తూ కూచోకూడదు...నువ్వు హాయిగా సంతోషంగా ఉన్నప్పుడే కన్నవాళ్ళను తల్చుకో—చూడ్డానికి రా—ఓడిపోతున్నపుడూ, కష్టపడుతున్నపుడూ—నాకు చెప్పకు. నువ్వు తినే అన్నం నువ్వే హరాయించుకోవాలి. నీ కష్టాలు నువ్వే ఖరాయించుకోవాలి... ప్రతి గుండెలో గోరంత దీపం వుంటుంది. కటిక చీకటిలా కష్టాలు చుట్టు ముట్టినపుడు ఆ దీపమే కొండంత వెలుగై నీకు దారి చెబుతుంది. ఆ దీపం పేరే ధైర్యం. దాని పేరే గెలవగల నన్న ఆశ."

—గోరంత దీపం.


చిత్రజగతిలో
చలంస్థానం
నిశ్చలం-అచంచలం
పదేళ్లుగా అది పెరగలేదు
తరగబోదు



# ప్రతిభా చిత్రం ఏది నిజం?

ఏది అయినా కాకపోయినా, బ్రహ్మాండమైన స్టార్ వాల్యూ, పెద్ద సెట్స్, పాతిక పాటలూ, ముప్పై డాన్సులూ లేకపోయినా కాస్త మంచి కథ, దాన్ని చెప్పవలసిన పద్ధతిలో చెప్పగల దర్శకుడు, స్టార్ వాల్యూ లేకపోయినా ప్రతిభ గల నటీనటులూ ఉంటే, నిర్మాత తన చిత్రాన్ని విజయవంతం చేసుకోగలడన్నమాట నిజం. నిజానికి, లక్షల ఖర్చుతో కూడిన ఈ పరిశ్రమలో ఇటువంటి నిజానిజాలను నిరూపించడానికి ఎవరూ ఉబలాటపడరు. ఇటువంటివి ఉబలాటాలవల్లనే జరిగేవి కావు కూడా. స్వప్రయోజనం కోసమే అయినా, ఇలా చేసి సత్ఫలితాలు సాధించాలన్న సంకల్పం, సాధించగలమన్న ఆత్మ విశ్వాసం, అందుకు తగ్గ దక్షత ఉండాలి.

తక్కువ ఖర్చులో, అతి త్వరితంగా ప్రతిభా పిక్చర్స్ నిర్మించిన చిత్రం "ఏది నిజం?" ఈ నిజాన్ని నిరూపించింది. ఈ దృష్ట్యా యువ నిర్మాత శ్రీ ఘంటసాల కృష్ణమూర్తి అభినందనీయులు.

ఈ చిత్రంలో అనేక విషయాలలో కొత్తదనం కనబడుతుంది. మొట్టమొదటిది కథ. హత్యా నేరాన్ని ఆధారం చేసుకొని, కట్టుదిట్టమైన పద్ధతిలో రూపొందించడం తెలుగు చిత్ర పరిశ్రమలో ఇదే తొలిసారి అని చెప్పవచ్చు. ఈ దృష్ట్యా, ఈ పంథాలో తయారైన అనేక హిందీ చిత్రాలకన్న ఇది మెరుగే.

ఏది నిజం కథ పూర్తిగా స్వతంత్ర రచన కాదు. 'ఫ్యూజిటివ్' అనే ఇటాలియన్ చిత్రం ఆధారం. కథా వస్తువును మాత్రం తీసుకొని, కథ స్వరూపాన్ని, పాత్రలను బాగా మార్చి దాన్ని మన వాతావరణానికి అనుగుణంగా, అసంగతాలకు సాధ్యమైనంతవరకూ అస్కారం ఇవ్వకుండా చిత్రించారు. కథ పొడుగునా సున్నితమైన హాస్యం ఉంది.

కొత్తదనంపట్ల దర్శకుడు శ్రీ బాలచందర్‌కుగల ఆసక్తి, వివిధ సన్నివేశాలను, సహజంగా మోతాదుగా చిత్రించడంలో చాకచక్యం చిత్రానికివన్నె తెచ్చాయి. టైటిల్స్ చూపించడంలో కూడా కొత్తదనం ఉంది. కుండల మీద, బండల మీద, జట్కాబండ్ల మీద, గంగిరెద్దు వీపుల మీద కూడా పేర్లు చూపించారు. వాటిని పురస్కరించుకొని పల్లెటూరి దృశ్యాలను చూపారు. ఆరుబయట దృశ్యాలను ఇంతగా చూపి సద్వినియోగం చేసుకున్న చిత్రాలు అరుదు. కథ చాలావరకు, అడవిలోనూ, కొండల మీదా జరుగుతుంది. పెద్ద సెట్ అన్నది మునసబు యిల్లు ఒక్కటే. అదిమాత్రం జమీందారు భవంతి ఛాయాలో ఉంది. కథాచిత్రణలో చెప్పుకోతగ్గ మరొక విశేషం చాదస్తం లేకపోవడం. తిరుపతి హత్య, రామి ఇల్లు వదలిపోవడం, కోటయ్య ఖైదు నించి తప్పించుకోవడం మొదలైన సందర్భాలలో అనవసరమైన దృశ్యాలు చూపించనందువల్ల అవి బాగా రాణించాయి. ఐతే కథాంతంలో, మునసబుచేతనే, అతని ఊహాపోహలు, పన్నాగం యావత్తూ వివరంగా చెప్పించడం యీ పద్ధతికి విరుద్ధంగా ఉంది. అసంగతం, అనవసరం అనిపించే వాటిలో నాగుపాము ఉపాఖ్యానం ఒకటి.

అయితే మంచి, కాకపోతే చెడ్డ అన్న పద్ధతిలో పాత్రలను మూసపొయ్యకుండా ఉండడానికి ప్రయత్నం చేశారు. ఉన్న దుష్ట పాత్రలు మూడింటిలో మునసబు మాత్రం పూర్తిగా దుష్టుడు. స్వతహాగా ఉన్న దుష్టబుద్ధివల్ల మొదట దుశ్చేష్టలు చేసినా, ఆ తరవాతనించి, వాటి పర్యవసానాలే ఆ పాత్రను నడిపిస్తాయి. దుస్సంకల్ప బలంకన్న భయం బలమే ఎక్కువ అవుతుంది. నేరాన్ని మరొకడి నెత్తి మీదకు నెట్టివెయ్యడంలో మునసబుకు మద్దతు యిచ్చిన ఇద్దరిలో పూజారి మైసపుముద్ద; భయస్థుడు. మానసికంగా దుర్బలుడు. అందువల్ల, ఇష్టం ఉన్నా లేకపోయినా అతను మద్దతు ఇస్తాడు. రెండో వ్యక్తి డాక్టరు. మొదట్లో ప్రబోధం, దూరాలోచన లేకపోవడం ఇతణ్ణి తప్పుడు సాక్ష్యానికి పురికొల్పినా, తరువాత మథనపడతాడు. పగ సాధించడానికి ఖైదునించి పారిపోయివచ్చిన కోటయ్యకు, హంతకుడి పేరు చెప్పాలా, కూడదా అని ఆఖరు క్షణం వరకూ అటూఇటూ ఊగిసలాడుతూనే ఉంటాడు.

తనకి హాని చేసినవారి అంతు కనుక్కోవాలని వచ్చిన కోటయ్య పాజిటివ్‌లో కథానాయకుడివలె అఘాయిత్యాలు చెయ్యడు. చెయ్య లేకపోతాడు. కాలం కర్మం పోలీసులు తుపాకులూ ఎదురుతిరిగిన తరువాతే, హంతకుడు శిక్షితుడవుతాడు.

ఈ కథలో ప్రేక్షకులను బాగా ఆకర్షించగల పాత్ర కోటయ్య బావమరదిది; తిరుపతిది. అప్పనంగా వచ్చే డబ్బుకు ఆశించని వాడు. దేనికీ భయపడడు. ఎవర్నీ ఖాతరు చెయ్యడు. నిత్య చైతన్యవంతుడు. ఈ భూమికను జోగారావు బాగా ఒప్పించాడు.

మునసబు భూమిక నిర్వహించిన గుమ్మడి వెంకటేశ్వరరావు తొణుకు బెణుకు లేకుండా, అతి హుందాగా నటించాడు. గుమ్మడి నటనవల్ల మునసబు భూమిక బాగా రాణించింది. చివర చివర కొన్ని చోట్ల తప్ప మొత్తం మీద మొదటి నుండి చివరవరకు ఒకే స్థాయిలో సాగింది.

కథానాయకుని భూమికను మొదటిసారిగా నిర్వహించిన నాగభూషణం, ప్రతిభగల నటుడుగా తన సామర్థ్యాన్ని ఋజువు చేసుకున్నాడు. ముఖ్యంగా 'మెలో డ్రామా'కు జారిపోగల సన్నివేశా

లలో మితి తెలిసి, నిగ్రహంతో నటించి, ఆ భూమికకు వాస్తవికతను బలాన్ని చేకూర్చగలిగాడు.

పూజారిగా వంగర, నాటు వైద్యుడుగా రమణారెడ్డి, రామిగా జానకి, రామితల్లిగా హేమలత సామర్థ్యంతో నటించి, చిత్రం విజయవంతం కావడానికి తోడ్పడ్డారు.

ఈ కోవకు చెందిన కథలలో పాటలకు చోటుండదు. అయినా, సాధ్యమైనంతవరకు అడ్డురాకుండా చేయడానికి ప్రయత్నిస్తూ నాలుగైదు పాటలు చొప్పించారు. శ్రీ వేణు సమకూర్చిన సంగీతం చక్కగా ఉంది.♦

1956

---

గోపీ (ఏ ఎన్నార్) : చదవకపోతే మనిషి రివ్వునా
చంద్రుడి పైకి ఎగిరేవాడా ?
గిరగిర తిరిగీ వచ్చేవాడా ?
మాధవయ్య (అక్కినేని) : దేవుడు చల్లగ చూడకపోతే
అక్కడె గల్లంతైపోడా !
ఆనవాలు చిక్కేవాడా !
(కొసరాజు) —బుద్ధిమంతుడు

---

తీతా (తీసేసిన తాసిల్దారు - అల్లు రామలింగయ్య) :

లోగడ తానీషా డబ్బుతో రామదాసు రామాలయం కట్టించినట్లు నేను గవర్నమెంటు వారి డబ్బుతో ఒక యిల్లు కట్టించుకున్నానండి. దానికి రామాలయం అని పేరు పెట్టాను. రాములవారికి సెపరేటుగా ఒక రూము కూడా కేటాయించాను. అయినా నా మీద కిట్టనివాళ్ళు గవర్నమెంటువారికి నేరాలు చెప్పి నన్ను సస్పెండు చేయించారు...

—అందాలరాముడు

# వరలక్ష్మి ఫిలింస్ వారి సతీ సావిత్రి

వరలక్ష్మి ఫిలింస్‌వారి తొలి చిత్రం "సతీ సావిత్రి" ప్రత్యేక ప్రదర్శనం మదరాసు పారగన్ టాకీస్‌లో జనవరి 24 న జరిగింది.

ఎస్. వరలక్ష్మి, నాగేశ్వరరావు, ఎస్. వి. రంగారావు ముఖ్య భూమికలు నిర్వహించారు.

ఇతర నటులు నాగయ్య, సూరిబాబు, దొరస్వామి, రేలంగి, డా॥ శివరామకృష్ణయ్య, ఋష్యేంద్రమణి, సూర్యకాంతం, సీత.

ఈ చిత్రానికి శ్రీ కడారు (శ్రీ కృష్ణతులాభారం) నాగభూషణం దర్శకుడు; పాటలు పాతవి; మాటలు శ్రీ రావూరువి.





మృదు
గతి
రీతి..

అశ్వపతి అనే రాజుకు లేకలేక ఒక పుత్రి. ఆమె పేరు సావిత్రి. ఆమె కొంత కాలంపాటు ("సతీ అనసూయ" కథ విని సినిమా చూసి) తాపీగా పిల్లలందరి మల్లేనే పెరిగి పెళ్ళీడు కొస్తుంది. అప్పుడు నారదుడు సావిత్రిని, అడవిలో ఉన్న సత్యవంతుడినీ,



మితి
మీరె
నాతి...

ఆ పైన యమధర్మరాజునీ విడివిడిగా కలుసుకుంటాడు. మరి కొంత కాలం తాపీగా సాగాక సావిత్రీ సత్యవంతుడూ అడవిలో కలుసుకుంటారు. సత్యవంతుడు అమ్మవారి బొమ్మ వెనక దాగి 'అసత్యవాణి'తో సత్యమైన ప్రేమను ప్రకటిస్తాడు. మరికొంత కాలానికి వాళ్ళిద్దరు ఆ అడవిలోనే కలుసుకుంటారు. అపుడు పెళ్ళి జరుగుతుంది. ఇంకా కొంతకాలానికి, కాలాతీతం కాబోవడంలో "అంతక భూపాలుడు" (రంగారావు) వాళ్ళిద్దర్నీ ఆ అడవిలోనే కలుసుకుంటాడు.

తరువాయి కథ తెరమీద చూడండి. మీ రిదివరకు కొండొకచో చూచిన వరుస ప్రకారమే వెండితెరమీద కథ కూడా సూటిగా తాపీగా సాగుతుంది. మైలవరపు కంపెనీ వారు వినిపించిన పాటలూ, పద్యాలూ ఒకటి తరవాత మరోటి వరుస ప్రకారం వినిపిస్తాయి.

రంగారావు నటన, మాధవపెద్ది సత్యం పాటలూ యముడి భూమికను బాగా ఒప్పించాయి. ఈ కథలో రేలంగి, సీతల "ఆశ్సేం" ఆలా ఉండగా, సూర్యకాంతం ధాటీ మితిదాటి చెలరేగి పోయింది. గడుసరిగా, గయ్యాళిగా, తగవులమారిగా అనేకమార్లు పెడసరి తెలుగు పడతులను విమర్శచేయగలిగిన సూర్యకాంతం ఇందులో మరీ తెలుగు మీరి పోయింది. ఎంత మహమ్మారి అయినా, ఏ భారతనారీ అనసాహించని మాటలతో ("ఇగోనా పుస్తై తెంపి మరీపో") ధోరణితో ఈ విధంగా హాస్యం సరఫరా చేయబోవడం శోచనీయం.

ఈ చిత్రంలో ప్రత్యేకాకర్షణ సావిత్రిగా నటించిన ఎస్. వరలక్ష్మి గానం. ఆమె పాడిన పాటలూ. పద్యాలూ మధురమైన కంఠస్వరంతోడై, అతి శ్రావ్యంగా, వినడానికి హాయిగా ఉన్నాయి.♦

**1957**

---

**జోగినాథం (అల్లు రామలింగయ్య) :**

పేదవాణ్ణి! పేకాట్లో జోకరులాటివాణ్ణి. నన్నెలాపడితే అలా వుపయోగించుకోవచ్చు. నన్ను యాగీ పెట్టకండి.

—ముత్యాలముగ్గు



# బాపు కౌమ్యానులు

క్లిష్ట పాత్రల్లో చతురంగారావు
దుష్టపాత్రల్లో క్రూరంగారావు
హడలగొట్టే భయంకరంగారావు
హాయిగొలిపే టింగురంగారావు
అలరించే విలాసంగారావు
రొమాన్సులో (చేయిస్తే) పూలరంగారావు
మనిషి మధుమధురంగారావు
మాటల్లో మహాచమత్కారంగారావు
కథ నిర్బలం అయితే హావభావాలు పాత్రపరంగారావు
కళ్లకట్టినట్టు కనబడేది ఉత్తియుశ్వీరంగారావు
ఆయన శైలీ తీవీ అన్యులకు సులభంగారావు
ఒకొక్కసారి డైలాగుల్లో మాత్రం యమకంగారంగారావు



ఫలానావాడు బహుదొడ్డవాడు అంటే, 'కాదు' అనేవాడు వెంటనే ఆ మాట అనడం లోకం మీద రివాజు. అగ్రతాంబూలానికి అర్హుడెవడన్న ప్రశ్న దగ్గర శ్రీకృష్ణ భగవానుడంతటి వాడికి పోటీ వచ్చింది.

తెలుగునాటి ఆధునిక లలిత సంగీత ప్రపంచానికి పితృపాదుడు, రాజు, సాలూరి రాజేశ్వరరావు అన్న అభిప్రాయాన్ని మాత్రం చిన్నా పెద్దా కూడా మన్నిస్తారు. లలిత సంగీతంలోను, తెలుగు సినిమా సంగీతంలోనూ కూడా రాజేశ్వరరావు సంగీతానిది ప్రథమస్థానం. రష్యన్ సారస్వతమంతా గోగొల్ 'కోట్' జేబులోంచి వచ్చిందన్నట్టే మధుర స్వరకల్పనా శిల్పం రాజేశ్వరరావు రచించిన లలిత సంగీత సరళి స్వరాలలోంచి, ఆయన ఏర్పరచిన ఛందోవ్యాకరణ సంప్రదాయాలలోంచి, వచ్చిందని చెప్పుకోవాలి.

సంగీత రచనా ప్రతిభ గౌరవ ప్రపత్తులు గడించి పెడితే, ప్రకృతి పురుషులను మేళవించుకొని వరస్వరసరోవరంలో రాజ హంసలా విహరించే ఆయన మంగళగళంనుంచి ప్రవహించిన మధుర సంగీతం శ్రోతల ప్రేమనే సంపాదించి పెట్టింది. క్రిందటితరం యువతలో అనురాగ మనురాగాన్ని భువన మోహనంగా ప్రస్తరించి లతాంత లలితాలైన స్వరాలతో, ఉషఃకాలపు లేతరంగులతో మనోహర మయిన రూపకల్పనచేసి చూపిన సంగీత చిత్రకారుడు రాజేశ్వరరావు. తెలుగు నేలమీద చల్లని తెల్లని వెన్నెల పడినపుడల్లా, తుమ్మెద ఝుం కారం చేసినపుడల్లా, రాధ కోపగించినపుడల్లా, పొదరింటిలో నుండి పొంచి చూసేవారు చూసినపుడల్లా, ప్రియుడి దర్శనభాగ్యం కలగని ప్రేయసి కల గని లేచినపుడల్లా హృదయంలో సన్నగా రాజేశ్వరరావు మురళీరవళి వినిపిస్తూనే వుంటుంది. వాటిలో ఏ పాట గొప్పదన్న ప్రశ్నకు, సప్త స్వరాలలో ఏది ముఖ్యం అన్న ప్రశ్నే సమాధానం!

ఆయన చేసిన పాట లన్నిటికీ సంగీత శాస్త్రం పేరుపెట్టిన మేళ కర్త రాగాలేవైనా వాటన్నిటికీ మాతృక అనురాగమనురాగమే. ఆయన సంగీతం ఆహ్లాదగుణాకరం. ప్రసాద లక్షణ లక్షితం. సంగీత రచయితగా రాజేశ్వరరావు పదిహేనేళ్ళ నాడు పద్దెనిమిదేళ్ళ వాడుగా చేసిన ప్రయోగాలూ, వేసిన కళలూ, సాధించిన ఫలితాలూ ఈనాటికీ చాల మంది సంగీత దర్శకులకు అందనంత ఎత్తునే వున్నాయి. ఈనాడు వాద్య సమ్మేళన విద్యలో నిష్ణాతు లనిపించుకొంటున్న ఔత్తరాహ సంగీత దర్శకుల ఆధునిక శిల్పాన్ని రాజేశ్వరరావు అనాడే సాధిం చాడు. అన్నిరకాల వాద్యాలపైనా ప్రభుత్వంగల ఒకరిద్దరు సంగీత దర్శకులలో ఆయన ఒకడు.

ఇవికాక శ్రోతల హృదయ వీణలపై కూడా మనోహరమైన మూర్ఛనలు పోగలగడం ఆయన గడుసుదనం.

ఆర్కెస్ట్రాలో ఏ వాద్యానికి ఏ స్వరానికీ సందర్భానికీ యతి మైత్రి ఉందో వేటికి విరోధమో, వేటికేవి ప్రాసలో, ఏదియతి, ఏది ప్రతి, ఏది ఉపశ్రుతి అనేవి ఆనాడాయన ఇచ్చిన ప్రయివేటు రికార్డులు చెప్పినంత శ్రుతి మధురంగా, అధికారికంగా మరేవి చెప్పలేవు.

వ్యాపార సరళీ స్వరాలకే విలువ ఉన్న సినిమాలో కూడా రాజేశ్వరరావు చేసిన పాటలు కొన్ని అనన్య సాధ్యాలనిపించాయి.

ఆయన మనసుంచి పనిచేసిన 'మల్లీశ్వరి' వంటి చిత్రాలలో సంగీతం స్వరస్వరం చిరకాలం రసిక హృదయాలలో స్పందిస్తూనే ఉంటుంది. అయితే రాజేశ్వరరావు మనసుంచి పనిచేసే దెప్పుడూ అని ఆయన విమర్శకులు అంటారు. 'జీనియస్' ఒకుదుకు **ఉదాహరణలుగా** భాసించే వారందరికీ ఈ విమర్శ తగులుతూనే ఉంటుంది. సబబే, ఇది పూర్తిగా హర్షించగల విషయం కాదు. అననుకూల వాతావరణంలో కూడా అచంచలంగా నిలబడి ఉత్తమ కళాసృష్టి చెయడమే ప్రతిభావంతుల లక్షణం. పరిస్థితులమీద అలిగి తనూ వాటితో కలిసి కుట్రచేయడం రాజేశ్వరరావు వంటి బహుముఖ ప్రజ్ఞాశాలికి, సర్వజన ప్రేమపాత్రుడికి భావ్యం కాదు. ◆

---

సినిమా కథలు వార ఫలాల వంటివి - గ్రహ బలాలను బట్టి మారుతాయి.

—విక్రమార్కుడి మార్కు సింహాసనం

---

గొప్పింటి జె.బి. (నాగభూషణం) : రేయ్ బట్లర్
బట్లర్ (పొట్టి ప్రసాద్) : సర్
జె.బి : అమ్లెట్ కాన్సిల్-నాలుగు పెసరట్లు వెయ్.
బ : బట్ సర్
జె.బి : ఏవిటది ?
బ : పిండిరుబ్బాలి
జె.బి : రుబ్బు
బ : పెసలు నానాలి
జె.బి : నాను.

—అందాలరాముడు



చేసిన ట్రిక్కే మళ్ళీ చేస్తూ గారడీ చెయ్యడం తమాషా కాదు
వేసిన వేషమే మళ్ళీ వేస్తూ కామెడీ చెయ్యడం మజా కాదు
రెండోది ఒకటే రకంగా అయినా ఒకటో రకంగా వెయ్యడం
ఒకటోది రెండో రకం అయినా మూడో రకంగా చెయ్యడం
ట్రిక్కూ కామిక్కూ కలిపేసిన మాజిక్కుల మనిషికే
హమేషా చెల్లే తమాషా
కామెడీ గారడీ రెంటింటికీ పారడీ
మాటలోను మేటియైను శ్రీ టీ రమణారెడ్డి

## శ్రీ వెంకటరమణా వారి బాలనాగమ్మ



కొలంనాడు జనం విరగబడి చూసిన చిత్రాలను మళ్ళీ కొన్నాళ్ళకి తీసినప్పుడు—ఉత్తరాదినా ఇంపమ్మటా కూడా సెన్సారు సర్టిఫికెట్టు మీద తారీకు తప్ప విడిచి కొత్తదేమీ ఉండదనీ, ప్రొడక్షన్స్ ఖర్చు తప్పవిడచి పెరిగే దేమీ ఉండదని ఈ తరహా చిత్రాలు చూసినప్పుడు తరుచుగా అనిపిస్తుందన్నమాట—తరుచు వినిపిస్తూనే ఉంటుంది. శ్రీ వెంకటరమణా వారి కొత్త 'బాలనాగమ్మ' చిత్రంలో మొదటి అర గంటా ఇంచుమించు ఈ మాటే అనిపిస్తుంది. పాత బాలనాగమ్మకన్నా ఇదేం బావుందని కూడా అనిపిస్తుంది—పాత వాటిమీద అభిమానం ఎక్కువ వుండేవారికి. ఇలా అనుకుంటున్న వారందరూ ఆ అరగంట తరవాతా, తెరమీద మాయల మరాఠీ కనబడ్డ ఐదు నిముషాలకల్లా అభిప్రాయం మార్చుకుంటారు— ఇన్నాళ్ళకి ఇంకొకళ్ళు తిరిగి ఈ కథను తీసినందుకు. ఈ కృషిని సమర్థించి హర్షించతగ్గ విధంగా మిగతా చిత్రాన్ని దర్శకుడు రాఘవయ్య, రచయిత సముద్రాల జూనియర్. నటుడు రంగారావు తీర్చిదిద్దారు.

జెమిని వారి 'బాలనాగమ్మ', అందులో మరాఠీ డా॥ గోవింద రాజు సుబ్బారావు,ఆనాడు ప్రేక్షకుడి గుండె ఝల్లుమనిపించచేయడం జరిగింది. ఈ రోజున అందుకు భిన్నమైన రీతిన సరికొత్త శిల్పంగా మలచిన కొత్త మరాఠీ పది నిముషాలలో మనకి ఆహ్లాదం కలిగించి, గౌరవాభిమానాలు చూరగొంటాడు. ఈ మరాఠీ విద్వాంసుడు సంగీత ప్రియుడు, రసికుడు, బహుసరసుడు, లోకంలో అందాలన్నింటినీ కని విని అనుభవించి ఆనందించడం అతని మతం. మానవుడిలోని సౌందర్యాభిరుచికీ, మోహానికీ అతడు రూపకల్పన. సిద్ధులు గడించి ఇంచుమించు చిరంజీవి అయి శతాబ్దాల మీదుగా పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ జరామృత్యువులకు అతీతుడై నిత్య యౌవనుడై ప్రవహిస్తు న్నాడు. అజేయుడైన ఆ సిద్ధుడికి అపజయం కలిగించినది పతివ్రతల జోలికి పోవాలన్న బుద్ధి. అంత యోగ్యుడికి, ముప్పువల్ల దేహానికి మోహంవల్ల బుద్ధికి మైకం కమ్మి అతడు పతనం చెందడం అనేది స్పష్టంగా కట్టుదిట్టంగా చిత్రించడంవల్ల ఈ చిత్రానికి ఒక విశిష్టత, కొత్తదనం అమరాయి.

పాపానికి పడిగట్టినా మరాఠీమీద మనకు కోపంకన్న జాలి, సానుభూతి కలుగుతాయి. మరాఠీ చనిపోవడం కూడా హుందాగా దర్జాగా జప్పింది. ఈ విధంగా ఇంత నిండుగా ఎత్తుగా నిర్మించిన పాత్ర పక్కన నటుడు రంగారావు అంత దర్జాగానూ నిలబడి దానిని సమర్థుడి సౌలభ్యంతో, చాతుర్యంతో నడిపాడు. రచయిత సముద్రాల జూనియర్ అందుకు తగ్గస్థాయిలో చక్కని సంభాషణలు సమకూర్చ గలిగాడు. చాలా కాలానికి తొలిసారిగా ఒక జానపద చిత్రంలో అర్థం అందం సమకూరిన ఒక పాత్ర దర్శనం ఇచ్చింది.

మిగతా బాలనాగమ్మ కథా కమామిషూ, పాతివ్రత్యమాహా త్మ్యమూ, సవతితల్లి పిల్లల్ని బాధించుట, సీయస్సార్ రాజుగా నటిం చుట, కుటుంబరావు చాకలి తిప్పడుగానూ పూర్వం తిప్పడి వేషం వేసిన లంక సత్యం అనాటి ముచ్చటలు నెమరువేసుకుంటూ రాజు గానూ అభినయించుటా ఉన్నాయి. తలారి రాముడుగా రేలంగి హుషారుగా నటించాడు. మాటలతోటీ మనుషులతోటీ కూడా ఆయన హాయిగా ఆడుకుని మనని ఆనందపరచాడు.

అంశం సంగీతం. ఒకటి పాత బాలనాగమ్మలోదే (రాజేశ్వరరావు చేసినది) వినిపించారు. మిగతావి కొత్తవి. దాదాపు అన్నీ బాగున్నాయి. కొత్తగానూ ఉన్నాయి, హిందుస్థానీ బాణీలో రాజసులోచన చక్కని నృత్యానికి ఆలంబనంగా సుశీల పాడిన ఆనందము ఆనందమూ అనే పాట మనోహరంగా ఉంది. ఆ పాటా చిత్రణ కూడా పాట అంత అందంగా నేత్రపర్వంగా ఉంది. మరి రెండు జోలపాటలు కూడా హాయిగా ఉన్నాయి. సంగీత దర్శకుడు టి. వి. రాజు కొత్త బాణీలను చక్కని వాద్యసమ్మేళనంతో వినిపించినందుకు అభినందనీయుడు.

మొత్తంమీద ఆరంభంలోనూ మధ్యన ఒకటి రెండు చోట్లా ఓ మోస్తరుగా నేలబారుగా ఉన్నా చాలవరకు కొత్తగా వినోదకరంగా ఉన్న ఈ చిత్రం సకుటుంబంగా చూడతగినది.◆

**1959**

## సముద్రాల జూనియర్





# మూలకారణం చెప్పేడు!

డాష్ ఫిలింస్‌వారి ట్రాష్ పిక్చరు. బ్రహ్మాండమైన బాక్సాఫీస్ హిట్ కాబోయి మానేసి ఆర్థికంగా కళాఖండం అయి ఊరుకుంది. మూడో నాటికల్లా డబ్బాలు ఝామ్మని శర వేగంతో తిరిగి వచ్చేశాయి.

♦ ♦ ♦ ♦

నాలుగోరోజు ఉదయం సంతాపసభ అను పరీక్ష ఆరంభ మైంది. పెట్టుబడిదారు, దర్శకుడు మొదలగువారు కూర్చున్నారు చర్చకి. వీరంతా తరువాత చిత్రంలో పనిచేయ దలచుకున్నారు గాబట్టి మీటింగ్‌కి టంగున హాజరయ్యారు.

"మ్యూజిక్ అంత బాగా అనినట్టులేదు. చాలదనిపించింది స్మండీ. ఇంకో రెండు మంచి పాటలుంటే బాగుండేది." అన్నాడు రచయిత; పాటలు బాగులేవన్న ఫిర్యాదుకి షోకైన భాషతొడిగి.

నిర్మాత దర్శకుడివేపు చూశాడు.



"అదేవిటండీ! చాలకపోవడమేవిటి. ట్యూన్స్ అన్నీ హిందీలో హిట్టయినవే. మ్యూజిక్ ఎక్సెలెంటుగా ఉంది. పుష్కలంగా ఉంది. అసలిది మ్యూజికల్ పిక్చరు అని అందరూఅంటె" అన్నాడు దర్శకుడు.

"ఎవరెవరన్నారు?" అన్నాడు నిర్మాత.

"ఎవరేమిటి. అందరూను. మన రాజారాం, ఇంకా నేమో—"

"అసలదీకాక డైలాగులలో ఇంకొంచెం పస ఉంటే బాగా పట్టేదేమో. డైలాగు వినేసరికి ఊతపదాలుగా తగులుకోవాలి జనానికి" అన్నాడు మ్యూజిక్ డైరెక్టరు గంభీరంగా-రచయిత వీపుతిప్పి, నిర్మాత దర్శకుడివేపు చూశాడు.

"అదేం మాటండీ. అసలీ పిక్చరులో ఉన్నన్ని ఘాటుమాటలు గత పదేళ్ళలోనూ లేవని అంతా అంటేనే... సెన్సారువాళ్లు వాటి మూలాన పిక్చరంతా కట్ చేస్తారేమోనని కూడా భయపడ్డారంతానూ-" అన్నాడు దర్శకుడు కంగారుగా.

"ఎవరూ అన్నాడు నిర్మాత.

"ఎవరేమిటీ, అంతానూ...మాట వరసకి మన రాజారాం..."

♦ ♦ ♦ ♦

"ఫోటోగ్రఫీ మొహమాట పడింది సార్. వారిక్కడున్నా ఈ మాటే అంటాను. నా సెట్స్‌ని సరిగా వాడనేలేదు. వాంప్‌కి మంచి సెక్సుర్ట్ బట్టలు వేశాను. అదంతా వేస్టే." అన్నాడు ఆర్టు డైరెక్టరు వినయంగా ఆవలించి.

నిర్మాత దర్శకుడివేపు చూశాడు.

"వాడ్డుయుమీన్, ఫోటోగ్రఫీ అద్భుతంగా ఉంది. కలర్ తక్కువ తప్పితే, ఎర్నెస్టాలర్ వర్క్‌ని మించి పోయిందని అంతా అంటేనే. కళ్ళు తిరిగిపోతున్నా యన్నారు" అన్నాడు దర్శకుడు.

"ఎవరన్నారూ" అన్నాడు నిర్మాత.

"ఎవరేమిటిసార్. అందరూను...రాజా రాముా, ఇంకా నేమో—"

♦ ♦ ♦ ♦

"ఇవన్నీ నాకు తెలీదుగాని బావా. కథ సరిగా లేదోయ్, చెత్తకథ. పొద్దికూడా" అన్నాడు ప్రొడక్షన్ మానేజరు.

ఈ సారి దర్శకుడు ధీమాగా, కొంచెం గర్వంగా కుర్చీలో వెనక్కివాలి, సిగరెట్టు దమ్ము ఘాటుగా లాగివదిలి, నిర్మాతవేపు చూశాడు.

కథ అడ్డంతిరిగి తనమీదకే ఒరగడంతో నిర్మాతకంగారుపడ్డాడు. "బాగుంది. కథకేం లోటు? కథ యక్సలెంటు సరుకు. ఇట్టాటిది పధి హేనేళ్లకితం వచ్చిందిట అంతే. మళ్ళీ రాలేదని అందరూ అన్నారు. ఇది ఫష్టుక్లాసు కథనీ, దీంతోటి పిచ్చరు హిట్టవుతుందనీ ప్రతివాడూ అనడమే. ఎవరన్నాకొట్టేగల్రు జాగ్రత్తని వార్నింగులు కూడా ఇచ్చారు గదా విన్నవాళ్ళంతా" అన్నాడు ఆయాసపడుతూ.

"అలాని ఎవరన్నారూ" అన్నాడు దర్శకుడు మాటలు కసిగా సాగదీసుకుంటూ.

"ఎవరేటి అందరూను. మన రాజారాం. ఇంకానేమో..."

♦ ♦ ♦ ♦

హఠాత్తుగా వాక్యం మధ్యలో ఆగిపోయాడు నిర్మాత. ఒక్కసారి చుట్టూరా చూశాడు.

"ఎవరు?...ఎవరీ రాజారాం?" అని గావుకేక పెట్టాడు.

ఎవరూ మాట్లాడ లేదు.

"ఎవడంటా, అన్నీ యక్సలెంటూ యక్సలెంటూ అంటూ పక్క తాళంవేసి అంతా చెండాలం చేయించి, పిక్చరు ఫ్లాపుచేయించి, డబ్బు నష్టం అయిపించి, మన్ని దెబ్బ తీయించిన ఈ రాజారాంగా డెవడూ అంట. మన కంపెనీలో ఏంచేస్తున్నాడు" అన్నాడు నిర్మాత ఆవేశంతో.

"రాజారాంగారు సిలుకుచొక్కాలు తొడుక్కు సిగరెట్టుకాలుస్తూ ఉంటారు. ఆయన మీకు పక్కతాళంవేస్తూ, అందుకు డబ్బు చెక్కేస్తూ, తన వాళ్ళకి ఛాన్సులు ఇప్పిస్తూ ఉంటాడు, పక్కతాళం ఆర్కెస్ట్రాకి చీఫ్" అన్నాడు రచయిత హేళనగా.

♦ ♦ ♦ ♦

సంతాపసభ ముగిసేసరికి ఈ చిత్రం ఇలా ధ్వంసం కావడానికి దర్శక రచయితలు, సంగీత ఛాయాగ్రహణ కళాదర్శకులు, కామెరా, ఎక్స్ట్రాలు, క్లాపర్‌బోయ్‌లు, అందరు వీరిలో ఏ ఒక్కరూ బాధ్యులు కారనీ ప్రొడ్యూసరు డైరెక్టరు చుట్టూ గోడలు నిర్మించిన 'యస్'మన్ రాజారామే ఈ పతనానికి మూలకారకుడు, అని తీర్మానించారు. ♦

# బాపు కార్టూనులు

సుభేల్లుటుంచు జారె గుండె
సూర్యకాంత వాఘ్ఘునా
ఘనమ్ము గర్జనమ్ముహో!
మహా మహోగ్ర ధర్షణమ్
స్నుషాశ్రు వర్ష కారకమ్ము
భర్తృ శత్రు భర్జక
మ్ము 'సర్వగర్వ భంజకమ్ము
ప్రేక్షకాళి రంజకమ్!

రొప్పుపెట్టు ఆలిగా దుష్టనోటి కాళిగా
నటించుటామె కేళిగా – గయ్యాళిగా
నాతిగాని నాతి – లేక గొప్పచుప్పనాతిగా...
"ఏయ్ అబ్బీ! ఏవిటో్ నీ బేహద్బీ అని!
తలుపుచాటు కోడళ్లా పెద్దమాటల్లాటున్ని
లబోదిబో తిడితే తెలీదనే – తెలిస్తే తెగబడి
తిడుతున్నావనే
కదూ! మళ్లీ చదూ పైదాన్ని – నేను కోడళ్లనే వాళ్లనే
వేపుకు తింటున్నాననే దుష్టనోరు దాన్ననే
కదూ నువ్వన్నదీ! అబ్బే జోగొన్నీ
నా దుష్ట నోర్లేక పోతే నీలోని
జాలి, వాళ్లలోని సుగుణం – ఎంత
అట్టేటుగున పడి అఘోరించేవనీ!"

దురుసు నోటి పలుకుబడికి
పంతులమ్మ మీరు
బాక్సాఫీసూత్రాలికి
పలుపు తాడు మీరె
మీరు లేని బయస్కోపు
ఉప్పు లేని చారు.
మీరు వచ్చి నిలిస్తేను
సీనిక వహ్వారె!





# బహుముఖ ప్రజ్ఞావతి

చలనచిత్ర ధరిత్రిచరిత్ర ముఖపత్రాన్ని గర్వకారణాల తోరణాలతో అలంకరించడానికి అక్షరక్రమానపేర్లు ఎన్నిక చేస్తే 'బి' శీర్షిక క్రింద బహుముఖ ప్రజ్ఞావతి భానుమతి పేరుచేరుతుందని సిని జనులూ, సినీ జనాభిమానులూ కూడా అంగీకరిస్తారు.

నేటి సినీతారకు ముఖ్యమైన అందచందాలతోపాటు, స్వతంత్ర మైన-నటనా శిల్పం, నటనలో అనుభవాన్ని ప్రజ్ఞలోకి తర్జుమా చేసుకోగల ప్రజ్ఞ, ఎవరేమన్నా అనుకున్నా, అనకున్నా, తలపెట్టిన ప్రతికొత్త పనీ ఆసాంతం చేసే సాహసం, చేసి ఆపైన పర్యవసానాలకు తట్టుకోగల బలం ఆమె సొత్తు.

ఆయాసం లేకుండా హాయిగా, పట్టు దారంమీద మంచి ముత్యంలా సాఫీగా, కొండమీద వాగులా చలాకీగా ప్రవహించే మధుర గానం ఆమెకు అమూల్యమైన కంఠాభరణం. భానుమతికి—తమిళ

దేశంలో కూడా ప్రసిద్ధి కెక్కిన అగ్రశ్రేణి తెలుగు నటీమణులలో ప్రథమస్థానం ఉంది. అందుకు ఆమె సంగీతం కూడా ఒక కారణం. కర్ణాటక సంగీతం మీద ఆమెకు గల అభిమానానికి నిదర్శనం. తను తీసే ప్రతి చిత్రంలోనూ విధిగా ఒక త్యాగరాయ కీర్తన గాని వర్ణంగాని వినిపించడం. భానుమతి నటననూ, గాత్రమాధుర్యాన్నీ కీర్తిస్తూ అనర్గళంగా ఉపన్యసించగల వాటిలో మల్లీశ్వరి, విప్రనారాయణ చిత్రాలు ఎన్నతగ్గవి. ఆమెకు సంగీత రచనలో కూడా అభినివేశం ఉంది. చలన చిత్ర దర్శకత్వానికి సాహసించిన తొలి ఆంధ్ర మహిళ కూడా ఆవిడే. రచయిత్రిగా కూడా భానుమతి ఇటీవల కృషిచేసి, హాస్య రచనలతో అలరించింది. ఆమె కట్టే వాక్యాలు, ఆమెలాగే ధాటీగా, చురుకుగా నడుస్తాయని ఆమెను ఎరిగిన వారంటారు. ఆత్మ విశ్వాసానికి అహంకారానికి మధ్య సరిహద్దును జరపడానికి సంకోచించని వారు, ఒకొక్కసారి భానుమతి ధైర్యాన్ని ఆత్మ విశ్వాసాన్ని గర్వం అనీ అహంకారమనీ నిర్వచిస్తారు.

వినమ్రత మంచిదేగాని, అనవసరంగా లేని పోని వినయం, నమ్రత అభినయించడం తనకు గిట్టదని ఆమె అంటుంది. ఈ వైఖరితోనే, తనకు 'గిట్టని' పరిస్థితులలో ఆమె తెలుగు పరిశ్రమకు అంటకుండా ఎక్కువగా తమిళ చిత్రాలలో నటించడం జరుగుతోందని స్థితిగతుల నెరిగిన వారు అంటారు.

ఒకసారి ఒక ఫిలిం అభిమానాల సంఘంవారు ఆమెను ఉత్తమ నటిగా ఎన్నుకుని, ఆమె దగ్గరకు వెళ్లి ఆసంగతి చెప్పారు. ఆమె తాంకహ్యా అన లేదు. 'వెరీగుడ్ మీకు మంచి పేస్తుంది' అంది.

నిజాని కీఅంశాల నిజానిజాలూ సాధక బాధకాలూ సినిమా ప్రేక్షకులకూ, సంగీత ప్రియులకూ సంబంధించినవి కావు; అయినా ఏవి ఏమయినా, భానుమతి అతి సమర్థులైన తెలుగు కళాకారులలో అగ్రగణ్యా అని, ఆమె తెలుగు చిత్రాలలో ఇతోధికంగా కనుపించడం వాంఛనీయమనీ సినీ పరిశ్రమ లోపలా ఇవతలా ఉన్న కళాభిమానులు కాంక్షిస్తున్నారనడం సత్య దూరం కాదు ◆

16-9-59



## పొన్నలూరి వారి

# భస్మరేఖ

"మతిభ్రమతో మంచం పట్టిన రవి మళ్ళీ మామూలు మనిషి ఎలా అయ్యాడు?"

ఎలాగ అయినా మళ్ళీ మామూలు మనిషే అవుతాడు. అవడానికేం సందేహం లేదు.

అసలు తెలుగు చిత్రాలలో నాయకుడు చిరంజీవి రవికి ఎప్పుడూ ఢోకా ఉండదు.

మతిపోవడం వంటివి జరిగినపుడు, ఊచిపుచ్చుకు చెంప కాయ కొడితే స్మృతి రావచ్చు. అతగాడు నిలుచున్న చోటుకు కాస్త అసింటా పిడుగుపడితే రావచ్చు, లేదా బుడగ పేలినా రావచ్చు. ఇంకేదేనా కారణం కావచ్చు.

పొన్నలూరి వారి "భాగ్యరేఖ" చిత్రంలో ఇక వ్యవధి లేక పోవడం ఒక కారణం అయింది. మరో కారణం, ప్రియురాలు దూకుడుగా వచ్చి పక్క గదిలో ఉన్న తిరుపతి వెంకటేశ్వరసామిని నిలవేసి, "ఏమయ్యా స్వామీ నువ్విపుడైనా (18 రీళ్ళు అయ్యాక) ఆదుకునేట్టా లేనట్టా?" అంటూ ఉరిమిచూసి దులిపెయ్యడం.

మొత్తానికి రవి మేలుకున్నాడు. తరవాత కోలుకున్నాడట.

అసలు అతడు మరో విధంగా ప్రవర్తించడానికి వీలులేదు. ఎందుకంటే, అతగాడి ప్రియురాలు లక్ష్మికి అరచేతిలో జెర్రిపోతులాంటి భాగ్యరేఖ ఉందిట. దాని ప్రకారం ఆమె కోటికి పడగెత్తిన ఇంటి కోడలు కావలసి ఉంది. ఈ ఏర్పాట్లు సక్రమంగా జరగడానికి మతి భ్రమించిన రవి బతికి బట్టకట్టక తప్పదు.

"భాగ్యరేఖ" చిత్రకథ అంతా ఈ సూత్రం అడుగుజాడలలో నడచింది.

తల్లీ, తండ్రీ, ఐశ్వర్యం, ఆఖరికి నోట్లో నాలికా కూడా లేని అనాథ బాలిక లక్ష్మి, పినతల్లి ఇంట నానా అవస్థలూ పడుతూ పెరుగుతుంది.

అది తెలిసిన తరవాత అమె ముసలి తాత ముసలయ్యా ఆమెను వెంట తీసుకుపోయి పెళ్లీడు వచ్చేదాకా పెంచి, పెళ్లి చెయ్యకుండా హరీమంటాడు.

లక్ష్మి మళ్ళీ పినతల్లి ఇంటికి వచ్చి, కొన్నాళ్ళవస్థలుపడి, ఒక రోజున తన బట్టా పాతా ఓ కాన్వాస్ సంచిలో వేసుకుని తిరుపతి వెళ్తుంది. అక్కడ జీవిత రేఖని చెరిపి వేయబోయిన వేళ, భాగ్యరేఖ కలగచేసుకుని అడ్డుపడుతుంది.

తరవాత లక్ష్మి, తను కోడలు కావలసిన కోటీశ్వరుడి ఇంట ఆశ్రయం సంపాదిస్తుంది. ఆ యింటి బిడ్డడు రవి ఆమెను వరిస్తాడు.

సిరి కూడా వరించేలోగా, కథ అడ్డం తిరిగింది. జలతారు చీరగట్టి వారం పది రోజులు కారు షికారు కూడా చేసిన లక్ష్మి, మళ్ళీ ఒక రోజున తన పాత కాన్వాసు సంచీ (కంటిన్యుటీ అద్భుతంగా పాటించారిక్కడ) తీసుకుని మళ్లీ వెళ్లిపోయింది అలవాటుప్రకారం.

ఇలా పరిపరి విధాల పరుగెత్తిన ఈ కథా, కథానాయకీ, 18 రీళ్లు పై చిలుకు తిరుగంగా, గమ్యస్థానం చేరుకోవడం జరుగుతుంది.

ఈలోగా, దర్శకుడు శ్రీ బి. ఎన్. రెడ్డి నవరసాలూ చిప్పిల్లే విధంగా కథలో అనేక ఘట్టాలను ప్రవేశపెట్టారు. పాటలు పది పన్నెండూ, తెలుగులోకి తర్జుమా చేసిన బొంబాయివాళీ వీధి నృత్యాలు రెండు మూడూ కూడా చొప్పించారు.

అయితే ఈ నృత్యాలు బాక్సాఫీసు హంగులని మనం అనుకొనరాదు. "ఇలాటివి నేటి చిత్రాలలో ఉంటున్నాయి సుమండీ" అని విమర్శను ధ్వనిస్తూ హేళన చేయించారు.

ఇది ఒకరకంగా ఉభయ తారకంగా ఉంది.

మొత్తం మీద చిత్రంలో ప్రత్యేక ఘట్టాల చిత్రించడంలోనే రెడ్డిగారి ప్రతిభ, శిల్పనైపుణి ప్రస్ఫుటంగా గోచరిస్తాయి.

ఆయా ఘట్టాలను రక్తి కట్టించడంలో శ్రీ పాలగుమ్మి పద్మరాజు మాటలూ, ప్రతిభావంతులైన నటీనటుల కృషి కూడా చాలా దోహదం చేశాయి. సునిశితమైన విమర్శ, అతి సున్నితమైన హాస్యం మేళవించి పద్మరాజుగారు వ్రాసిన సంభాషణలో చక్కని చమత్కారధార ఆద్యంతం ప్రవర్తిల్లింది. పాత్రౌచితి చెడకుండా అయన వీటిని ప్రశంసనీయంగా సాధించారు.

కృష్ణశాస్త్రిగారి పాటలు ఈ చిత్రానికి విశిష్టతను సమకూర్చాయి. సంగీత దర్శకుడు శ్రీ పెండ్యాల నాగేశ్వరరావు కూర్చిన వరసలు కొన్ని బొంబాయి బాణీలు, అనుకరణలూ అయినా, తెలుగు రాగాలలో కూర్చినవి శ్రుతి పేయంగా ఉన్నాయి. ఉన్నవాటిలో "కన్నీట కడలి లోన-చుక్కానిలేని నావ", "నీ వుండేదా కొండపైనా. స్వామి నేనుండేదీ నేలపై, ఏ లీల సేవింతునో" వంటి పాటలు రెండు మూడు అత్యుత్తమంగా ఉన్నాయి.

మధురంగా, మనోహరంగా ఉన్న "నీ వుండేదా కొండపై" అనే గేయసాహిత్యం, దానిని రాణింపచేయగలిగిన స్థాయి సంగీతం, దేవుడి మీద పువ్వులు వేసినంత మెత్తగా, హాయిగా సుశీల పాటని పాడిన విధం, ఆ గేయాన్ని చిత్రించిన ఘట్టాలకు, ఈ చిత్రానికీ, కూడా విశిష్టతను ఘనతను చేకూర్చాయి.

కథా, కథానాయికీ కూడా తరచుగా దారివిడిచి కొండలా గుట్టలా పర్యటించడం ద్వారా కలిగిన అవకాశాలను ఛాయాగ్రహణ దర్శకుడు శ్రీ ఎ. ఎస్. కొండారెడ్డి అద్భుతంగా వినియోగించుకుని రమణీయమయిన దృశ్యాలను ఇందులో పొందుపరచారు.

జమున, రామారావు, జానకి, రేలంగి, సి.ఎస్.ఆర్, సూర్య కాంతం, డా॥ గోవిందరాజు సుబ్బారావు, రమణారెడ్డి, ఎ. హేమ లత, కె. వి. యస్. శర్మ, సి. నాగభూషణం, అల్లు రామలింగయ్య,

ఒకరకంగా
ఉభయ తారకంగా...



కథ, నాయకీ
పరిపరి విధాల తిరుగంగా...



డా॥ శివరామకృష్ణయ్య, సీతాబాయమ్మ, బలరాం, మాష్టర్ పర్మ, కుమారి శశికళ, భారతి, సీతారత్నం ఇందులో పాల్గొన్నారు.

నటీనటులందరూ పాత్రోచితమయిన నటనను ప్రదర్శించారు. లక్ష్మి భూమిక నిర్వహించిన జమున, ఇన్నాళ్ళూ ఈ తరహా పాత్రలే నటించినా, ఈ చిత్రంలో గత అనుభవాలను సద్వినియోగం చేసుకొని కొత్త స్థాయిని అందుకొంది. నిండైన విగ్రహం, చక్కని నటన ఈ పాత్రకు నిండుతనం చేకూర్చాయి.

మాస్టర్ పులిగా రేలంగి ఇందులో హుషారైన వేషం వేశాడు. ఈసారి సినిమా లోకంలో టోకరా శాస్త్రాన్ని, శాస్త్రజ్ఞులను, "వీక" వదలిపెట్టడానికి ఈ భూమికను చక్కగా వినియోగించారు. ఈ వేషానికి గల బలం, రేలంగి నటనతో ఇనుమడించింది.

పదహారణాల తెలుగుతనం ఉట్టిపడే సాంబయ్యగా రమణారెడ్డి

మధుర
మనోహరంగా....



అద్భుతమైన నటనాకౌశలం ప్రదర్శించాడు. ఎక్కడా ఎబ్బెట్టు అనిపించకుండా మితిమీరకుండా ఇతడు నటించాడు. అరక్షణం వ్యవధి, అంగుళంచోటూ ఇస్తే, చక్కని హాస్యాన్ని చవి చూపించగల బాలకృష్ణ ఈ చిత్రంలో "అతిథి"గా ఒకే ఒక్క నిముషం కనిపించినా చక్కని హాస్య నటన ప్రదర్శించాడు.◆

1957

---

కంట్రాక్టరు (రావుగోపాలరావు) హాలాన్ని ఎగాదిగా చూస్తున్న ముక్కామలతో :-

అయ బాబో అలా చూసేశారేటండీ. ఆవిడెవరనుకుంటున్నారు. పెద్ద ఆఫీసరుగారి భార్య. ఇద్దరు పిల్లలు.

ము :- అలాగా. ఏదో డాన్సురకంగా వుంటేనూ!

కం :- బావుందండోయ్. దాన్సిగదరగా. ఆఫీసరు పెళ్ళాలు డాన్సు చెయ్యగూడదేటండి! కలాపోసన. మడిసన్నాక కసింత కలాపోస నుండాలి. పొద్దత్తమానం తిని తొంగుంటే మడిసికీ గొడ్డుకీ తేడా ఏటుంటది!

—ముత్యాలముగ్గు

---

భీవుడు (ప్రసాద్‌బాబు): (సిగ్గుతో) దొరా—మరీ-మరీ-ఎర్ర నర్సిగాడి కూతురు చిన్ని లేదూ—దాన్ని...

దొర (రావు గోపాలరావు): కడుపు చేశావా—ఎన్నో నెల?

భీ: చిఛీ—అదేంటి దొరా—దానిమీద మనసు పడి—మనువాడాలనీ...

దొ: మనసు పడితే పడు—పదిసార్లు పడు. దానికి మనువూ లంపటం ఎందుకురా! బువ్వ దిన్నాక ఆ ఎంగిలాకుని విసిరి పారెయ్యాలగానీ కడిగింటో పెట్టుకుంటారా?

—మనవూరి పాండవులు



# కాగజ్ కె ఫూల్

గురుదత్ సినిమాస్కోపు చిత్రం 'కాగజ్ కె ఫూల్' ఎంత బాపుంటానని ఆశపెట్టిందో అంతానిరాశ కలిగించగలిగింది. ఒక సమర్థుడి ప్రజ్ఞ, విలువైనకాలం, బోలెడంత డబ్బు, రెండు మూడు మైళ్లు సెల్యులాయిడ్ ఫిల్మూ అన్నీ వృధా అనిపించింది. పేరులాగే ఈ చిత్రం కూడా రంగూ రుచీవాసనాలేని పువ్వు. సాంకేతికమైన హంగులవల్ల, గురుదత్‌కు గల ప్రతిభవల్ల రూపురేఖలు మాత్రం అందంగా కుదరి చిత్రం చక్కని పువ్వులా తయారైంది. అంతే. ఇది ఇలా జరగడానికి కారణం కథలోని ముఖ్య పాత్ర దిగులుగా, మెతకగా ఉండడం కథకి లక్ష్య శుద్ధి లేకపోవడం.

ఇది ఒక ఫిలిండైరెక్టరు వ్యథ. అతని సినీ జాతకం విజ్ఞానికి ఏమంత అద్భుతమైనదిగా కూడా తోచదు. ఓ మోస్తరు దర్శకుడు. అతడు ఒక కలవారింటిపిల్లని పెళ్ళిచేసుకుంటాడు. ఆమెకీ, ఆమె కన్న వారికీ, సినిమా వాళ్ళంటే చిన్నచూపు. చులకన. అందుకని ఆమె అతన్ని సినిమాపని వదలివెయ్యమంటుంది. అతను వినకపోయేసరికి తనే అతన్ని వదిలేసి పుట్టినింటికి వెళ్ళిపోతుంది. డైరెక్టరు కుప్పకూలిపోతాడు. ఆ విచారంలో అతను ఎలాగో 'వహీదా రెహమాన్' ను చేరదీసి కొత్తతారగా తన చిత్రంలో పరిచయంచేస్తాడు. ఆమె తీరా తారాపథానికెక్కాక, కథ బలియం కావడంవల్ల కొన్ని సినీ కారణాలు పట్టుకుని అతనికి దూరంగా పోతుంది. అందుకోసమే ఆగినట్లు అతను హఠావుడిగా దుఃఖసముద్రంలో మునిగి మదిరసముద్రంలో తేలుతాడు. ఇలా కొన్ని రోజులు తిరిగాక అర్థరహితమైన మరణం-ఎటొచ్చి

ఫోటోజెనిక్‌గా—పొందుతాడు. అతను ఏ కాస్త ప్రయత్నించినా ఇంత జరిగేదికాదని మనకు అనిపిస్తుంది. కాబట్టి చివర్న అతనిమీద సాను భూతి కలగదు. సినిమావారిమీదా కలుగదు. కాని, గురుదత్‌వంటి వాడు చిత్రం తీసినపుడు సినిమా మీద ప్రజలకు గల దురభిప్రాయా లను పోగొడతాడని అనుకుంటాం. అత నలా చేయకపోతే బాధ పడతాం. పోనీ అలాంటి పనులు కాపోతే పోయె హృదయంగమమైన కథను చెప్పాడా? హృదయాన్ని బద్దలు చేసేటంత దుఃఖస్థితిని అందులో ఒక మానవుడి క్షుభిత హృదయాన్ని ఆవిష్కరించాడా? అదీ జరగలేదు. గుండె బద్దలుకావడం కాదు గదా, బీటకూడా వెయ్యేదు—ఎంత జాలిగుండె ప్రేక్షకుడికైనా. ఈ విధంగా గురుదత్ చేసిన ఈ ప్రయత్నం బాధ, నిరాశ కలిగించింది.

ఇక సాంకేతికంగా ఈ చిత్రం మెచ్చుకు తీరవలసినదే. చక్కని ఛాయాగ్రహణం—మనదేశానికి తొలిసారిగా సినిమాస్కోప్‌లో కథను నేత్రపర్వంగా చూపించింది. గురుదత్ దర్శకత్వ శిల్పం ఆయా సన్ని వేశాలను ఎంతో అందంగా సున్నితంగా చెక్కి మరీ చూపింది. సంగీతం యథాశక్తి తోడ్పడింది.

ఆ యా పాత్రలకు ఉన్న అవధులలో దర్శకుడుగా గురుదత్ ఎంత జాగ్రత్తగా నటించినా అది రాణింపుకు రాలేదు. అతనికి స్నేహి తురాలై మనశ్శాంతిని కల్గించిన తారగా వహీదా ప్రశంసనీయంగా నటించింది. జానీవాకర్ మామూలుగా చేసే అల్లరి ఈ దిగులు కథలో ఏమూలా ఆనలేదు. అందరికన్న మిన్నగా తన పాత్రను ధరించిన వాడు—దర్శకుడి మామగారుగా నటించిన మహేష్‌కౌల్.

బర్మన్ సంగీతం బాగుంది. కాని, లక్ష్యహీనమైన ఈ కథను మటుకు అరంగుళం కూడా ఉద్ధరించలేకపోయింది.♦

**1959**

---

జీవితంలో చాలా మందికి దొరికే బొమ్మలు నచ్చవు. నచ్చే బొమ్మలు దొరకవు.

—అందాలరాముడు

తెలుగు చలన చిత్రాల కథలో నాలుగు కాలాలు నిలువబోయే కొత్త పేరు, శారదావారి 'జయభేరి'. ఈ దశాబ్దంలో వచ్చిన చిత్రాలలో ఇది అనేక విధాల ముఖ్యమైనది.

సంగీతం, సాహిత్యం, నటన, కళ, కథనం, ఛాయాగ్రహణం మొదలైన వివిధ శాఖలలోనూ ప్రశంసనీయమైన పరస్పర సమన్వయం గల కృషి ఫలితంగా సర్వాంగ సుందరరూపం ధరించిన ఈ చిత్రాన్ని

## శారదావారి జయభేరి



సంగీత ప్రియులు సంగీత చిత్రం అనవచ్చు. సాహిత్యాభిమానులు దీని ఘనత మల్లాదిశాస్త్రిగారిదీ ఆత్రేయదీ అనవచ్చు. చలన చిత్ర కళాభిమానులు పి. పుల్లయ్యగారు తీసిన ఉత్తమోత్తమ చిత్రం అని పొగడవచ్చు. నటన మీద గురిగలవారు ఇది పూర్తిగా నాగేశ్వర రావు చిత్రం అనవచ్చు; గుమ్మడినీ, ఐదు నిముషాలసేపు అతిథిగా కని పించిన రంగారావునూ, అంజలీదేవినీ, శాంతకుమారినీ సగర్వంగా చూపించవచ్చు. టూకీగా చెప్పుకోవాలంటే, తెలుగు చలన చిత్రాలలో ఎన్నతగ్గ ప్రమాణాలన్నిటినీ ప్రతిబింబించే చిత్రం అని అంతా అంగీక రిస్తారు. దాదాపుగా 'పరిణతమైన' అన్న విశేషణానికి అర్హతగల చిత్రం.

ఇందులో సమకాలికమనతగ్గ సమస్య లేదు. కాని, దాని ఛాయలు లేకపోలేదు. దర్శక రచయితల చిత్రణవైఖరే ఇందుకొక నిదర్శనం. కులతత్వాలను, మత దురభిమానాన్ని ఖండించబోవ డంలో ఆయా పాత్రలను చిన్న సైజు భూతద్దం కింద పెట్టి చూపెట్టారు. బహుశా 'బాక్సాఫీసు భూత'ద్దం కావచ్చు... ఈ ఒక చిన్న అపశ్రుతి వినా మిగతా కథను కళాత్మకంగా శ్రద్ధా భక్తులతో చిత్రించారు. సన్నివేశాలను హృదయంగమంగా కట్టారు. సంగీతం ఎక్కువగా ఉన్న చిత్రంలో కథ అష్టకష్టాలూ పడడం పరిపాటి అయినా, 14 పాటలుగల ఈ చిత్రంలో కథా, సంగీతం అద్భుతంగా సహవాసం చేశాయి. వెలుగు నీడలలా ఒకదాని నొకటి మెచ్చుకుంటూ ఒకటొకటి ప్రస్ఫుటం చేశాయి.

కథ ప్రధానంగా ఒకానొక సంగీత వరప్రసాది వ్యథ. కాశీనాథ్ అనే ఆ యువకుడు అన్నా వదినెల చాటున అపురూపంగా పెరు గుతూ శాస్త్రీయ సంగీతం అభ్యసిస్తూ ఉంటాడు. శాస్త్రీయ సంగీతాన్ని సామాన్య ప్రజలకు దగ్గరగా తీసుకువెళ్ళాలన్న స్వతంత్ర భావాలు గలవాడు అయినందువల్ల, గురువు విశ్వంభరుడు కల్యాణిరాగం సాధన చెయ్యండిబాబూ అంటే రాగప్రస్తారం ప్రేక్షకులకు అట్టే రుచించదని నరాసరి కీర్తన మొదలుపెట్టిన ధైర్యశాలి. గుర్వాజ్ఞను కొద్దిగా దాటేస్తే వేశాడుగాని, అతను నాపని చేసినందువల్ల, "మది శారదాదేవి మంది రమే" అనే మధురమైన ఉత్తేజకరమైన కీర్తనను విని మహదానందం పొందగలుగుతాము. ఘంటసాల, శ్రీనివాస్, సత్యం, పాణిగ్రాహి పాడిన

ఆ పాట, అందులో స్వరకల్పన, ఘంటసాల విన్యాసాలూ, గాత్ర ధారులకు, తెరమీద పాత్రధారులూ దర్శకుడూ చేసిన రూపకల్పనా శోభించి, ప్రేక్షకులను జరుగబోయే కథకు ఆయత్తం చేస్తాయి.

మొత్తానికి శిష్యుడు కాశీనాథ్ తిన్నగా ఉండడు. ఊళ్ళో బత్తెన వాళ్లు భాగోతం ఆడుతుంటే చూడబోయి 'నన్నెంచిన వాడేడీ' అంటూ అక్కడ జనాన్ని సవాలుచేస్తున్న చిన్నదాన్ని చూసి ఎదురు సవాలు చేసి పాడి ఓడిస్తాడు. కర్ణాటక బాణీలో ఆరంభమైనపాట క్రమంగా ఫిల్మీగీత్ స్థాయికివచ్చి పూర్తి అయేసరికి ప్రజానీకాన్ని ఆనందింప చేయడమే తన కర్తవ్యం అని నిర్ణయించుకొంటాడు.

బాహ్మలపిల్లడు బత్తెనాళ్లతో కలిసిపోవడం కలవరం కలిగిస్తుంది. గురువుగారు, ఇంట్లో అన్నగారూ మండిపడతారు కాశీనాథ్‌మీద. కన్న తల్లిలా పెంచిన కమలమ్మ ఏడ్చి మొత్తుకుంటుంది. కూడనిపనులు చేయవద్దని. కానీ, కాశీ బత్తెన చిన్నది మంజులతకు ఇచ్చినమాట నిలబెట్టుకోవడానికి మళ్లీ చాటుగావెళ్లి రంగంమీద కెక్కడంతో పరిస్థి తులు విషమించి అతడు ఇల్లు వదలిపోవడం జరుగుతుంది. కులం వాళ్లు వెలివేస్తారని, కాశీ అన్నగారు విశ్వనాథశాస్త్రి తమ్ముడిని పొమ్మం టాడు. ఇంక చలేమిటని కాశీ మంజులతతో మధురమైన యుగళ గీతం ఒకటి పాడి (ఘంటసాల, సుశీల) ఆమెను దైవసాక్షిగా వివాహం చేసుకుంటాడు. భర్తకి తెలియకుండా వచ్చిన వదినెగారు దంపతులను దీవిస్తుంది...

అక్కడితో కాశీనాథ్ జీవితంలో పతాక సన్నివేశం. అందులో నాగేశ్వరరావు నటన ఆరంభమై మోహనరాగ స్వరారోహణలా అతి వేగంతో తారస్థాయిని అందుకుంటాయి. కాశీనాథ్, మంజులతా దేశాల వెంట తిరుగుతూ, 'జాను తెనుగె నేను, జాతి ఘనతే నేను' అని సగర్వంగా శ్రుతిమధురంగా చాటుతూ అఖండ ప్రజాభిమానాన్ని సంపా దిస్తారు. విజయనగర చక్రవర్తి విజయానంద గజపతి కాశీనాథ్‌ను నిండుసభలో గౌరవించి, కాశీ గురువుచేతనే సన్మానం చేయిస్తాడు. ఆ సభలో సంగీతరసరాజు కాశీచేత, రసికరాజు ఐన చక్రవర్తిని ఉద్దేశించి సంగీత దర్శకుడు పెండ్యాల,గాత్రధారి ఘంటసాలచే పాడించిన"రసిక రాజ తగువారము కామా" అనేకీర్తన, రాజ సన్మానానికి అర్హమైన స్థాయిలో రసభరితంగా, ఆపాతమధురంగా, ఆలోచనామృతంగా




ఏయన్నార్ ఎంటీయార్ కన్నా ఏడాత్తక్కువ గానీ మెగాస్టార్ కన్నా
పదమూడున్నరేళ్ళు ఎక్కువ
గానీ 1921లో పుట్టిన ఎస్వీయార్
కన్న ఏళ్లర్ధంత క్కువ- అందరికన్న
చిన్నవాడెవడూ? ఒకోవాటి
విడి విడి వయస్సెంత చెప్పుకో_




డాడీయండీ - నా బెలూను
ఫ్లాపయిందండీ!
DIRECTO

**భాసించింది.** కాల్పనిక స్వర విన్యాసాలను అంత మధురంగా కట్టు దిట్టంచేసి ఆ క్షణంలోనే పాడినదిగా తోచేలా పాడించడం ప్రశంస నీయమైన సాధన. 'మధురమణి' స్వరగణిత శిల్పంలో మంద్రస్థాయిన రెండు స్వరాల మీద ఘంటసాల పోయిన పోకడలు మరపురానివి.

సంగీతరాజోచితమైన రాజమర్యాదతో గిరిశృంగాన్ని అధిరోహించిన మధురగాయకుడు కాశీనాథ్ మదిరలాలసుడై ఆ పైనుంచి జారిపడిపోతాడు. రాజనర్తకి అమృతం, మఠాధిపతి (ముక్కామల) కూడబలుక్కు చేసిన కుట్రఫలితంగా ఖైదీగా చక్రవర్తి సముఖాన నిలుస్తాడు. చక్రవర్తి రసహృదయుడు; సరసహృదయుడు. నైతికంగా పతనంచెందినా కళాకారుడు ఎన్నటికీ పూజనీయుడేనని, అతని కళా విభవం చెన్ను తరగదనీ చెప్పి కాశీని పంపివేస్తాడు. ఈ సంఘటనకు పూర్వం నర్తకిఇంట్లో కాశీ తాగి మైమరచిన స్థితిలో పాడిన మధు మధురగీతి 'నీ దాన నన్నదిరా నిన్నే నమ్మిన చిన్నదిరా'ను చక్రవర్తి వినిఉంటే, అతన్ని అసలు దేశం వదలి వెళ్ళనిచ్చేవాడే కాడు. వాగ్గేయ కారకుడుగా కూడా తిరిగి సమ్మానించే వాడనిపిస్తుంది. కాశీకి ఇంత ఊహలు లేవు. 'మదిరోహ' లోనే ఉండి ఇల్లు గుల్లచేసి అన్నీ తెగనమ్మి, భార్యను సాధించి బాధించి ఆహిరిరాగంలో గాంధారంలా అందరి హృదయాలనూ—ప్రేక్షకులు సహా-విషాదభరితం చేసివేస్తాడు. అది భరించ లేని గురువు విశ్వంభరుడు, "అమ్మా శారదా! నీ బిడ్డలు లక్ష్మీకటాక్షం కూడా పొంది సుఖించడం సహించలేవా?" అని తర తరాలుగా కళాకారులుపడిన దారిద్ర్యపు, క్షోభలన్నిటినీ సమీక్షించి ఒక గాథలో పలుకుతాడు సరస్వతి ఎదుట.

కాశీనాథ్ నైతికంగా పతనం చెందుతున్న కొద్దీ కళారాధకుడుగా తార స్థాయికి పెరుగుతూ ఉంటాడు... బహుశా అందువల్లనే 'పైనున్న' వాడికి వినపడవలసి ఉన్న చివరి పాటను ప్రసిద్ధ తమిళగాయకుడు సౌందరరాజన్ పాడి ఉండాలి. ఈ పాటలాగే ఈ సన్నివేశం, దీనికి దోహదంచేసిన పూర్వఘట్టాలూ కూడా ఉద్వేగభరితాలుగా తీవిగా కట్టుకువచ్చారు. పతితుడు కాశీనాథ్‌లో పరివర్తన తేవడానికై వదిన గారు కమలమ్మ భర్త ఆజ్ఞను ధిక్కరించి ఇల్లువదలి వెళ్తుంది. బ్రాహ్మణ్యానికి భయపడిన విశ్వనాథుడు భార్యని కూడా వదులు కొంటాడు. చివరకు కాశీ భార్య మంజులతను బ్రాహ్మణ్యం కొట్టి

గాయపరచడంతో అతనిలో పరివర్తన కలుగుతుంది. దురభిప్రాయం పారచిరిగి పోతుంది 'ఏది బ్రాహ్మణ్యం' అన్న ప్రశ్నకు సమాధానం తెలుస్తుంది. తను సఖ్యుడైన బ్రాహ్మణ్యాన్ని ధిక్కరించి, తమ్ముడి కోసం, తన భార్యకోసం పరుగుపెడతాడు. ఆ వేళకు తాగి పడివున్న కాశీనాథ్‌మీద, పాతికేళ్ల పెంపకంలో తొలిసారిగా చెయి చేసుకుని అతన్ని మేల్కొల్పినవదినగారు తనకింక పనిలేదని ఆత్మహత్యకు పాల్పడుతుంది.

తెలుగు సినిమాలో చాలా కాలంగా మనం చూచి ఉండని తరహాలో నిండైన మనుష్యుల మనసులను, హృదయ పరివర్తనాన్ని సమగ్రంగా సమర్థంగా ఉదాత్తంగా చిత్రించే సన్నివేశాలను ఈ చిత్రంలో చివరి ఘట్టాలలో చూస్తాం. వీటిని ఇంత గొప్పగా చూపిన చలన చిత్రకారుడు పి. పుల్లయ్యగారు అభినందనీయులు. ప్రతి సన్ని వేశంలో దృశ్యాల రూపకల్పన, శిల్పం ప్రత్యేకం చెప్పుకోతగ్గది. ఆయన తీసిన చిత్రాలలో, ఇతరులు తీసిన అనేక చిత్రాలలోను కూడా 'జయభేరి' అగ్రతాంబూలం అందుకొంటుంది. అదే శ్రేణిలో ఇందులో పాల్గొన్న కళాకారులు నాగేశ్వరరావు, అంజలీదేవి, గుమ్మడి, శాంతకుమారి సన్మానార్హులు అనిపించుకున్నారు. కాశీనాథ్‌గా నాగేశ్వర రావు, విశ్వనాథ్‌గా గుమ్మడి చిరస్మరణీయమైన నటన ప్రదర్శించారు. హాస్యాన్ని ఈ కథలో విడిగా చూడలేము. ఉన్నదాన్ని, కథలో నేర్పుగా అందంగా కలిపి కథకు అడ్డురాకుండా సర్దారు. రేలంగి, రమణారెడ్డి, నల్లరామ్మూర్తి, సురభికమల, సూర్యకాంతం అంతా ఆహ్లాదకరంగా ఉన్నారు. అందరికన్న మిన్నగా ఆహ్లాదాన్ని ఇచ్చిన నటుడు ఐదు నిమిషాలసేపు చక్రవర్తిగా కనిపించిన అతిథి రంగారావు. నిర్మాతలూ, నటుడూ ఈ పాత్రకు 'అతిథి' ముద్రవేసినా, గొప్ప నటనతో కూడిన మంచి పాత్రల శ్రేణిలో నిలబడుతుంది.

సంగీత దర్శకుడుగా పెండ్యాల నాగేశ్వరరావు ఈ చిత్రంలో నిర్వహించిన పాత్ర ఎంత ప్రముఖమైనదో అంత విజయమూ సాధిం చింది. కర్ణాటక బాణీల దగ్గరనుండి ఉస్తాద్ కరీంఖాన్ తుమ్రీఛాయల దాకా, జావళీల దగ్గరనుండి సినీవాళీ జానపదాలదాకా, శ్రుతిమధుర మైన నవరసస్వరాలన్నీ మనోహర హారాలుగా కూర్చి గొప్పగా చెప్పుకో దగ్గ ఫలితాలను సాధించారు. శాస్త్రిగారి జానుతెలుగు పలుకుబడులు,

ఆరుద్ర అంత్యప్రాస క్రీడలు గల నృత్యనాటికా గేయాలు, శ్రీశ్రీ నందనారుగాథ ఇతివృత్తానికి శోభను కూర్చే రీతిన భాసించాయి. నృత్యనాటికలలో రాధాకృష్ణ, మత్స్యగంధి పెళ్లి చాలా బాగున్నాయి. నృత్యాలలో చిత్రం ఆరంభంలో అంజలీదేవి చేసిన నృత్యం ఒకటి చైతన్యవంతంగా వుంది. అన్నివిధాలా సంతృప్తి కలిగించే ఈ చిత్రాన్ని ఉగాది కానుకగా రేపు విడుదల చేస్తున్నారు.◆

**1959**



మల్లాది
రామకృష్ణశాస్త్రి



శ్రీకృష్ణుడు-పూజారి మాధవయ్యతో

"మానవా! నీ కెంత అహంకారమయ్యా! నీకన్నా అందమైన రూపం లేదనేగా దేవుణ్ణి నీ ప్రతిరూపంగా తీర్చి దిద్దుకున్నావు!"

—బుద్ధిమంతుడు

# బాపు కార్టూనులు

చేపట్టే కథల్లా పుష్టిగా
చూపెట్టే చిత్రాల్లా తుష్టిగా
జోకొట్టే పాటల్లా లాలనలా
ఛై పెట్టే వేళల్లా హేళనలా

కోపానికి కార్టూన్లా
కోపంలా టూకీగా
కబుర్లలో టూకీగా...

వేడుక వాడుక భాషమీద
అధారిటీగా ఉండువారు
డబ్బాపేరూ తెచ్చే
ఓల్డుగోల్డు స్కూల్ మాస్టర్
మీ పులయ్యగారు

పనేమిటో తెలీకుండా ఎన్నడూ
వేంవారం వెళ్ళినవారు కారు
గానీ – ఒళ్ళ 'కన్యాశుల్కా'నికి
మటుకాయన
చేసిందొక్తి షికారు!





# మల్లీస్వరం

తీసిన కాసిని సినిమాలూ గంగిగోవుపాలు. చిత్రశుద్ధి, చిత్తశుద్ధిగల
కళాకారుడు. ఒకొక్క చిత్రం, ఒకొక్క సన్నివేశం.అందులో ఒకొక్క
దృశ్యం, ఒకొక్క యజ్ఞం. తా వలచిన ఊహకు కావలసిన బొమ్మ,
రావలసిన చందం కుదిరేపర్యంతం బి. ఎన్. పడే తపన, తన
యాగంలో పాల్గొనే నటులను రచయితలను పెట్టే యాగీ అమితమైనవి.
'సానుభూతి' లేని వారికి చిరాకు కలిగించేవి, ఆర్థిక లాభసూత్ర భాష్య
కారులు నిశితంగా ఖండించేవి. చలనచిత్ర నిర్మాణంలోని సర్వాం
గోపాంగాలూ తన ఈ "ఊహ చిత్రం"లో అందమైన రేఖలుగా, తను
వినిపించే పాటలో స్వరాక్షరాలుగా ఇమిడే వరకూ, ఆకుమాటు
పిందెలా, తల్లిచాటు బిడ్డలా, కృష్ణునితో మురళిలా అమరేవరకూ

**స్వరానుస్వరాలలా** వాగర్థాలలా ఏకమయేవరకూ బి. ఎన్. అహో రాత్రాలూ పడే క్షోభను తపస్సే అనాలి. అందుకే ఆయనతో పనిచేసిన **వారంతా** ఈ మాట ఆయన 'రాయించు'కున్నారు, ఈ పాట ఆయన 'చేయించు'కున్నారు; పాడించుకున్నారు అనే అంటారు గౌరవ పుర స్సరంగా.

చిత్తశుద్ధితో పనిచేయడం అనేది కనీస ధర్మంగా, అధరిమేనా గొప్ప **విషయంగా** చెల్లి చివరకు చాదస్తంగా కనిపించి స్వర్ణ యుగం అనే మాటకు రూఢ్యర్థంపోయి 'పదార్థమే' ఖంగున మోగే ఈనాటి **వరకూ** పరిమాణాలు పెరిగి ప్రమాణాలు పడిపోయే సన్నివేశాన్ని చూస్తూ అప్రతిభులైపోయిన వారిలో, తేరుకొని బాధపడిన వారిలో బి. ఎన్. ఒకరు. చాలకాలం గట్టిగా నిలబడ్డ వారూ ఆయన ఒకరే.

స్నేహం సాప్తపదీనం అన్నారు. బి. ఎన్. రెడ్డి, తెలుగు సినిమా కలసి ఏడు చిత్రాలు నడవడం జరిగింది. కాబట్టి, వారు వీరో వీరు వారో కావాలి.

ఉద్గ్రంథాలు పదిలంగా దాచుకోడానికే తప్ప చదువుకోడానికి కాదన్న నానుడిని బి. ఎన్. ఉత్తమ చిత్రాలకూ ముడి పెట్టవలసి వచ్చింది ఆర్థికంగా చూసిన వారికి. అందువల్ల, ధైర్య స్థైర్యాలు గల బి. ఎన్. కూడా పరిస్థితిగతుల పత్తిడిని మన్నించవలసి వచ్చింది. ఒక ఘట్టంలో-ఇటీవలిది—ఒక వంక లాభసాటి సూత్రం ఉపయో గించుకుంటూనె మరొకవంక ఉత్తమాభిరుచి, సంస్కారంగల కళా కారుడుగా వాటిని తనే గర్హిస్తూ ఏకకాలంలో ఉభయతారక మంత్రం పఠించి జోడుగుఱ్ఱాల సవారీ సాధించబోయారు...

జనబాహుళ్యం పోషించని సత్కార్యాలను ఆచరిస్తూ ఒక వ్యక్తి అవస్థపడాలనీ, సభలలో పత్రికలలో చప్పట్లు కొడుతూ కొందరు సగర్వంగా ఉపన్యాసాలు ఇవ్వడానికి వీలుగా ఒక వ్యక్తి కష్టనష్టాలు భరించాలనీ ఒకరిని ఆజ్ఞాపించే అధికారం, హక్కూ ఏ ఒకరికీ లేని మాట నిజమే; కాని కొన్ని మంచిపనులు చేయగల ప్రతిభా వ్యుత్పత్తులు గలవారికి మాత్రం ఈ మంచి పనులు చేయడం బాధ్యత, విధీ అవుతుంది.

ఈ దృష్టితోనే సదాశయాలు, అవి సాధించాలన్న సంకల్పం, తగిన సంస్కారం, వాటికి దీటైన సామర్థ్యం కూడబలుక్కు గూడు పుఠాణీ చేసుకుని బహుకొద్దిమందిని మాత్రమే కలసి కట్టుగా వరిస్తాయి మరి.◆

---

**సినిమాలో చేరడానికి వచ్చిన రాజుకి రాయుడి హితబోధ :**

"రంగులు కలపడం మార్చడం నేర్చుకో నిజం మీద అబద్ధం చరిస్తే కల్చరు అవుతుంది. అసూయ మీద ప్రేమ అలికితే బిజినెస్. బాధకి చాలీ చాలని రీవిని కప్పితే దైన్యం. ఎదటివాడి దైన్యం మీద హేళన ఒంపితే హైన్యం. విషాదం మీద చిరునవ్వు తెరవేస్తే కరుణ.

—విక్రమార్కుడి మార్కు సింహాసనం

---

బెస్ట్‌ఫ్రెండ్‌యొక్క భార్య పద్మ(వాణిశ్రీ)వైపు చూస్తూ (మోహన్‌బాబు) :

పైటనైనా కాకపోతిని
పడతి ఎదపై ఆడగా
రైకనైనా కాకపోతిని
రమణి గుండెల నడుమగా
వాలుజడనే కాకపోతిని
వనిత పిరుదుల..."

వాక్యం పూర్తి కాకుండానే పద్మ చేతుల్లోని సరుగుజువ్వ మోహన్ ముఖాన్ని చీరేసింది.

పద్మ : "దుర్గనై నీ ముఖము నిప్పుడు చీల్చగా చెండాడగా
చండినై నీ వేడినెత్తురు చూడగా కసి తీరగా."

—గోరంత దీపం

బాపు కొమ్మెనులు

గానలత లీల
కోమల సుశీల
మృదుగీతి రీతి
నాజూకు నాతి
మంగళ గళాన
మంజుల పథాన
మధుర స్వరాల
వెదజల్లు వేళ
మైమరపుగొలుపు
సరిగమపద నిషాలు





## చందమామావారి
# సిపాయి కూతురు

**చం**దమామా ఫిలింస్ వారి జానపద చిత్రం 'సిపాయి కూతురు' ఆంధ్రలో రెండో వారం సా-గుతోంది. కొవ్వలి లక్ష్మి నరసింహారావు గారు ఇదే పేరుతో వ్రాసిన నవల దీనికి ఆధారమని, తెలుస్తోంది. ఆయనే దీనికి సంభాషణలు వ్రాయడం, ఇందులో కథా, నాయిక పేరూ ఆయన లోగడ వ్రాసిన నవలలో వాటిని పోలివుండడం ముఖ్య నిదర్శనాలు అంటున్నారు.

ఇందులో కథానాయిక పన్నాగా జమున 'అభినయించింది'. సిపాయి పాత్రను గుమ్మడి ధరించాడు. రాజుగా నాగయ్య, దుష్ట సేనానిగా రాజనాల, ఎ. వి. సుబ్బారావు, రమణారెడ్డి, బాలకృష్ణ, పేకేటి శివరాం మొదలగువారు నటించారు. సత్యనారాయణ అనే కొత్తనటుడిని యువరాజు (హీరో) పాత్ర ధరించింది.

'దొంగల్లో దొర' చిత్రం దర్శకుడు పి. చెంగయ్య దీనికి చలన? చిత్ర? కథా? సంవిధానం? (?) ఏర్పరచి, దర్శకత్వం నిర్వహించారు సంగీతం సుబ్రహ్మణ్యం రాజు.

అనగనగా ఒక రాజుగారికి అధ్యాత్మికచింతన ఎక్కువై, ఆధ్యాసలో రాజ్యం,అధికారం వంటి చిన్న విషయాల సంగతి పట్టించుకోకుండా వాటిని రాజనాల పరం చేసి, 'రాజా' కంఠంతో (నాగయ్య) రిటైరైన రాజులా పాడుకుంటూ ఉంటాడు. అందువల్ల దుష్టుడు రాజనాల డాన్సులూ అవీచూస్తూ తీరికవేళలలో ప్రజల్ని హింసిస్తూ ఉంటాడు. రాజకుమారుడు ఎక్కడో చదువుకుని పెరిగి పెద్దవాడై ఊళ్ళోకొచ్చి గుర్రం ఎక్కబోయి పడతాడు. సేనానికీ, ఆఖరికి సిపాయికూతురు పన్నాకి కూడా లోకువైపోతాడు. పన్నాముందు వేళాకోళాని కోమారు వేళాకోళ మాడినా, తరవాత ఆలయం సెట్ మీద యువరాజుకు మనసునర్పిస్తుంది. తరవాత ఇంకాచాలా కథ ఉంది. కాని ఒకవరస ప్రకారం చెప్పుకోవడం, కష్టం. రాజనాల రెచ్చిపోవడం, అప్పుడు పన్నా వీరమల్లు అనే పేరుతో వాడియావారి నాడియాలా గుర్ర మెక్కి సేనావాహినిని చెండాడినట్లభినయించడం, భిల్లగూడెంలో అంతా అమెకు బంట్లు కావడం, పేకెటి శివరాం కోయవాడిలా మాట్లాడడం ఉన్నాయి. చక్కనిఔట్‌డోర్ దృశ్యాలు ఉన్నాయి.

చివర్ని మీరు ఎదురుచూడని మెలిక, అక్కడ విడిగా, బాగుందని చెప్పుకోతగ్గ సన్నివేశం ఉన్నాయి. చిత్రం పూర్వార్థంలో రమణారెడ్డి ఛలోక్తులూ, బాలకృష్ణ నటన చాలా సరదాగా ఉన్నాయి. ఉత్తరార్థంలో "మొక్కజొన్న తోటలో" పాట, జమున వేషం వేసుకుని చేసిన మనోహరమైన నృత్యం ఈ చిత్రానికి ఏకైక అలంకారం. మాటవరసలూ (తెలిసినవే), పాట వరసా (కొద్ది మార్పులతో),జమున నృత్యం కూడా అందంగా కలిశాయి.

ఈ చిత్రంచూసి కథాప్రకారాన్ని మీరు పసిగట్టి సరిగ్గా చెప్పగలిగితే, కొవ్వలివారు అది ఆధారంగా మరోనవల వ్రాయగలరు.◆

1959

---

**స్టుడియో గేట్లో గూర్ఖాని ప్రసన్నుణ్ణి చేసుకోడం స్టార్‌వాల్యూలేని పిక్చరుకి డిస్ట్రిబ్యూషన్ సంపాదించడం అంత కష్టం.**

—విక్రమార్కుడి మార్కు సింహాసనం



# దర్శకులపతి

నవ్విన ఊళ్ళే పట్నాలవుతాయన్న నానుడి నీరసించిపోతున్నపుడల్లా ఎవరో ఒక ప్రజ్ఞాశాలి వచ్చి, దాన్ని ఆదుకుని ఆ మాట నిలబెట్టి, 'ఇది ఉట్టి సామెతేన'ని నిస్పృహ చెందే వారికి ధైర్యం చెబుతూ ఉంటాడు. చలన చిత్రరంగంలో సినిమా దర్శకుడు ఎల్. వి. ప్రసాద్‌గారి జీవితపు నుడికారం ఇదే. ఒకప్పుడు ఒక పెద్ద మనిషి ఆయనను చూచి నవ్వారు. నువ్వు డైరెక్టరేమిటని. నిదానస్థుడు ప్రసాద్ మాటకు మాట జవాబుగా చెప్పలేదు. తన సమాధానాన్ని **15** సంవత్సరాల జీవితంలోకి అనువదించి చూపించారు. ఇది ఆరం

భించడానికి పూర్వం-ఎన్నేళ్ళో బొంబాయి వీధులలో స్టుడియో ప్రాంతాలలో చలనచిత్ర కారుల వాడలలో అయినా, ఆత్మవిశ్వాసం కలసి కలలుకని ఆపేతిని తిరగడం జరిగింది. పట్టుదల, ఆశాభావం, అనుభవం, దిగులు, ప్రతిభ, నిదానం-ఇవే బాబాయి, మావయ్య, పెద్ద పదవిలో ఉన్న బంధువు, సంరక్షకుడు అయి ఆయనను నడిపాయి. కట్, స్టార్ట్ అని నాజూగ్గా పోగ్గా జబర్దస్తీగా కేకలు వేయడం నేర్చుకోలేక పోయినా, మిగతావన్నీ-నటన, ఛాయాగ్రహణం, కథా చిత్రణ, దర్శకత్వం, అన్నిటికన్న మిన్నగా జీవితమూ అర్థం చేసుకొని, చెన్నపట్నం వచ్చాడు. ఆనాడు, అయన కాదలచుకొంటె పెద్ద నటుడు అయేవారు. సత్యమే జయంలో దొంగపాత్ర, ద్రోహిలో రౌడీ రాముడు తెలుగు చిత్రాల చరిత్రలోనే చిరస్మరణీయమైన రెండు సందర్భాలుగా తీర్చి దిద్దారు. జీవితం మీద ప్రసాద్‌ను చూసిన వారికి, తెరమీద ప్రసాద్ చైతన్యం బోధపడనంత అద్భుతంగా వుండేది. ప్రసాద్ ఆ మార్గంలో వెళ్ళివుంటే తెలుగువారు గర్వించ తగ్గ నటుడై ఈ పాటికి అనేక గొప్ప పాత్రలను తెరమీద నిలిపిఉండేవాడు. చాలా మైలురాళ్ళు వేసి ఉండే వారు.

కాని, అయన దర్శకుడుగా ముందుకుసాగి—ఆ మార్గంలో ఈ ఘనకార్యం చేశారు. ఆయన తీసిన గృహప్రవేశం, షావుకారు, పెళ్ళి చేసి చూడు తెలుగు చలనచిత్ర చరిత్రలో కొత్త బాటలుపరచిన చిత్రాలు. ప్రసాద గుణప్రధానమైన చిత్రణ ప్రసాద్‌గారి పద్ధతి. ఒక కుటుంబం సినిమా చూడవస్తే అందర్నీ సంతోషపెట్టగల శిల్పం ఆయనది. కంటికి ఇంపుగా, చెవికి ఇంపుగా ఉండేలా చలన చిత్రంలో కనపడేదీ వినబడేదీ ఉండాలనీ ఆయన మతం. ఇందు కోసం అయన సెట్ మీద, నటీనటులందరికీ అవసరమైతే ఆయా సందర్భాలలో నటించి చూపెడతాడు. సంభాషణలు ఉచ్చరించి నేర్పుతాడు. ఇది ఈనాడు చాదస్తంగా కనిపించవచ్చు—ఆ నేర్పూ ఓర్పూ లేని వారికి. ఎవరేమనుకొన్నా అంతా ఆయనను మనసా గౌరవిస్తారు. తెలుగు చిత్రసీమలో ఏ దర్శకుడికీ జరగని సత్కారం—ఆయన శిష్యులు పెద్దవాళ్లు అయి ఆ గురువుకు సన్మానంచేసి గురుదక్షిణ ఇవ్వడం—ఆయనకు మూడేళ్ళ క్రితం ఒక ఉగాదినాడు జరిగింది. నవ్విన ఊరే పట్నమయింది.

ఆ తరవాత ఆయన కట్టెలమ్మినచోట పూలమ్మేసాయాడు. ఒక నాడు ఏకాకిగా, కాకిలా వీధులవెంట తిరిగి కష్టపడిన బొంబాయిలో రెండు హిందీ చిత్రాలు తీసి తొలి ప్రయత్నంతోనే ఘన విజయం సాధించారు. ఆనాడూ ఆయన హంగూ ఆర్భాటం లేకుండానే వెళ్ళి గెలుపు సాధించారు. ✦

---

నర్సయ్య: శ్రీకరంబును, తారల కాకరంబును, పేదలకు భీక రంబుననగు బొంబాయి నగరంబొండు గలదు...

**వరహాలరాజు:** మేష్టారూ చిన్న సంగతి—మామూలుగా లైట్ వెలుగులో చెప్పలేరాండి.

—విక్రమార్కుడి మార్కు సింహాసనం

---

సోమరాజు (ముక్కామల): ఇక్కడి కెందుకొచ్చావయ్యా. ఎవరన్నా జూస్తే కొంప మునుగుతుంది.

కంట్రాక్టరు (రావుగోపాలరావు): కొంప ముంచడమే కదండీ మన కాంట్రాక్టూ!

—ముత్యాలముగ్గు

---

సినిమా పాటలో అర్థం పర్థం వెతికి పసికట్టవచ్చు. అస్తి నాస్తి సందేహం కలిగించే ప్రబంధనాయిక నడుము గురించి ఆరా తీసి ఉందని నిర్ధారణ చేయవచ్చు. తీస్తున్న సినిమాలో కథ ఏ దారిన పోతుందో ఊహించవచ్చు. దిలీప్‌కుమారుణ్ణి వేళకి సెట్ మీదకి తేవచ్చు. సౌతిండియన్ మ్యూజిక్ ప్రొడ్యూసర్లచేత బాంబే మ్యూజిక్ కాపీ కొట్టడం మాన్పించవచ్చు——కానికాని——

—కానీ—ప్రజాభిప్రాయం, ఫలానా సరుకుంటే ప్రజలు ఈ సినిమాని చూస్తారు అన్నది నిర్ధారణగా చెప్పలేము.

—విక్రమార్కుడి మార్కు సింహాసనం


సినిమాల్లో చేరకముందు
నీ పేరేవిటన్నావ్
అమ్మడూ?


నేడే చూడండి
ఆబాల
గోపాలాన్నీ
నవ్వించే
చిత్రరాజం

# రాజ్యం పిక్చర్స్ కృష్ణలీలలు



కృష్ణుడు చాలా అల్లరి పిల్లవాడు. చూట్టానికి అలా వుంటాడుగాని చాలా గట్టివాడని, దేవుడే అలా మారువేషంలో వచ్చాడనీ, అతను అల్లరి చేస్తున్న రోజుల్లోనే కొందరికి తెలుసు. తెలుసుకున్న వాళ్ళల్లో కూడా కొందరికి తెలిసినట్టే కనిపించి తెలీకుండా తప్పించుకు పోతూ వచ్చాడు. కొందరికి అసలతని సంగతి కొరుకుడు పడింది కాదు. దానా దీనా నాటికీ నేటికీ ఈ విషయం 'తుదీ మొదలూ' పసిగట్టాలని చాలా మంది తిప్పలుపడుతూనే ఉన్నారు—ఆ రెండూ ఉండవని తెలిసే! ఏమాట కామాటే చెప్పుకోవాలి; ఋషుల తరవాత, ఈ విషయమై గట్టిగా ప్రయత్నం చేసింది సినిమావాళ్ళే. ఏదో ఓ ఘట్టంలోనో, మొత్తం సినిమా అంతటి మీదనో నాటకంలోనో. కృష్ణుడిని బిగించి నిలబెట్టాలని అన్ని ప్రాంతాలవారూ ప్రయత్నిస్తూనే వచ్చారు. సినిమావారికి మటుకు విశ్వరూప సాక్షాత్కారం బాక్సాఫీసు వసూళ్ళలో కనబడాలి. అదే దాఖలా. సి. పుల్లయ్యగారు కాలంనాడు తీసిన కృష్ణలీల ఈ

దాఖలా చూపించింది. మళ్ళీ ఇపుడు రాజ్యం పిక్చర్స్‌వారి చిత్రానికి ఆయనే దాదాపు అదే సినీ కథను వ్రాసిపెట్టారు. దేవకీ వసుదేవుల పెళ్ళితో ఆరంభమయే కథా ప్రకారం పాత సినీకథా ప్రకారంగానే ఉన్నా—రాజ్యం పిక్చర్స్‌వారి ఈ కొత్త "కృష్ణలీలలు" చిత్రంలో కొన్ని కొత్త అంశాలూ వున్నాయి. సాంకేతికంగా సాధించిన ప్రగతి 'ఛాయ'లూ, సినీమాయలూ, ఇ. వి. సరోజ, సాయి సుబ్బులక్ష్మి మొదలగువారి నాట్యాలూ, 'ధిక్కారమును సైతునా' అనే పాట పల్లవికి 'ధిక్కారమును చేయుడీ' అనే మార్పూ మొదలగునవి. పాతే కథను కొత్తగా చెప్పడం, కృష్ణుని మోహనరూపాన్నావిష్కరించడం వంటి విషయాలలో—అది మహా 'మహా మహర్షులకే ఓ పట్టాన కుదరని వ్యవహారం అని, దర్శక రచయితలు ఏమంత పట్టింపులు పెట్టుకోకుండా సూటిగా సాఫీగా చిత్రించారు. నటులు లక్ష్మీరాజ్యం శ్రీరంజని, గుమ్మడి, రేలంగి, పద్మనాభం, సూరిబాబు (అక్రూరుడు) మొదలగువారంతా సినీకథోచితంగా వ్యవహరించారు. కృష్ణుడు వేసిన అమ్మాయి హాయిగా ఆడుకుంది. చూడ ముచ్చటగా వుంది.

చిత్రం అంతటి మీదా, విశ్వరూపం ధరించిన (విశ్వరూపం అంటే లావుగా ఎత్తుగా కనబడడం) కృష్ణుడిలా ఎత్తుగా నిలబడినవాడు



నటుడు రంగారావు. కృష్ణుడు మధురానగరికి వచ్చేసరికే కంసుడు మృతప్రాయుడైపోయే సన్నివేశాన్ని రంగారావు చాలా సమర్థంగా ఆవిష్కరించాడు. ఒకటి రెండు చిన్న దృశ్యాలలో ఆయనకు చేసిన మేకప్, ముఖ్యంగా గుబురుమీసం ఏర్పాటు, నటనకు ఆటంకం కలిగించింది. ఆయనమీద విశేషమైన గౌరవాభిమానాలూ, కృష్ణుడి మీద భక్తి ప్రపత్తులూ ఉన్నవాడికి కూడా కంసుడు హోరుగాలితో అల్లకల్లోలంగా ఉన్న రాజమందిరంలో మరణవేదన పడుతున్నాడా, గాలి బాగాలేక జలుబుచేసి, తుమ్ములు నిభాయించుకుంటున్నాడా అనే భయంకరమైన, క్షమించరాని ఆలోచన కలుగుతుంది... ఈ రెండూ ఇలా చిన్న కళంకాలలా మిగిలినా, మొత్తం మీద కంసుడు, రంగారావు ప్రశంసనీయంగా నడిపిన పాత్రలలో ఒకటి అనడానికి సందేహం లేదు. సందేహం లేకుండా ఉత్సాహంగా చెప్పుకు మెచ్చుకోవలసిన వాటిలో కృష్ణుడి జతగాళ్లుగా బాలకృష్ణ, నల్లరామ్మూర్తి చేసిన హాస్యం ముఖ్యం. ఇంత చక్కని, ముద్దొచ్చే హాస్యాన్ని ఈ మధ్య తెలుగు సినిమాలో చూసి ఉండము.

సంగీతం పూర్తిగా కథోచితం కాకపోయినా యథోచితంగా ఉంది. దక్షిణామూర్తిగారు రెండు మూడు చక్కని పాటలు చేశారు. ఎం.ఎల్ వసంతకుమారి పాడిన జావళి ఒకటి, సుశీల పాడిన 'అందాలగని బృందావని' (ఆరుద్ర) చాలా హాయిగా ఉన్నాయి. దానికి రూపకల్పన మైసూరు బృందావన్ గార్డెన్స్‌కు తీసుకొచ్చెయ్యడం అద్భుతం అనిపించదు. అలాగే మాయా ఛాయాగ్రహణం ఇంతగా అభివృద్ధి పొందిన ఈనాడు, యమునానది వసుదేవుడికి దారి ఇచ్చిన సన్నివేశాన్ని చాలా బాగా సహజంగా (నది అడుగున ఉంటాయని తోచేవన్నీ చూపించారు.) తీసిన ఈ చిత్రంలో మన్ను తిన్న కృష్ణుడి నోట్లో యశోదకీ, మనకీ మళ్లీ "భూగోళం మార్కు నక్షం మార్కు" భూగోళమే కనిపించడం, (అసలిది ఛాయామాయావి బాబూభాయ్‌మిస్త్రీ పేటెంటుట) అసలైన అద్భుతం. అదో కృష్ణలీల.

మొత్తంమీద మిగతా లీలలూ ఆటపాటలు హాయిగానే ఉన్నాయి కాబట్టి పిల్లలతో ఓసారి వెళ్లి చూడవచ్చు. అప్పుడేనా కృష్ణుడి నోట్లో భూగోళం (ఆస్ట్రేలియా ఇండియా వగైరా పటాలతో ఉండును) కనబడే దృశ్యం వచ్చినపుడు పిల్లల దృష్టి అట్నుంచి మళ్ళించడం మంచిది. ◆

1959

# బాపు కార్టూనులు



ప్రౌఢ వాక్యాల తెరల మరుగున...
దోబూచులాడు... ముగ్ధభావాలతో....
వన్నెలాడిలా... కన్నెతేడిలా... వయ్యారాలు పోయే...
తేనె తేటల... తెలుగు మాటల... రంగుల హొరంగులతో
తెలుగువాడి జీవిత జీమూతాన్ని ఒత్తిగించి... తెల్లని
చల్లని... చక్కని... చిక్కని... కథాశరచ్చంద్రికలు
వెలయించి—
పడుచు గుండెలు గుబగుబలాడించి...
మనసుకందని అందాలను భాషకు దించి...
బ్రతుకులో... కైతలో... బయస్కోపు స్కోపులో
అచ్చర లచ్చల పచ్చిచమత్కారాలు పండించుకుంటూ
అలనాటి పాండురంగ విభుని పదగుంభనలా
పాండీబజారు దర్బారులో నిలచి.....
ఎవరన్నా మహానుభావుకులు?
ఓహో! వచన రచనకు మేస్త్రి!
సాహో! రామకృష్ణశాస్త్రి!



# పి.ఏ.పి.వారి ఇల్లరికం

ఏమేం కావాలని తీసేవారు అనుకొంటారో,
**సి**నిమాలుచూసే జనానికి
మిళాయించి అందులో కొత్త కథావస్తువు వేసి
అవన్నీ సమపాళ్లలో
తయారుచేసిన తెలుగూ కాక్ టెయిల్
తాతినేని ప్రకాశరావు
'ఇల్లరికం'. ఇందులో చెడ్డవాణ్ణి పరిచయం చేసుకు మరీ చెడ్డపనులు
చేసేదుష్టులు, మహమంచివాళ్లూ, చక్కని హాస్యం, పాతికమందికి
జవాబు చెప్పగల 'మార్క్ ఆఫ్ జారో' మార్కు హీరో, (నల్లసూటూ,

కళ్లకి గంతలూ, పిస్తోలూ సహా) బొంబాయి వాళీడాన్సులు, ఊగ్ అండ్ దొర్ల్ డాన్సులూ మొదలైనవన్నీ ఉన్నాయి. వీటికి ఆలంబనమైన ముఖ్య వృత్తాంతం మటుకు కొత్తగా నిండుగా ఉంది. ఇది, అవీ కలసి పది హేనురీళ్లపాటు సత్కాలక్షేపం చేయడానికి యోగ్యమైన వినోదప్రధాన చిత్రాన్ని రూపొందించాయి. కథా శివబ్రహ్మంగారి కథకు చలనచిత్ర కథాస్వరూపం ఏర్పరచడంలో దర్శకుడు ప్రకాశరావుగారు, నేపథ్యంలో కొంత కథ చెప్పడంవంటి ప్రక్రియలతో మెచ్చతగ్గ శిల్పం ప్రదర్శించినా, పైన పేర్కొన్న హంగులు కొన్నిటికోసం కథని కొంత అల్లరిపెట్టడం జరిగింది. చిత్రం పొడుగునా చక్కని కామాలూ, సెమి కోలన్‌లూ పెడుతూ తరువాతి ఘట్టంమీదకు మనని సుఖంగా జరుపుతూ ఉన్నా అక్కడక్కడ ప్రశ్నార్థకాల, ఆశ్చర్యార్థకాల, గతుకులూ కొండొకచో డైలాగుల అతుకులూ తటస్థపడతాయి. ఇవి, ఘట్టం ముగిసినతరువాత తెరపడని అరనిమిషంలో రంగంపై నటులలా తెల్ల బోతాయి.

ఇల్లరికాల ఎల్లరకాలనూ పోగేసి అల్లిన ఈ కథలో ముఖ్య పాత్రధారులు, రూపకల్పన ఉండతగినంత సమగ్రంగా నిర్దుష్టంగా లేకపోయినా సమర్థంగా నటించారు. మొదట జమీందారును చెప్పు కోవాలి. ఆయనకు బోలెడు డబ్బు, ఒక్కకూతురూను. చాలామంచి వాడు. కాలేజీ వార్షికోత్సవాలలో నాటకాల వేదికమీద పెళ్ళీడు కూతురుతో అపరిచిత యువకుడెవరో చనువుగా చొరవగా సరసాలు ఆడుతూ డాన్సు చేస్తున్నా చూస్తూ కాస్తంతనవ్వుతో కూర్చోగలిగినంత మంచివాడు. ఆయన కూతురు రాధ అందమైన పిల్ల. అందువల్లనే ఒక రోజు పరిచయంతోనే వేణు ఏలాగా హీరో అని గ్రహించి మర్నాడు అతడు పాటపాడేసరికి వంతపాడి, హృదయం పరటాయిచ్చిన అమ్మాయి. వేణు తెలివైన యువకుడు, బీదవాడు. తొందర పడకుండా స్థిమితంగా ఆలోచించేవాడు. ఎన్ని అభాండాలు వచ్చినా నిలకడమీద నిజం తేలుతుంది గాబట్టి చివరిగీలులోగా చెప్పడం ఎందుకని ఆగిసే ఆసామి. ఈ వేణుకు, రాధమనసిచ్చింది. జమిందారిణికి ఇది సరిపడ లేదు. తామున్న పై అంతస్తునించి ఈపిల్లడి స్థాయికి దూకితే పరువుకు పెూదాకు దెబ్బతగులుతుందని ఆవిడఅంటుంది. మనం దూకద్దు అతన్నే పైకిలాగుదాం అని నచ్చచెప్పి జమిందారుగారు పెళ్ళి కానిచ్చి

అల్లుడిని ఇల్లరికం తెచ్చుకుంటాడు. జమున, నాగేశ్వరరావు తీరిక వేళలో నైట్‌గౌనులు తొడుక్కొని శ్రుతి మధురమైన యుగళగీతాలు పాడుతూ హాయిగా ఉంటారు. వేణు అత్తగారు, దుష్టుడు సీయస్సారూ, అతని కొడుకు "ఆర్. నాగేశ్వరరావు" కలిసి ఇంటల్లుడిని అవమానించ చూస్తారు. అప్పుడు జమీందారుగారు పెళ్లినాడు అన్న మాట ప్రకారం అల్లుడికి ఫ్యాక్టరీపై అధికారం ఇచ్చి అతని హోదాను పెంచుతాడు. అదిచూసి దుష్టులు అతని మీద అభాండాలు వేస్తారు. ఈ స్థితిలోనే వేణు చెల్లెలు (గిరిజ) నేపథ్యంలోని కథలోంచి తెరమీదకువచ్చి కనిపిస్తుంది. చచ్చిపోయిందనుకున్న చెల్లెలు, నాటకాలలో వేషాలు వేస్తున్నందుకు బాధపడి వేణు ఆమెను చివాట్లు వేయబోతాడు. తరవాత ఆమెకథను విని ఓదారుస్తాడు వేణు భార్య, అర్జెంటుగా ఆవేళకువచ్చి ఫోటో జెనిక్ కిటకీలోంచి, కథసాగడానికి పనికివచ్చే ఒకక్కడైలాగూ విని, ఒకపాటూ చూసి అన్నా చెల్లెళ్ళను ప్రియులని భావించి, అన్నా చెల్లిలాటమాట వినబడకుండా గబగబ వెళ్ళిపోయి మనసు విరగ్గొట్టేసుకుంటుంది. దాని పర్యవసానంగా, ఆస్తిని తనపేర రాయించుకుంటుంది. భర్తని అవమానించి క్షోభపెడుతుంది; తను పడుతుంది. అంతే తప్ప 'ఇదినిజమా?' అని పాడదు. అతనూ చెప్పడు.

ఈలోగా దుష్టులు ఫాక్టరీ మేనేజరు గిరీ సంపాదించి డబ్బు కాజేస్తూండడంతో హీరో వేణు, గుర్రం తక్కువ జారోగా తయారై తనకి భాంగ్రా డ్యాన్సులు చెయ్యడం, యుగళ గీతాలు పాడడం ఘటుకే కాక ద్వంద్వ యుద్ధాలుకూడా చేతనవునని నిరూపించడానికి పూను కొంటాడు.

అది తెమిలేసరికి ఎక్కడెక్కడిదొంగలూ గ్రూపు ఫోటో తీసే చోటుకు చేరుకుంటారు. మంచివాళ్ళంతా నెత్తిన తలో సినిమాటిక్ డైలాగూ వేయడం, వాళ్లు తేలిగ్గా నాలికలు కరుచుకోవడం, మన చుట్టాలే కాబట్టి వాళ్లు ఎన్ని ఘోరాయిత్యాలుచేసినా పోలీసులదాకా పోనియొద్దని మంచి వాళ్లు తీర్పుయివ్వడంతో అందరికీతృప్తి సంతోషం కలిగే విధంగా కథ ముగిసింది. ఈలోగా తృప్తి సంతోషం కలిగించే ఇతర అంశాలలో జమీందారుగా గుమ్మడి, అల్లుడుగా నాగేశ్వరరావు, రాధగా జమున

ప్రదర్శించిన నటన ముఖ్యమైనది. అందరిని అలరించే పాటలో రేలంగి చెప్పిన అల్లుడి కథ. అందులో ఆయనా, రమణారెడ్డి ప్రదర్శించిన నటన ప్రత్యేకించి చెప్పుకోవలసినవి. ఇందులో మనోహరమైన సన్నివేశాలు కొన్ని ఉన్నాయి. దర్శకుడు ముఖ్యవృత్తంలో ఉద్విగ్న సన్నివేశాలను ఎంతనిండుగా చిత్రించారో, ఈ భాగంలో వీటిని అంతహుషారుగా నడిపి మంచి పనివాడితనం చూపారు. ఆత్రేయ మాటలు వీటికి దన్నై నిలచాయి. చలపతిరావుగారి పాటలు పాత బాటలలో సాగినా ఘంటసాల, సత్యం సుశీల పాడగా వినడానికి హాయిగా ఉన్నాయి.◆

**1959**



కొసరాజు



# కథాశివబ్రహ్మం

తలా తోకా చటుక్కున పోల్చుకుందుకు వీల్లేనివాటిలో నిత్యశంకితుని భావాలూ, నూలుపోగూ, వానపామూ, రెండు జడలపిల్లా, కొత్తకార్లూ వగైరా చరాచర పదార్థాలతోపాటు చెప్పుకోతగ్గ మరో జడపదార్థం తెలుగు సినిమా కథ అంటారు. అలాగే మిథ్యా వాదాన్ని బలపరిచే ఉదాహరణలలో ప్రబంధ నాయికల నడుమూ, ఎన్నికల వాగ్దానాలలో నిజాయితీ, అవకాశవాది నిశ్చితాభిప్రాయం, తెలుగు సినిమాలో కథ చెప్పుకోతగ్గవంటారు.

ఇటువంటి తెలుగు సినిమా కథను వెనకేసుకొచ్చి నిలబెట్టగల వారిలో, ఇదీ కథేను అని కథగా చెప్పగల గొప్పగలవారిలో శ్రీ వెంపటి సదాశివబ్రహ్మం ముఖ్యులు. తెలుగు సినిమా చిన్నతనం రోజులలో (అవే గొప్పతనం రోజులూను) ప్రవేశించి నేటివరకూ,

'ఇదిగో సినిమాకొక కథ చెబుతా విను' అని చెప్పి, 'కథా రచయితగా' (చాలామంది మాటల పాటల రచయితలే) నిలబడి నెగ్గుకొస్తున్న ఒకే ఒక్క వ్యక్తి ఈయనే. కాలంనాడు హిందీలోనూ బెంగాలీలోనూ సినిమాకి గురి అయి చనిపోయిన కథల్ని తవ్వి తీసి బ్రతికించి తెలుగు ప్రాణం పోస్తాడని విమర్శించే గిట్టని వాళ్ళు ఉన్నా నేటి సినిమాల కథల విలువ తెలిసినవారూ, ఆయన వాగ్ధాటిని ఎరిగినవారూ సగౌరవంగా 'కథాశివ బ్రహ్మం' అంటారు.

సదాశివబ్రహ్మంగారు ఒక రకంగా ఆశుకవి. ఒకే ఒక కథా వస్తువు దొరక బుచ్చుకుని ఒకరోజు పొద్దుటినుంచి సాయంకాలం లోపల పద్దెనిమందుగురు నిర్మాతలకు నలభయ్యేడు కథలు— చెప్పింది చెప్పకుండా చెప్పుకుపోగలడు. గుడ్లు తిప్పుకుంటూ, పొడుగుపాటి సిగరెట్లు పీల్చేస్తూ చేతు లెగరేస్తూ 'విశాపట్నం' యాసలో 'ఆయ నలాఘు కథ లల్లీసుకుపోతూ, వాటిలో సన్నివేశాలు కళ్ళకట్టేలా', ఉద్వేగంతో ఉత్సాహంతో చెప్పుకుపోతూ ఉంటే నిర్మాతలు దర్శకులు కూడా ముగ్ధులైపోయి వింటూ ఉండిపోతారు. అంతా విన్నాక వారు ఆ విన్నదేమిటో చెప్పుకోలేరన్నది వేరు విషయం. ఇంద్రజాలికుడు సదాశివబ్రహ్మం చెప్పినప్పుడు కళ్ళకట్టినట్లు అద్భుతంగా కనిపించిన సన్నివేశాలు తెరా తెర కెక్కాక తలా తోకా తెలియకుండా తయారైతే అది ఆయన తప్పుకాదు. అసూర్యంపశ్యలలో అతిలోక సౌందర్యవతు లున్నారని ఒప్పుకుంటే ప్రేక్షకుల దాకా సాగిరాని ప్రతిభగల వారిలో (కథకీ తెరకీ మధ్య లక్షగండాలు) సదాశివబ్రహ్మం ఘనుడనే చెప్పుకోవాలి. పద్యంలో ఆశుకవిత ఘనమైతే గద్యంలో జీవితం మీద అనర్గళంగా ఆశువు చెప్పగలగడం ఈయన ప్రజ్ఞ (పద్యాలు కూడా బాగా చెప్పగలడు). ఎటొచ్చీ ఆశుకవులు ఒక మూసలో వర్ణననే తిరగా మరగవేసి రకరకాలుగా చెప్పినట్టు ఈ 'ఆశుకథకుడు' కూడా ఒకే కథను ఒక్క పూటలో ఇరవైనాలుగు మోస్తర్లలో అల్లుకుపోతాడు. మధ్యలో అతుకులూ, టంకాలూ పాత్రలూ, తీరులూ సవ్యంగా కుదరకపోయినా, అప్పుడు తెలియవు. తెలిసేసరికి కాలాతీతం అయిపోతుంది. అందుకే సినిమాలైన ఆయన కథలు కొన్నిటిలో ఏనుగు తల పాముకీ, చీమతల ఏనుక్కీ, దాని తోక పిచిక్కీ ఉన్నట్టు కనబడతాయి.

ఇరవయ్యేళ్ళ సినీ జీవితంలో సదాశివబ్రహ్మంగారి కథలతో సినిమాలై కండపుష్టితో రూపొంది బ్రహ్మాండమైన విజయం సాధించిన చిత్రాలలో ఘరానాదొంగ, సంసారం, చరణదాసి, భలేరాముడు, సువర్ణసుందరి, ఇంటిగుట్టూ, ఇల్లరికం, అన్నపూర్ణ మొదలైన వెన్నో ఉన్నాయి. వీటిలో కొన్నిటి కాయన మాటలు పాటలు కూడా వ్రాశాడు. ఇవేకాక ఆ మధ్య నటనలోను దర్శకత్వంలోను కూడా తేలిగ్గా చేయి కాల్చుకుని మళ్ళీ తన 'కథాస్థలానికి' వెళ్ళిపోయొచ్చేశాడు. ఇప్పటికీ చిన్న నటులతో కొత్తవాళ్ళతో అద్భుతమైన చిత్రం తీసి స్టార్‌వాల్యూ అనేది అపోహ అని నిరూపించాలని దర్శకుడుగా మంచి కథలు చిత్రించాలని ఆయనకు చాలా మోజు ఉంది.

హెచ్. ఎం. రెడ్డిగారి 'తెనాలిరామకృష్ణ' నుంచి నేటివరకు సినిమా కథలతో కలిసి అడుగులు వేస్తున్నవాడు కాబట్టి, తన అనుభవం, పలుకుబడి ఉపయోగించి కథను కొత్తదారులు పట్టించడం బాధ్యతగా స్వీకరించగల హక్కు అధికారం ఈయనకు ఉన్నవి. ప్రేక్షకుల తరఫున నిర్మాతలకు మంచి కథలను, కొత్తవాటిని సిఫార్సుచేసి ఒప్పించగల సామర్థ్యమూ ఉంది. మంచివాడన్న మంచి పేరూ ఉంది. వీటిన్నిటినీ మంచి లక్ష్యాలు సాధించడానికీ ప్రయోగించి సాధించిననాడు ఆయనకు తెలుగు సినిమా కథ కథలో కథా శివబ్రహ్మం అన్న పేరు స్థిరపడితీరుతుంది.◆

---

**శోభనంరాత్రి పెళ్ళికొడుకు (శ్రీధర్) పెళ్ళికూతురు (సంగీత)తో : నువ్వింతకు ముందు ఎవరినేనా ప్రేమించావా ?**

**పెళ్ళికూతురు : నేను ఆడ పిల్లని. పైగా పేద పిల్లని. మాకు నచ్చడం ప్రేమించడం అంటూ వుండవు. పెద్ద వాళ్ళేదో కుదురుస్తారు. సరే నంటాం. పెళ్ళయ్యాకే ప్రేమ.**

**—ముత్యాలముగ్గు**



# బాపు కార్ట్యూనులు

కింగ్ సైజ్ సిగరెట్‌లా
షోగ్గా పొడుగ్గా
ఆప్తమిత్రుల అభిప్రాయ భేదంలా
సన్నగా నాజూగ్గా
ఉండేవాడే విజయ సారథుల్లో
సహారథి చక్రపాణి

భాషకీ భావానికీ మధ్య వ్యాకరణైకం
నెరపిన పాణినీయం మేటిది;
కళకీ కాసుకీ - ఆ మధ్య
పెళ్ళిచేసి చూపిన చక్రపాణీయం
సినిమాకలాటిది -

అక్కా బావా అమ్మా నాన్నా
పాపా నేనూ బాబూ చిన్నా
కలిసికట్టుగా చూసేటట్టు
(కాదుసుమా ఎట్టెట్టు-ఒట్టు)
సెన్సారప్పక్షంగా తీస్తే
చాలునన్నదా శాస్త్రం సుట్టు

అంటే చంటి వెధవ
దిప్పకాయని కాదు
ఐతే నాన్నచంటూహింతో సమమా
అనకు — సబబా? కాదు!



# కంపల్షన్

కొలంనాడు ఆల్ ఫ్రెడ్ హిచ్ కాక్ చేసిన 'రోప్'- ట్రిక్ లీలగా గుర్తున్న వారికి, ట్వంటీయత్ సెంచరీ ఫాక్స్‌వారి 'కంపల్షన్' చిత్రం చూస్తే చూసిన సినిమాకే మళ్ళీ వచ్చాం అని భ్రమ కలగవచ్చు. ఒకేఒకసన్నివేశంమీద, సన్నటి కథమీద, ఉత్కంఠమీద-, హిచ్‌కాక్, నటుడు జిమ్మి స్టీవర్ట్ మనని పతాక సన్నివేశానికి తీసుకువెళ్లారు.

డబ్బు, పగ వగైరా కారణాలూ, లక్ష్యాలూ లేకుండా కేవలం చంపడంకోసమే శాస్త్రోక్తంగా అతి జాగ్రత్తగా ఒక ఖూనీ చేసి పట్టుబడకుండా ఉండవచ్చునా లేదా అన్న ఊహమీద ఇద్దరు కుర్రవాళ్లు 'రోప్' ఖూనీచేస్తారు. కంపల్షన్ చిత్రానికికూడా అదే ప్రాతిపదిక...తల...కోటీశ్వరుల పిల్లలిద్దరు—న్యాయశాస్త్ర విద్యార్థులు, కూడబలుక్కుని ఒక కుర్రాణ్ణి శాస్త్రోక్తంగా ఖూనీచేస్తారు- వాణ్ని ఒక కళగా ఎంచి, పట్టుబడకుండా ఉండాలన్న పట్టుదలలో ఎంత శ్రద్ధపట్టి పనిచేసినా. అందులో ఒకడు కళ్లజోడు వదలరానిచోట వదలి వేశాడు —'రోప్' చిత్రంలో హంతకులు శవాన్ని దాచిపెట్టిన పెట్టెమూత దగ్గర ఉరితాడు ముక్క మరచిపోయినట్టే.

అంత కట్టుదిట్టంగా, తెలివైనవాళ్ళు చేసిన హత్యను పట్టుకుని హంతకులనుబయట పెట్టడంతో ఆపడమే హిచ్‌కాక్ చిత్రం గమ్యం.

డారిల్ జానుక్-చిత్రం 'కంపల్షన్' కథకూడా అక్కడే అయిపోయినా దర్శకనిర్మాతలు బలవంతం చేసినందువల్ల ఆర్సన్ వెల్స్ భరోసాతో కొనసాగింది. ఈ రెండో భాగంలో కథ, ఆర్సన్‌వెల్స్ లాయరు వేషం వెయ్యడం; ఆయన ఫ్రేములోకి వచ్చేసరికే మనం, మనతోపాటు కథలోని పాత్రలు కూడా నానాఖంగారూపడి విరగబడి మర్యాదచేయ బోవడం. అక్కడనుంచి అంతా అమెరికన్ కామిక్స్ మల్లెచవకబారు డిటెక్టివ్ నవలల్లో పోలీసువాడి ముందర పత్తేదారుడి ప్రతిభమల్లె, హాలివుడ్ సినీహీరోమల్లె చిరాకూ, జాలీ నవ్వూ పుట్టించే అతిశయోక్తి. హంతకులకు మరణదండన తప్పించడం వెల్స్ లక్ష్యం. మరణ దండన మంచి చెడ్డలగురించి వినబడే వాదోపవాదాలన్నీ చదివిన మీదట, లాయరువెల్స్ చివర జడ్జినే హడలగొడతాడు.

"ఈ పిల్లలు కావాలని ఆలోచించి బుద్ధిపూర్వకంగా హత్య చేశారు కాబట్టి దండనార్హులంటున్నారు. రేపు వీళ్ళని ఉరివేస్తే మీరు చేసిందీ అదే అవుతుంది. ఆలోచించి పథకం వేసి చేసిన ఖూనీయే అవుతుంది." అని హడలేస్తాడు. జూరర్లు ఉంటే, తీర్పు బాధ్యత పదముగ్గురు కలిసి భరించవచ్చునని, ఇపుడు జడ్జి ఒక్కడే కాబట్టి బాధ్యత ఆయన ఒకడిదేనని బెదిరిస్తాడు.

అన్నిటినీమించి ఆలాయరు అచ్చు ఆర్సన్‌వెల్స్‌మల్లె గొప్ప వాడిలా దర్జాగా పొగరుగా కోర్టుగది అంతా పచార్లుచేస్తూ అడిగిన వాళ్ళకి ఆటోగ్రాఫులుకూడా యిచ్చే సినిమానటుడిలా తిరుగుతూ వాదించడం జడ్జీ మనసును మార్చేసి ఉండాలి. వినపడ్డ వాదాలే ఇలా ఉంటే, వెల్స్ ఇటు మనకీ, అటు జడ్జీకీ కూడా వినపడకుండా గొణుక్కుంటూ అన్న మాటలలో ఇంకా ఎంతలేసి గొప్ప ఆర్గ్యుమెంట్లు ఇమిడివున్నాయోనని జడ్జి ఝడుసుకున్నా ఝడుసుకుని ఉండవచ్చు. ఏమో చెప్పలేము.

మొత్తానికి, హాలివుడ్‌ను గొప్పగా చెప్పుకునేవాళ్ళకీ, నటనమీద-ఆంపరి జోహార్లూ అందుకోగలిగినంతటి ప్రభుత్వం ఉన్న ఆర్సన్ వెల్స్ అభిమానులకుకూడా ఈ చిత్రం చూస్తే సిగ్గేస్తుంది. చెత్త చిత్రాలు తీసే సామర్థ్యం, హక్కూగలవారు అనేకచోట్ల ఉన్నారని ధైర్యం కలుగుతుంది. ◆

1959

భాస్కర్ ప్రొడక్షన్స్

# మనోరమ

చెప్పదలచుకున్న ముక్క తేల్చుకుని దాని చుట్టూరా కథ అల్లడం, సంఘటనలు కల్పించడం లోకంమీద కథకుల పద్ధతి; సినీ లోకం మీద తీరు వేరు. చూపదలచుకున్న సన్నివేశాలూ, బుక్ చేయదలచుకున్న నటులూ అక్కడ ముఖ్యం. సరదాగా ఉండే సీనులూ, ఏడిచేవి, నవ్వేవి, నవ్వించేవి ఏర్పరచుకుని, ఆ ధరిమేనా వాటన్నిటినీ కలిపి పట్టుకునేందుకు 'ఇరుసు'ను ఏర్పాటుచేస్తారు అనిపిస్తుంది. మనోరమ (భాస్కర్ ప్రొడక్షన్స్) చిత్రంలో కథ వరసకూడా ఇలాగే కనిపిస్తుంది. ఇరుసు అర్భకమైనదని అనిపిస్తుంది. **అయితే** అర్భకంగా కనబడేవన్నీ అర్భకాలూ కావు; అసంభవంగా కనపడేవన్నీ అసంభవాలూ కావు.



ఇందులో ఉన్నది మనోరమ, ఒక కలవారి బిడ్డడికి హృదయం పరటా ఇస్తుంది.

తీరా పెళ్లి సంగతి నిశ్చయించుకునే వేళకు ఆమెకు ఒక సమస్య ఎదురవుతుంది. కళ్ళూ, ఉద్యోగమూ పోగొట్టుకుని వెనక పన్ను లేకుండా ఉన్న కన్నతండ్రీ, పెంచి పోషించగల తల్లిగానీ తిని తిరగడానికి ఆస్తిగానీ లేని చిన్న తమ్ముడూ, తను అత్తవారింటికి వెళ్ళాక ఏం కావాలి అని. అత్తవారు ఒప్పుకొన్నా తండ్రి ఒప్పుకోడు. తనకి తెలుసు. ఈ విషయమై ఆ అమ్మడు ఓ రాత్రి పూట తన తెలుగు సినిమా ఛాయలతో మంచీ చెడ్డా మాట్లాడుకుంది. తెల్లచీర బొమ్మ త్యాగం చెయ్యమంటుంది అలవాటు ప్రకారం. నల్లచీర బొమ్మ పెళ్ళి చేసుకోమంటుంది. ఈ రెంటినీకాక, (దర్శకరచయితలూకాక) మరొకర్ని-తండ్రినో భర్తనో సలహా అడిగితే ఇంత సినిమాకథ జరిగేది కాదని గిట్టని వాళ్ళు అనుకున్నా చిన్నపిల్ల కాబట్టి తోచిన నిర్ణయం చేసుకుని, తను ప్రేమించిన మోహన్‌తో పెళ్లి చేసుకోనని చెప్పి ఊరు వదలి చక్కాపోతుంది.

ఈ అంశమే మనోరమ చిత్రంలో కొత్తది. ఆ తరువాత మంచి అక్కగారు త్యాగమూ, ఒక చిన్న ఉద్యోగమూ చేస్తూ (మీరు సినిమాకి ఆలస్యంగా వెళ్లినా కృష్ణకుమారి వాలకం చూస్తే రెండురీళ్ళ క్రితం ఈమె దారుణమైన త్యాగంచేసి ఉంటుందని సుళువుగా తెలిసి పోతుంది) తమ్ముడిని పెంచి పెద్ద వాణ్ణిచేసి పెళ్లి చేయిస్తుంది. పాత సినీ అనుభవాలనుబట్టి, కొత్త కోడలు వచ్చాక మనోరమ మీద దొంగ తనం నేరం పడుతుందని మీరు ఊహిస్తే అక్షరాలారైటే. అక్కణ్ణించి ఆమె ఒక (చక్కని) నేపథ్య గీతం సాయంతో, స్వగ్రామానికి నడిచి వచ్చి తాను ప్రేమించిన డాక్టరు ఇంట్లోనే అతని కుమారుడికి దాదిగా చేరుతుంది.

ఆ అబ్బాయి కూడా మనోరమ వెళ్ళిపోయిన తరవాత ఏమంత కులాసాగా ఉండడు. మనోరమ బదులు మరోరమను, తల్లి బలవంతాన పెళ్ళాడినా ఏలుకోక నానా క్షోభ పెడతాడు. తాను పడతాడు. చివరకు విసుగెత్తి దేశాంతరం వెళ్ళి, ఇక్కడ మనోరమ తమ్ముడు పెరిగి ఉద్యోగస్తుడై అక్కగార్ని ఇల్లు వెళ్ళగొట్టేవరకూ—ఓ పది పదహారేళ్ళపాటు క్షుణ్ణంగా వైద్యం చదువుకొని డాక్టరై వస్తాడు.

మనోరమ కాదు కిందపడితే ఆపరేషన్ చేసి కాపాడదాని కనుకోకండి. అలాంటివన్నీ పెట్టి కథను పాడుచెయ్యలేదు. ఉన్నవేవో ఆరంభం లోనే ఉన్నాయి. తన ఇంట్లో దాదిగా మనోరమను చూడగానే గుర్తించి, తన క్షోభను తెలిపి తనను మన్నించుకోమని ప్రాధేయపడతాడు. మనోరమ అతన్ని మందలించి, కట్టుకున్న పిల్ల చాలా యోగ్యురాలనీ, ఆమెను ఏలుకుని సుఖపెట్టమనీ చెబుతుంది. ఇదంతా విన్న (వింటుందిలెండి) డాక్టర్ భార్య, కథ విషమ స్థితికి వచ్చిందని గ్రహించి, పూర్వాపరాలూ, బాక్సాఫీసు సూత్రాలూ, సంప్రదాయాలూ తెలుగు సినిమా చివర—హీరో హీరోయినులే మిగలాలన్న మర్యాదలూ ఆలోచించుకొంటుంది. పదిపన్నెండు క్లోజ్‌షాట్‌లలో టెక్నికల్‌గా మథనపడుతుంది. (మనిషి మొహంలో గ్రాఫిక్‌గా బాధను చూపలేక పోతే ఫోటోగ్రాఫిక్‌గా సాధించవచ్చు.) ప్రేక్షకులకూ అఖరికి సాటి పాత్రలకూ కూడా ఆమెపట్ల సానుభూతివున్నా, దర్శక రచయితలకు మార్గాంతరం కుదరక, ఎలాగా కళ్లు తిరుగుతున్నాయి కాబట్టి మేడ మెట్లమీంచి సహజంగా దొర్లిపొమ్మని ఆమెకు సలహాయిస్తారు. ఆమె ఆ సలహా మన్నించి ఖర్చయిపోవడమేకాక, పోయేముందు భర్తనూ మనోరమనూ కలిపి, పిల్లాడిని ఒప్పగించి కన్ను మూస్తుంది.

ఈ విధంగా పాత మార్గంలోనే కొత్త అడుగులు వేసుకుంటూ సాగిన యీ చిత్రం ఇటీవలి చిత్రాలకన్న మెరుగుగా, కాలక్షేపానికి యోగ్యంగా వుంది. డాక్టరుగా బాలయ్య సబబుగా నటించాడు. మూడు నాలుగు తెలుగు చిత్రాలలో నటించి కూడా మితిమీరలేక పోవడంవల్ల బాలయ్య మున్ముందు ఈ స్థాయిని స్థిరపరచుకుని రాణిస్తాడని ఆశ కలుగుతోంది.

మనోరమ పాత్ర ధరించిన కృష్ణకుమారి కూడా అందంగా వుంది. సాఫీగా నటించింది. సినిమాటిక్ త్యాగిలా కనుపించడానికి కృషి చేయకపోతే ఇంకా రాణించే దనిపించింది. అయితే ఇద్దరు జపానీయులు జర్మన్ వ్యాకరణం గురించి, ఉచ్చారణ గురించి ఫ్రెంచి భాషలో వాదించుకుంటున్నట్టుగా, ఎదటివాళ్ళని హైరాణపెడుతూ తాను పడుతూ మాట్లాడే తండ్రి (పెరుమాళ్లు) ని సముదాయించే జీవి అంతకన్న మహాత్యాగిలా పోజుపెట్టినా పెద్ద అపరాధం కాజాలదు. అలా అతిగా వ్యవహరించే తండ్రులు ఉండడం అసంభవం అనటం

లేదు. ఈ కథకి ప్రాతిపదిక అయిన మనోరమ పెళ్లి నిర్ణయంలాగే అదీ సంభవమే.

మిగతా వారిలో డాక్టరు తల్లిగా మాలతి సమర్థంగా కారెక్టరాక్షన్ చేసింది. భార్యగా ఆడేని లక్ష్మి దయనీయమైన పాత్రను దయనీయంగా నిర్వహించింది. స్థూలంగా, ఛాయాగ్రహణ సమయంలో దర్శకుడు గానూ, పర్శకత్వం చేయాల్సినవేళ ఛాయాగ్రాహకుడుగానూ వ్యవహరించిన కమల్ ఘోష్ ఈ కథలో హరనాథ్ (మనోరమ తమ్ముడు) అక్కను వెళ్ళగొట్టినందుకు పశ్చాత్తాపం పడేవేళ ఎలా వ్యవహరించాలో తెల్చుకోనందువల్ల ఆ భాగం చిత్రణా, హరనాథ్ నటనా రెండో రకం సాంఘిక నాటకంలో నాలుగో అంకంలా తయారయ్యాయి. అంతకు ముందర సన్నివేశాలలో హరనాథ రాజు హాయిగా తిరిగాడు.

ఈ చిత్రంలో కథ ముందుకు సాగడానికీ, ఆఖరిమేనా ఆగడానికీ తోడ్పడిన రమణారెడ్డి, సూర్యకాంతం, విడిగానూ, జమిలిగానూ కూడా హుషారైన హస్యంచేసి ఎక్కడికక్కడ ప్రేక్షకులను ఉత్సాహ పరుస్తారు. కొన్నిచోట్ల మాటలూ చేష్టలూ కట్టుతప్పినా మొత్తం మీద బాగున్నాయి. జీవితంలో వలెనే తెలుగు సినిమాలో కూడా సుఖ దుఃఖాలు ఒకటి వెనుక ఒకటి రావాలన్న సూత్రాన్ని మన్నించి, - తెలుగు సినిమాలకూ జీవితానికీ సంబంధం లేదంటూ గిట్టనివాళ్లు చేసే విమర్శలను వడగొట్టిన దర్శకుడికి ఈ సందర్భంలోనే అభినందనలు చెప్పుకోవాలి.

కథా వస్తువుకు తగ్గ విధంగా సముద్రాల జూనియర్ ఈ చిత్రానికి సంభాషణలు వ్రాసి రక్తికట్టడానికి తోడ్పడ్డారు. పాటలు కొసరాజూ, సముద్రాల వ్రాశారు. పాటల గురించి చెప్పుకోవలసింది అట్టే లేకపోయినా రమేష్‌నాయుడు సమకూర్చిన సంగీతం లలితంగా సుకుమారంగా ఉంది. హిందీ గాయకుడు తలత్ మహమూద్‌చేత (తొలిసారి) మూడు పాటలు పాడించాడు. ఆయనతో సుశీల పాడింది. పాటలన్నీ శ్రుతిమధురంగా, మృదువుగా ఉన్నాయి. చిత్రం ఆరంభంలో నేపథ్యవాద్య సంగీతం కూడా అత్యంత ఆహ్లాదకరంగా ఉంది. ◆

1959




ఫిలింస్థాన్ వారి కొత్త చిత్రం "అభిమాన్" మద్రాసు స్టార్ టాకీస్‌లో మే 3 న విడుదల అయింది. మహేకౌష్‌ల్ దర్శకత్వాన తయారైన ఈ చిత్రంలో అమిత, శేఖర్, చాంద్ ఉస్మానీ, మహముద్ అనే కొత్త నటుడు, యాకూబ్ ప్రభృతులు పాల్గొన్నారు. సంగీత దర్శకుడు అనిల్ బిశ్వాస్.

కథ : ఇద్దరమ్మాయిలు బి. ఎ. పట్టా పుచ్చుకున్నారు. ఒక మ్మాయి పట్టాతోపాటు, బోలెడు టెక్కు, స్త్రీ స్వాతంత్రం గురించిన సమకాలిక దురభిప్రాయాలు కూడా సంపాదించుకుంది. రెండో అమ్మాయికి విద్య యొసగెను వినయంబు. ఇద్దరికీ వాళ్ళ నాన్న పెళ్ళిళ్ళు చేశాడు. ఇద్దరిలోను బంగారుతల్లికి దొరికిన భర్త "నైట్ క్లబ్ వాలా" జాతీయుడు. అలాగే పెంకె ఘటం అయిన రెండో పిల్ల మొగుడు బంగారు తండ్రి. అందుకని దాంపత్యాలు పొసగవు. దానికి తోడు మిస్టర్ క్లబ్‌వాలా, మరదలును పెడదారిన పెట్ట ప్రయత్నిస్తాడు. చివరికి అతగాడి భార్య, అత్తగారి ప్రోత్సాహంతో యుక్తిపన్ని, భర్తకి తనమీద అపోహ కలిగే పరిస్థితి కల్పిస్తుంది. ఏ క్షణంలోనైనా నలుగురి జీవితాలూ ధ్వంసం కాగల విధంగా కథ నడుస్తుంది. ఆ క్షణం వచ్చే లోగా దర్శకుడు అపోహలు సర్దేసి, చెడ్డవాళ్లచేత క్షమాపణ చెప్పించి, చెంప లేయించి కథను ముగించాడు.

నీతి: భారతీయ సతికి భర్త తోడిదే లోకం. బి. ఏ. ప్యాసైనా సరే.

రీతి: సాంఘిక ప్రయోజనం, చెప్పవలసిన అవసరం ఉన్న ఈ సంగతిని దర్శకుడు తెరమీద చెప్పిన విధం పదమూడువేల అడుగుల పొడుగ్గా ఉంది. దారిలో, బాగులేని పాటలు (మూడే), దాటడం కష్టమనిపించే నృత్యాలూ ఉన్నాయి. ఉన్న వాటిలో జానపదం ఫక్కీలో ఉన్న పాట ఒకటే బాగుంది. అందుకు పరిహారంగా ఆ పాటను చిత్రించిన విధం, వికారంగా ఉంది. ముఖ్యమైన రెండు జంటల కథలకూ మధ్యే మార్గంగా మరో పాతకాలపు భార్యా భర్తల కథను కూడా జోడించడంతో కొంత భాగం చక్కని సూరంకాల సాంఘిక నాటకంలా తయారైంది. ఉత్తరార్ధంలో కథ మటుకు రక్తి కట్టి చక్కగా నడిచింది. చిన్న చిన్న సన్నివేశాలు కొన్నిటిని దర్శకుడు మనోహరంగా చిత్రించాడు.

ఈ చిత్రానికి నటన ప్రధానాకర్షణ. బంగారు తల్లిగా చాంద్ ఉస్మానీ, ఆమె భర్తగా మహమూద్, పెంకి పిల్లగా అమితా, ఆమె ప్రాణేశ్వరుడుగా శేఖర్, పెళ్ళిళ్ళ పేరయ్య(కమిషన్‌లేదు)గా యాకూబ్ మంచి నటన ప్రదర్శించారు. యాకూబ్ ఇందులో నిస్వార్థ సేవాపరాయణుడుగా నటించాడు. అతని సూత్రం ఒకటే. "కర్ భలా; హెూభలా." (నువ్వు మంచి పని చెయ్యి; నీకు మేలు ఖరారు.)

ఈ చిత్ర నిర్మాతలు కొంచెం దూరం ఆలోచించి ఈ చిత్రాన్ని కొంచెం సర్ది, ఇంకొంచెం దిద్ది, కొద్దిగా పొట్టిచేస్తే ఈ చిత్రం మరింత ఉభయతారకంగా ఉండేది. కర్‌భలా; హెూ భలా.◆

**1957**

---

**కన్నెపిల్ల మనసు అద్దం లాటిది. అందులో తాళి కట్టేవాడి బొమ్మ పడగానే అది పటంగా మారి పోతుంది.**

**—ముత్యాల ముగ్గు**



# ది ఓల్డ్‌మాన్ అండ్ ది సీ

చచ్చినాసరే మనిషి ఓడిపోవడం మాత్రం జరగదన్న మహావాక్యాన్ని, సార్వకాలికమైనదాన్ని స్థాపించిన హెమింగ్ వే నోబెల్ బహుమతి కథ "ది ఓల్డ్‌మాన్ అండ్ ది సీ" చలన చిత్రానువాదం గతవారం మద్రాసు న్యూ ఎల్ఫిన్‌స్టన్‌లో ఆడి-వెళ్ళింది. స్పెన్సర్. ట్రేసీ ఈ చిత్రాన్ని నటించాడు. సంగీత దర్శకుడు డిమిట్రీ (హైనూన్, తర్డ్ మాన్) టీయోంకిన్ వ్యాఖ్యానించాడు. దర్శకుడు జాన్ స్టర్జస్ దృశ్యాలు నిర్మించాడు.

సినిమా అన్న మాటకి చెలామణీలో వున్న అర్థాన్ని బట్టి కొన్ని చలనచిత్రాలను ఆ పేరుతో పిలుచుకోవడం మంచిది కాదు. 'ఓల్డ్ మాన్ అండ్ ది సీ' సినిమాకాదు; హెమింగ్ వే చిన్న మాటల, చిన్న వాక్యాల కావ్యానువాదం. ఒక్క భావానికి రూపకల్పన. అందువల్ల దర్శకుడు దీనిని కథా ప్రకారంగానే అవిష్కరించారు. మనం కథ చదువుతున్నపుడు చక్షురక్షుర సంయోగంలోంచి పుట్టే బొమ్మలనే వరసగా పేర్చుకువచ్చారు. ఆరంభంలో పది నిమిషాలుసేపు క్యూబన్ పల్లెటూరిలో తెల్లవారుఝాము దృశ్యాలను ఘనీభ వించిన సౌంద ర్యంలా చూపించారు. ఆ తరువాతదంతా సముద్రంలో పడవలో జాలరిలో కిటకిట లాడుతున్న ఆత్మవిశ్వాసం, విజయాకాంక్షాను. అతను వయసుమీద ఉన్నపుడు గట్టివాడని అందరికీ తెలుసు. ఇప్పుడు

వయసు అతనిమీద పడడంతో అతనిమీద అతనికీ, ఇంకో చిన్న కుర్రాడికీ తప్ప మిగతా వాళ్ళకి గురిలేదు. ఎలాగేనా ఓ పెద్దచేపని పట్టి తేవాలని బయల్దేరాడు. అతని ఎరకి ఒక పెద్దచేప పడింది. కాని దానికి బోలెడంత ఆత్మవిశ్వాసం, మొండితనం, బతకాలన్న ఆశాను. అందుకని అది 'పైకి తేలకుండా' గుట్టుగా గుంభనగా సముద్రం అడుగున ఉంటూనె సమరంసాగించింది. అతను దానివెంట అలాగే మొండిగా మూడు రాత్రింబవళ్లలోకి, సముద్రంమీద చాలదూరంలోకి చొచ్చుకు వెళ్ళిపోయాడు. ఎవరుచేప? ఎవరు ఎర? అన్న ప్రమాదంలో మునిగే పర్యంతం వెళ్లాడు. చివరకి చేప ప్రాణం ఒడ్డి ఓడిపోయినా చచ్చి సాధించబోయింది. తిరుగు ప్రయాణంలో, అదేసొర చేపల— నాకర్షించిన ఎరచేపగా తయారైంది. ముసలిజాలరి, తన విజయ ఫలాన్ని సొరచేపలు కబళిస్తూ వుండగా, కడంటిన ప్రాణాన్ని ఆశను కూడదీసుకుని కాళ్లా చేతులా పెద్ద సొరచేపల మంపతో పోరాడి వాటిని తరుమగొట్టాడు. చివరికి మిగిలింది అతని విజయం తాలూకు అస్థిపంజరమే అయినా మొత్తానికి అది విజయమే. ముసలివాడిలో శక్తి సామర్థ్యాలను చూపి మిగతావారిని సంభ్రమ చకితులను చేసిన విజయమే.

సముద్రంలో మూడురోజులు పోరాడి, మానవుడికి పరాజయం లేదని ధైర్యం చెప్పే మహావాక్యాన్ని, గట్టున తెచ్చి పడేసిన ఘనత అతనికే దక్కింది.

కాని, ఆ ముక్క అతనే చెప్పుకోవడం ఏమంత అద్భుతంగా ఉండదు. పలకని స్వరంలా, అర్థోక్తిలా, ధ్వనిలా ఎదటివాడిలో రావలసిన ఊహ వచ్చేవిధంగా విషయాన్ని చెప్పడం కళాత్మకమైన శిల్పం లక్షణం. ట్రేసీ ఎంతబాగా నటించినా, స్టర్జెస్ ఎంత జాగ్రత్తగా చిత్రించినా ఆ భావం మనలో కలగదన్న భయం చేతనో, ట్రేసీ ఎరతాడు బిగలాగే హడావుడిలో ఉన్నపుడూ, విశ్రాంతి తీసుకున్నపుడూ అతని కథను నేపథ్యంలో నుంచి మనకి వివరిస్తూ వచ్చిన ఆసామి కాల్షీటు యివ్వకనో, దర్శకుడే "మానవుడు మరణించవచ్చుగాక, పరాజయం మాత్రం పొందడు" అనే నీతిమాటని, ఈ కథకు ముడి సరుకే తప్ప 'ఆలోచన' ఏమాత్రం కాని జాలరి నోటనే అనిపించేశాడు!

దారుణం. ◆

1959

# వీణాప్రవీణ

వీణావాణిలో లాలిత్యానికి, దీపికి, శాస్త్రీయతకు, నవ్యతకు ఈమని శంకరశాస్త్రిగారి పాణి పెట్టింది పేరు. విద్యపై ప్రభుత్వం, దానిని సవ్యంగా నడపగల విచక్షణ, నిగ్రహం, చక్కగా ఉపయోగించుకోగల భావుకత, అందుకు తగిన ప్రయోగశీలత, దానికి కావలసిన సాహసం, ఆత్మవిశ్వాసం కూడబలుక్కున్నట్టు గుమిగూడే అరుదైన సందార్భాలలో ఆయన వీణ మీటు మేటిదని పండితులంతా మెచ్చుకొంటారు.

శంకరశాస్త్రిగారు వైణికుల వంశంలో పుట్టి పెరిగారు. తండ్రి అచ్యుతరామశాస్త్రిగారి వద్ద శాస్త్రం మాత్రం పరిగ్రహించి, కొద్దికాలంలోనే తన కొక శిల్పాన్ని తానే సృష్టించుకున్నారు. తన కొత్తతరానికి తానే 'స్వరవడి' మీటి ఒక సంప్రదాయానికి నాంది వ్రాసుకున్నారు. కళ ఆలంబనంగా పుట్టిన శాస్త్రానికి, కళను శాసించి దిగ్బంధంచేసే



దురలవాటు ఉంది; ఇదితగవైన మార్గమని మాత్రం చెప్పతగు సంప్ర
దాయం అటూ ఇటూ ఆకాశ కుడ్యాలు కట్టి, 'ఇదేదారి' అనిపింపచేసే
వంచనా శిల్పాన్ని అవలంబిస్తుంది. చూడ్డానికి మెత్తనివాడైనా, నిజా
నికి 'గట్టి'వాడైన శాస్త్రిగారు ఈ రెంటినీ కాదన్న రోజులలో, ఈదారి
నాదన్న రోజులలో, తోటివారికి మేటివారికి కూడా ఉట్టి పోకిరీగా,
కట్టుతప్పుతున్న నాయకుడుగా కనబడ్డారు. అయినా మొండికెత్తి,
జనరంజకం కానిది సంగీతం కానేరదన్న దొకటి గీటురాయిగా, కళ
నిత్యవర్ధిష్ణు వన్న మహావాక్యం జీవితంలో కూడా మన్నించతగ్గ
సూత్రంగా ఆయన ప్రయోగ సాధన, నాదారాధన సాగించారు; తల
పాగా చుట్టుకుని, ఊపిరిసలపకుండా కండువాలు వేసుకొని హఠం
పెట్టి కూర్చుని రాగ రాగిణులతో సరాగాలాడారు. గిలిగింతలు పెట్టి
చిరునవ్వు లొలికించారు. కొత్త దారుల వెంట తీసుకువెళ్ళి కొత్త
దృశ్యాలు చూపించారు. వాది ప్రతివాది స్వరాలకు అపూర్వమైన
ఖటీలుఏర్పరచి కొత్తస్నేహాల పట్ల ఉత్సుకత కలిగించారు. నవవర
స్వరసరాలతో అలంకరించి అందాలకు అద్దాలు పట్టారు. "నూరేళ్ల
నాడు శుద్ధస్వరాలనే శాస్త్రీయమైనవనేవారు. ఇప్పుడు ఎన్నో కొత్తవి
వచ్చాయి. ఇంకెన్నో రావాలి" అని వాదించారు. సంగీతానికి జన్యం,
గమ్యం ఓంకారమే. అవి తప్పనంతవరకూ మధ్యలో ఎన్నోవిధాల
విహరించి ఓంకారం విశ్వరూపాన్ని బహుముఖాల దర్శించవచ్చునని
నిరూపించారు. ఇవన్నీ ఇన్ని వాక్యాలలో చెప్పేచొరవే ఉంటే శాస్త్రిగారు
ఇంకా చాలా గొప్పవాడనిపించుకునే వారేకాని, ఆయన వాదమంతా
వీణాతంత్రీ నాదమే.

ఔత్తరాహ దాక్షిణాత్య సంగీత రీతుల సమ్మేళనం సాధించే
శ్రవణానందాన్ని ఆయన వీణ మీద మీటి చాటారు. ఉత్తరాదిన
ప్రసిద్ధ సితార్ విద్వాంసుడు అబ్దుల్ హలీం జఫర్‌ఖాన్‌తో ఆయన
చేసిన సంయుక్తగానసభ సర్వుల ప్రశంసలనూ అందుకొని, ఆ
సమ్మేళన వాదానికి మరింత బలం చేకూర్చింది.

(ఎవరెస్టు విజయం సందర్భంగా) ఆదర్శ శిఖరారోహణం,
మధురస్మృతి, స్వరతరంగిణి, వేణుప్రణయం, (వేణువులతో
సింఫనీ), ఉదయ వసంతం (ఆమనికి ఈమని స్వాగతం) వంటి

సమ్మేళనాలను కూర్చిన మొదటి రచయిత ఆయనే. పాశ్చాత్య శిల్ప మైనా, దానికి భారతీయత ఉండనిపించే రీతిగా చేసిన ఈ కృతులలో అద్భుతమైన ప్రయోగాలున్నాయి. స్థాయి వారీగా ఎన్ని ఏర్పరచిన గాత్రాలలో స్వరసమ్మేళనం విశిష్టమైనది.

ధనంజయుని ధనుష్టంకారంలాగే ఈమని వారి **వీణాఝుంకారా నికి ఒక విశిష్టత ఉంది; ఆయన రాగప్రస్తారానికీ, స్వరకల్పన శిల్పా నికీ, ఆ వీణపోయే** మూర్ఛనలకూ ఒక ప్రత్యేకత ఉంది. వేద మంత్రాలను, ఆయన వీణ ఉచ్చరించినపుడు అది ఓంకార 'ఘోష వతి' అయి హృదయంలో మార్మోగుతుంది. బాధ, భక్తి, ప్రేమలపై ఆయన వ్యాఖ్యానించినపుడు, ఆయన మూర్ఛనలు ఉదాత్తమైన ఉప న్యాసాలై, హత్తుకొంటాయి. రాగలతాంతాలు,త్యాగరాజు స్వామితో ఆడిన సరాగాలలా, వారిద్దరికి పరస్పరం ఉన్న అనురాగాలలా కోమలంగా పరిమళ భరితంగా భాసిస్తాయి. ◆




**వాడెవడో అన్నట్టు 'తివిరి కుందేటి కొమ్మున తైలంబు తీయ వచ్చు'. వాడి దుంపతెగ! చిన్న డైలాగులో మూడు సార్లు 'త' పెట్టి రాశాడు!**

—విక్రమార్కుడి మార్కు సింహాసనం



బాపు కార్ట్యూనులు

గీతాలకు ముందు ఉపోద్ఘాతాలు
రాగాలలో భావోద్వేగాలు
స్వరాలతో నిత్య ఖేల
గొంతు కంచు ఘంట లీల
అసలు పేరు గానలోల
మారుపేరు ఘంటసాల

# శభాష్ రాముడు

పేరు, వాలకంచూసి, 'శభాష్‌రాముడు' అనేది డబ్బింగు సినిమా అనుకునేవారు పందెం కడితే చిత్తుగా ఓడిపోతారు. నిజానికిది డబ్బింగ్ చిత్రం కాకపోవడమేకాక, ఉత్సాహకరమైన, కాలక్షేపానికి యోగ్యమైన తెలుగు చిత్రం. మీకు అభిలాష ఉంటే, కాయకష్టంపట్ల గౌరవం గట్రా పెంచుకోడానికి సదుపాయం కలిగించే చిత్రం. ఇందులో రిక్షారాముడు నిజంగా రిక్షారాముడుకాడు. పూర్వాశ్రమంలో లాల్చీ పంచె కట్టుకుని తిరిగిన సోషల్ హీరో. గోదావరి వరదలవల్ల ఆస్తి పోగొట్టుకుని, పెళ్ళాం బిడ్డలతో హైదరాబాద్ చేరి,గౌరవప్రదమైన జీవనోపాధికి సైకిలు రిక్షా తోలడం అంత మంచి మార్గాంతరం లేదని ఆపని చేస్తాడు. అందులో మిగిల్చిన డబ్బుతోనే తమ్ముడికి చదువు... (రైటే మీరు ఊహించినట్లు ఫ్లాష్‌బాక్‌లో వాళ్ళమ్మకి ఒట్టేసి చెప్పాడు. తమ్ముణ్ణి చదివిస్తానని)కు, టెన్నిస్ ఆటకూ సదుపాయం చేస్తాడు.



భూపతి అనే దొంగలదొర, హాలీవుడ్ అపరాధ చిత్రాలు చూసి అవన్నీ కల్తీలేని నిజాలని పొరబడి లక్కీస్టార్ కార్నివల్ అని ఒకటి ఏర్పాటు చేస్తాడు. దాని చాటున ఉంటూ ఘరానా దొంగతనాలుచేస్తూ ఒక గుహలో భూగర్భమందిరాలూ మీట నొక్కితే ద్వారాలు తెరుచు కోడాలూ వగైరాలతో ఆధునిక బాలనాగమ్మలో మాయలఫకీరు సెట్టు కట్టుకుని ఉండగా, ఒకానొక రీలులో రిక్షారాముడు భూపతికి సవారీ కట్టి అతని ఆటపట్టు సంగతి తెలుసుకోవడం జరుగుతుంది. భూపతి ముఠావాళ్ళు అతన్ని గాయపరచి, తమ గుట్టు బయటపెడితే 'నీ పెళ్ళాం బిడ్డల్ని' ఖర్చు రాయిస్తాం అని భయపెట్టి తప్పుకుంటారు.

రిక్షారాముడి తమ్ముడు ఆ వూరి పోలీసు కమీషనర్‌గారి అమ్మాయితో టెన్నిస్ ఆడి, డూయెట్‌లు పాడి అన్నగారు ఆస్పత్రిలో ఉన్నపుడు రిక్షాలాగి డబ్బు గడించబోయి కమిషనర్‌గారి అనుగ్రహాన్ని, గౌరవాన్ని, వారి అమ్మాయి అనురాగాన్ని సంపాదించుకుంటాడు. ఈలోగా అతని పరీక్షకి డబ్బు కట్టడంకోసం, రిక్షారాముడు డాక్టరు మాట వినకుండా, రక్తం కారుతున్న కాలుతో, సైకిలు రిక్షా పందెంలో పాల్గొని రెండువందలు బహుమానం గడించి...

...చూడగా ఇదంతా పచ్చి సినిమా కథలా ఉందని మీరు అనుకుంటే, రైటేనని దర్శక నిర్మాతలు కూడా ఠంగున ఒప్పేసుకుంటారు. పూర్వాశ్రమంలో ఇది బడాభాయ్ అను హిందీ సినీకథ...

...తరవాత తమ్ముడు మోహన్, బియ్యే పరీక్ష యిచ్చి యూనివర్శిటీ మొత్తం మీద ఫస్టున వచ్చేస్తాడు. ఇటు ఈ సంఘటనా, మరోవంక తన కుమారుడు కుమార్ బుద్ధిగా దొంగల్ని పట్టుకొచ్చి ఖైదులో వెయ్యడానికిమారు, వాళ్ళతో కలిసి తిరుగుతున్న వైనం తెలియరావడం, ఇవన్నీ చూసి అసలే సబిన్‌స్పెక్టర్లు కూర్చునే ఇరుగ్గదిలో చికాకుగా ఉన్న కమీషనరుగారి ప్రాణం ఖంగారై 'మోహన్ బియ్యే'కు గబుక్కున ఇన్‌స్పెక్టరు ఉద్యోగం ఇచ్చేసి ఖూనీ దోపిడీ నేరాల కేసులన్నీ అతనికి ఒప్పగించేస్తాడు! ఎవర్నడిగిచ్చావు అని గవర్నమెంటువాళ్లు గట్టిగా అడిగితే,"నా బిడ్డనే ఇచ్చాను నీ ఉద్యోగం ఇవ్వడానికేం?"అని జవాబిచ్చేందుకువీలుగా కూతుర్ని అతనికిచ్చి పెళ్ళి చెయ్యడానికి ఏర్పాటుచేస్తాడు.

ఈలోగా దొంగల ముఠావాళ్ళకి పోర్షను వచ్చినప్పుడు వాళ్లు ఒక ఖూనీ నేరం ఒక చోరీ నేరంచేసి ఆ రెండూ రిక్షారాముడికి అంట గట్టే ఏర్పాటు చేసిపెడతారు. ఎదురుగా ఉన్న సాక్ష్యాన్ని బట్టి ఇన్ స్పెక్టర్ మోహన్, అన్నగారి చేతికి బేడీలు వేసి ఖైదుకు తీసుకువెళ్తాడు.

చూట్టానికి సినిమాకథే అయినా, ప్రతివాడికి కంటనీరు తిరిగేలా ఉద్వేగభరితంగా ఈ సన్నివేశాన్ని దర్శకుడు చిత్రించాడు. ఎన్. టి. రామారావు, రేమణమూర్తి, గుమ్మడి ఇందులో అతి సమర్థంగా నటించారు. ముఖ్యంగా రామారావు నటన విశేషించి మెచ్చుకోవలసి ఉంది.

తరువాత కథ మీరు ఊహించుకోగలిగినా వెండి తెర మీద కూడా ఒకసారి చూడదగిన విధంగా అందమైన సినీ మెలికలతో వచ్చింది. తమ్ముడు దొంగల ముఠా ఉచ్చులో చిక్కుకున్నాడని విని, అంతవరకు దొంగల ఉనికిపట్టు గుట్టుగా దాచిన రిక్షారాముడు, (పోలీసుల సహాయంతో) ఖైదు నుండి పారిపోయి సరాసరి గుహకు వెళ్తాడు. ఉత్సాహకరమైన యుద్ధం జరిగిన పిమ్మట దొంగలు దొరికి పోతారు. చివర్న సన్మానసభ, పెళ్లి, గ్రూపు ఫోటో ఉన్నాయి. ఖైదు నించి పారిపోయినా, దొంగల్ని పట్టుకున్నందుకుగాను రిక్షారాముడిని అభినందించిన కమీషనరుగారిని, సెన్సార్ వారినీ అభినందిస్తూ మనము ఇంటికి వెళ్తాం. దారిలో పదేపదే చెప్పుకునే అంశాలలో రిక్షారాముడుగా రామారావు ఉత్సాహభరితమైన నటన, అతనికి ప్రతిగా రమణమూర్తి పాత్ర నిర్వహణ, పాకెట్ మార్ గా రేలంగి పాత్ర చిత్రణ, అందులో ఆయనా దర్శకుడూ కలసి చేసిన సున్నితమైన నగిషీలూ మరీమరీ చెప్పుకుంటాం. తొణుకూ బెణుకూ లేకుండా నిండుగా స్థిమితంగా నటించిన ప్రమీల అను దేవికనుకూడా ప్రశంసిస్తాం. కని పించునకాస్సేపూ అతి సహజంగా కనిపించి అతను దొంగల్లోచేరుతాడో, పట్టుకుంటాడో తెలీకుండా నటించిన కాంతారావునుకూడా మెచ్చు కుంటాం. కె. వి. యస్ శర్మ, లోగడ తన వేషాలు బాగాచేశాడు కాబట్టి, మనకి అతనిమీద గౌరవం కాబట్టి ఇందులో అతన్ని గురించి అట్టే మాటాడుకోము.

దొంగలముఠాలో కీ. శే. ఆర్. నాగేశ్వరరావు, విగ్రహంతోనూ, నటనలో నిగ్రహంతోనూ కూడా రాణించాడు. నైట్ క్లబ్ ఏర్పాట్లు

డాన్సులూ లేకపోతే అతనిపాత్ర ఇంకాస్త బాగుండేదనిపించింది.

పాత్ర మాటలలో చేతలలో ప్రేక్షకులు దాచి పెట్టిన లోపాలు లేకుండాపోతే గుమ్మడి, పాత్రకు గల హోదాకు, తరహాకూ సముచితమైన పద్ధతిలో సాఫీగా హాయిగా, సౌలభ్యం తెలిసినవాడిలా నటించాడన్న సంగతి బాగా తెలిసేది.

ఈ కథలో ఆస్పత్రివాళ్ళుకూడా, పోలీసువాళ్లలాగే చాలా మంచి వాళ్ళు. సుశీల కంఠంఎరువు తెచ్చుకుంటే, 'రేయిమించెనోయి రాజా' అనే పాటను ఆస్పత్రిలో పాడనిస్తారుట. చాలామంచిపాట హాయిగాఉంది. ఇదీ, కలకల విరిసి జగాలే పులకించెనే అనేపాటా, (సంగీతం ఘంటసాల) రమణమూర్తి మాలినీలతో ఆ పాట చిత్రణా కూడా ఆహ్లాదకరంగా ఉన్నాయి. మరొకటి, ఒక అరవపాటకు అనుకరణ అయితే అయిందిగాని వినడానికి బాగుంది. కాలక్షేపానికి కావలసిన అన్ని హంగులూ ఉన్నచిత్రం.♦

1959



'బాబోయ్! పావలా ఇస్తే
రేలంగోడి కామిక్కు చేసి చూపిస్తా!
అర్ధరూపాయిస్తే ఇక్కణ్ణించి వెళ్ళిపోతా!



# అనగనగా మూడు పిక్చర్లు

అనగనగా ఒక ఫిలిం డిస్ట్రిబ్యూటరు. ఆయనకి ముచ్చటగా ముగ్గురు ప్రొడ్యూసర్లు. ఆ ముగ్గురూ దేశంమీద వేటకెళ్ళి డబ్బు తెచ్చి, అది దొరికిందన్న హడావుడిలో మూడు చిత్రాలు తీశారు. మూడో వాడికి కథ దొరక్క మరొకళ్ళ రెడిమేడ్ కథని చెక్కేసి హడావుడిగా దాని మీద తన చిత్రం చెక్కించాడు. డబ్బు వత్తిడివల్ల డిస్ట్రిబ్యూటరు గారు ఆ మూటినీ ఒకసారే వదిలారు. అందులో రెండు పండాయి. లాభాలు తెచ్చాయి. మూడోది మూడోనాటికే బిక్క మొహం వేసుకు చక్కా వచ్చింది.

డిస్ట్రిబ్యూటరు పన్నులు కట్టడానికి పద్దులు చూచుకున్నప్పుడు, రావలసిన లాభంలో నష్టం కనిపించింది.

"నష్టం నష్టం! నువ్వెందుకు కనిపించావే పాడు మొహం నువ్వూనూ" అన్నాడు డిస్ట్రిబ్యూటరు.

"మూడో పిక్చరు పండలేదు" అంది నష్టం.

"మూడో పిక్చరా! మూడో పిక్చరా! నువ్వెందుకు పండలేదే?" అన్నాడు డిస్ట్రిబ్యూటరు.

"....వారి పెద్ద పిచ్చరు అడ్డొచ్చిందిగా!" అంది మూడోపిచ్చరు.

"....వారి పెద్ద పిచ్చరూ!....వారి పెద్ద పిచ్చరూ! నువ్వెందుకు అడ్డొచ్చావే" అన్నాడు డిస్ట్రిబ్యూటరు.

"....వారు నన్ను తోలుకువచ్చారుగా మరీ!" అంది '....' వారి పెద్ద పిచ్చరు.

"....వారూ!....వారూ మా మూడో పిచ్చరు డబ్బు మేస్తూంటే మీ రెందుకు తోలుకొచ్చారూ" అన్నాడు డిస్ట్రిబ్యూటరు.

"మా ప్రొడ్యూసరు తొందర పెట్టారు" అన్నారు....వారు.

"ప్రొడ్యూసరూ ప్రొడ్యూసరూ ఎందుకు తొందరపెట్టావు?" అన్నాడు డిస్ట్రిబ్యూటరు.

మీ ప్రొడ్యూసరు పిల్లకాయ మా కథ కొట్టేసి తొడుక్కుని అచ్చుగా మా పేరులాటి పేరే పెట్టేసుకుని మా వేషంలో పరిగెట్టుకుని మా బీడులో డబ్బు మేసేస్తూ ఉంటే, తొందర పెట్టనా మరీ" అన్నాడు ప్రొడ్యూసరు.◆

---






## చార్లీ చాప్లిన్ ఉత్తమ కళాసృష్టి

# లైమ్ లైట్



కరుణాకరమైన ప్రపంచ చలన చిత్రం 'లైమ్ లైట్'ను కనీ విని ఆనందించే మహదవకాశం, ఏడు సంవత్సరాల తరువాత మద్రాసు పౌరులకు తొలిసారిగా గత వారం లభ్యమైంది.

రాజకీయపు రంగు హంగు టద్దాలలోంచి, కరుణాకరుడు చాప్లిన్‌ను 'అరుణా' కరుడుగా చూడబోయిన మెకార్థీలు అతడిని (అన్ అమెరికన్ కమిటీ) రాజకీయ సంబంధిగా బంధించబోయారు. ఈ విధంగా స్వదేశంలో రాజకీయ ప్రచారాహుగ్రస్తమైన చిత్రం 'లైమ్ లైట్'లోనే చాప్లిన్‌లో కళాకారుడు విశ్వరూపాన్ని ప్రదర్శించాడు. దేశదేశాలా విజయ యాత్ర చేసిన 'లైమ్ లైట్' సార్వజనీన సార్వకాలిక చిత్రంగా, కయిణ రసోద్దీపక కళాఖండంగా, స్నేహానికి భాష్యంగా జోహారు లందుకొంది. పూర్వం చాప్లిన్ చిత్రాలు విడుదల చేస్తూవచ్చిన కంపెనీ ద్వారా (దీనికి ఆయన ముఖ్య వ్యవస్థాపకుడు)

ఈ చిత్రం విడుదలచేసే సదుపాయం లేనందువల్ల ఇది మనదేశం రావడం ఆలస్యం అయింది. (ఇపుడు స్వానీ కార్పొరేషన్‌వారు, దక్షిణాదిన ఫ్లోరా ఫిలింస్‌వారు దీనిని ప్రదర్శిస్తున్నారు.) 'లైమ్ లైట్' తరువాత చాప్లిన్ తీసిన చిత్రం, 'ఏ కింగ్ ఇన్ న్యూయార్క్' ఈసారి త్వరగానే రాగలదని ఆశించవచ్చును.

'లైమ్ లైట్' సృష్టిలో చాప్లిన్ ప్రజ్ఞ పరాకాష్ఠను అందుకొంది. దీనికి కథ మాటలూ పాటలూ, సంగీతం మామూలు ప్రకారం ఆయనే వ్రాసుకున్నాడు. ఈసారి విశేషం 'బాలే' (నృత్య నాటికల) కల్పన దర్శకత్వం కూడా నిర్వహించడం. కథ, కథనం చాప్లిన్ చిత్రావళిని గుర్తుకు తెచ్చుకుంటే కొత్తగా కనిపిస్తాయి. పాత చిత్రాలలా ఇందులో పొట్ట చెక్కలయేట్టు నవ్వురాదు. స్లాప్‌స్టిక్ పుష్కలంగా లేదు. ఇందులో గోచరించే హాస్యం తరహా వేరు. ఇది కరుణరస 'హాస్యరాగ' రంజితమైన కథ. ఈ రెండింటికీ సరిహద్దు మీద ఠీవిగా నడుస్తుంది. ప్రపంచ ప్రసిద్ధుడైన చిన్న మనిషి 'చార్లీ', అతనిని కన్న తండ్రి చాప్లిన్‌లు కూడ బలుక్కుని, కష్టసుఖాలూ, సన్మానావమానాలూ, వెలుగునీడలూ చూచిన ఒక విదూషకుడి జీవితాన్ని-మథించి స్నేహ భావాన్ని తీసి పంచిపెట్టారు. ఆరిపోతున్న అతని జీవితంతో ఇంకో జీవితాన్ని వెలిగించి జీవనరాగాన్ని సర్వజన సమ్మోహనకరంగా ప్రస్తరించారు.

జీవితాన్ని పూర్తిగా, నిండుగా, ఎత్తుగా, ఉత్సాహంగా జీవించాలనీ, అందుకు వ్యక్తిలో ప్రగాఢమైన వాంఛ, ఆశాభావం, ఆత్మవిశ్వాసం ఉండాలనీ, జీవితంపట్ల అనురాగమను రాగప్రస్తారమే దానికి ఇతివృత్తమనీ చాప్లిన్ ఈ చిత్రంలో—నిస్పృహలో మునిగిన విదూషకుడిచేత—తెచ్చిపెట్టుకొన్న ఉత్సాహంతో చెప్పించి ప్రేక్షకులకు ఉత్తేజం కలిగించగలిగాడు. ఇది చెప్పడానికే ఆయన ఇందులో కొత్త పద్ధతి కూడా అవలంబించాడు.

మామూలుగా షేక్స్‌పియర్ నాటకానికి గుడ్డివాడు వెళ్ళినా అతను అంతా తెలుసుకుని ఆనందిస్తాడనీ చాప్లిన్, ఐసెన్‌స్టీన్‌ల చిత్రాలకు చెవిటివాడు వెళ్ళినా అంతా పూర్తిగా బోధపడుతుందనీ అంటారు. అందరూ శబ్దంతో చెప్పేదాన్ని నిశ్శబ్దంతో అంతకన్నా గొప్పగా బలంగా చెప్పగలగడం ఈ దృశ్య కావ్యకారుల ప్రత్యేకత. సినిమాలోకి

శబ్దం వచ్చినపుడు చాప్లిన్ కూడా భయపడ్డాడు-దుర్వినియోగం అయితే చలన చిత్ర కళకు ఇది అరిష్టం తెచ్చిపెడుతుందని.

'మొస్యూర్ వెర్డో'లో ఆయన సంభాషణలను వాడినా బహు పొదుపుగా వాడాడు. అప్పుడు కొంత నొచ్చుకున్న కొందరు అభిమానులు ఈసారి 'లైమ్ లైట్'లో ధారాళమైన ఉపన్యాసాలే వినబడడంతో చాప్లిన్ అంతటివాడు శబ్దం మీద ఇంతగా ఆధారపడడం తగదని భావించారు. అయితే ఒకసారి బాగా రాణించిన ఒక శిల్పాన్ని ఒక సంప్రదాయంగా, ఆచారంగా, వరవడిగా పరిగణించి, ప్రతిసారీ అదే అవధులలో తిరగాలన్న అభిప్రాయం సృజనాత్మకమైన ఏ కళకూ, రోజు రోజుకూ పెరిగే ఏ కళాకారుడికీ సరిపడనిది కాగా, ఈ చిత్రంలో చాప్లిన్ ఇంతగా మాటలాడడం అనేది ఇందులో కథ తత్వాన్నిబట్టి తప్పనిసరి అని ఈ చిత్రం చూచే ఏ ప్రేక్షకుడికైనా తోస్తుంది. పోతే ఈ సుదీర్ఘ సంభాషణలనే పరిహసించి పరిహరించిన పద్ధతి, వాటిమీద పడే ఉద్వేగపు నీడలమీద తెల్లటి యుక్తోక్తుల కాంతులు ప్రసరించి అదృశ్యం చేసిన శిల్పం, ఎవరికి ఏ దురభిప్రాయాలున్నా తొలగించివేస్తాయి. ఆయన తూచిచూచి మరీ అంటున్న ప్రతిమాటా మన మనసులో నాటుకొంటుంది...విలువగలమాటకీ, కేవలం వెలువగల మాటకీ తేడా కూడా తెలుస్తుంది

బేస్ వయొలిన్ క్రింద షడ్జమంలో అగుతున్నపుడు టాప్ వయొలిన్ పైపంచమంలో ఆరంభించి సాగిపోవడం—పిందె పుట్టడంతో పువ్వు వాడిపోయి రాలిపోవడం ఈ చిత్రంలో ముఖ్య సన్నివేశం.

నృత్య నాటికా మందిరాలలో హాస్యంచేసి పేరు తెచ్చుకున్న కాల్వెరో అనే విదూషకుడు ఉచ్ఛదశకు పెరిగి, ఎక్కడో తన వృత్తి మీద పట్టుతప్పి విరిగిపోతాడు. అతడు ఏమి చేసినా హాస్యం రాణించదు. ప్రేక్షకులకు క్రమంగా దూరమై వెనకబడి పోతాడు. యథాలాపంగా, ఎందుకో తెలియకుండా జీవిస్తూ ఉంటాడు. ఆ స్థితిలో అతనికి టెరిస్సా అనే అమ్మాయి జీవనరేఖ యాదృచ్ఛికంగా దగ్గరపడి సమానాంతరం అవుతుంది. తేడా; ఆమె ఆత్మహత్యకు పాల్పడుతుంది. సకాలంలో కాల్వెరో అడ్డుపడి ఆపుజేస్తాడు. "ఏమిటా హడావుడి?" అని మందలిస్తాడు. పోయే ప్రాణాన్ని ఆపగలిగానన్న ఉత్సా


'పబ్లిసిటీ లేకుండా పది సెంటర్లలో పదోవారం' అన్న డిజైనుకి ఆర్టిస్టునించి పదివేలు బిల్లొచ్చింది-
'మహిళ'
ఇది 'మా చిత్రం' అంటున్నారు మహిళాలోకం! నేడే
555


ఇవాళ్టినించీ ఇహ తిండీ తిప్పలూ వంటా వార్పూ ఎవళ్ళకి వాళ్ళు పడవండి నా మొదటి నవల పొద్దున్నే ఓ ప్రొడ్యూసరు కొన్నాడు

హంలో జీవితం ఎంత అద్భుతమైన వరమో, బతకాలన్న కోరిక, బాగా బతకాలన్న ఆశ ఎంత ముఖ్యమో ఆమెకు నూరిపోసి బోలెడు వేదాంతం మాట్లాడి ఆమెను పునరుజ్జీవింప చేస్తాడు. అతని హితబోధ వల్ల, ఉపచారం వల్ల టెరిస్సా కోలుకొని తిరిగి రంగస్థం మీదకు వెళ్తుంది. అచిరకాలంలోనే గొప్ప నర్తకిగా పేరూ, డబ్బూ కూడా గడిస్తుంది. ఆమెను బ్రతికించడానికి తను తెచ్చుకొన్న ఆవేశాన్ని, ఉత్సాహంగా అనువదించుకొని, "వెనకబడ్డ విదూషకుడు" కాల్వెరో కూడా తిరిగి పైకి రావడానికి ఒక ప్రయత్నం చేస్తాడుగాని, అతని 'పాతకాలపు హాస్యం' ప్రేక్షకులకు నచ్చదు. దెబ్బతిని అవమానంతో తిరిగివస్తాడు. టెరిస్సా వెంట ఉండడానికి అభిమానం అడ్డు వస్తుంది. ఆమె అతన్ని పెళ్లి చేసుకుంటానంటుంది. అందుకు అంగీకరించడు. ఆమెను వదలిపోయి ఎక్కడో పాటలు పాడి జీవనం సాగిస్తూ ఉంటాడు. చివరకు టెరిస్సా, అదృష్టం, మంచిరోజు, నాటకం ప్రొడ్యూసరూ అతన్ని వెతుక్కువచ్చి తిరిగి వేషం కట్టడానికి ప్రోత్సహించి అవకాశం ఇవ్వడం జరుగుతుంది. ఈసారి వెనకబడ్డవాడి పాత కాలపు హాస్యం-ఈతరం ప్రేక్షకులకు కొత్తగా హుషారుగా కనిపిస్తుంది. దానితోపాటు విదూషకుడు కొత్తగా తయారుచేసుకున్న హాస్య సన్నివేశం కూడా (ఇందులో ఒకపుడు ఉజ్జ్వలంగా వెలిగి వెనకపడిన హాస్య నటుడు బస్టర్‌కీటన్ పాల్గొన్నాడు) జనానికి పడుతుంది. హర్ష ధ్వానాలు మిన్నంటుతాయి. కాల్వెరో ఒక్కసారిగా గొప్పవాడు అవుతాడు. ఆ సమయంలోనే, చివరి అంకంలో ప్రమాదం జరిగి అతడు స్టేజిమీదనించి జారి, ఆర్కెస్ట్రాలో ఉన్న ఒక డ్రమ్ మీదపడి అందులో ఇరుక్కుపోతాడు. వెన్నెముక విరుగుతుంది. గుండెపోటు వస్తుంది. మృత్యుఘడియలు సమీపించాయని కాల్వెరో గ్రహిస్తాడు. ఆ డ్రమ్‌లో వుండగానే, తనను ఒకసారి స్టేజిమీదకు తీసుకువెళ్ళమంటాడు అక్కడివారిని. హర్షధ్వానాలు చేస్తున్న ప్రేక్షకులను చూసి తృప్తిపడి, నవ్వి, "ఇది ఇంకా ఇలా సాగిద్దామనే ఉంది...కాని, నేనిక్కడ చిక్కడిపోయాను" అని ప్రత్యక్షావస్థ మీద, నుండే, ఆసన్న మృత్యువును కూడా స్పృశిస్తూ గుండెలో నాటుకుపోయేలాటి ఈ మాటతో శ్లేష వేస్తాడు. (**You see I would like to continue but I am STUCK** అని.)

తరవాత అంతే అవుతుంది. టెరిస్సా నృత్యం చేస్తూ ఉండగా రంగస్థలం మీద వింగ్స్ చాటున శయనించి, తాను వెలిగించిన టెరిస్సా రంగస్థలం మీద మూర్తీభవించిన చైతన్యంలా నర్తిస్తూ ఉజ్జ్వలంగా ప్రకాశిస్తూ ఉండగా చూస్తూ, తను అరిపోతాడు...జీవన స్రవంతి యథాప్రకారం కొనసాగుతునే ఉంటుంది. "ఇంక అట్టే టైము లేదు. వెళ్ళిపోయేలాగా సత్యాన్ని దర్శించాలి" అనుకున్న కాల్వేరో యాత్ర ఆగిపోయి, అక్కడనించి టెరిస్సా జీవనయాత్ర కొనసాగుతుంది.

ఈ జీవిత నాటకంలో చాప్లిన్ నిర్వహించినది ఒక్క కాల్వేరోవే కాదు; మిగతా నటీనటులు ధరించిన భూమికలన్నీను. కాల్వేరో కేవలం విదూషకుడే కాదు. హాస్య రసజ్ఞుడికి ఉండగల పరిపక్వత గల నిండు మనిషి. జయం అపజయం కూడా అనుభవించినవాడు. నవ్వడం నవ్వించడం, నవ్వులపాలు కావడంతోపాటు నవ్వుకోవడం కూడా నేర్చుకున్నవాడు. దర్శకుడు నటుడు అయిన చాప్లిన్ ఈ పాత్రలోని ఛాయా భేదాలన్నిటినీ దేనికదిగా, ఎక్కడికక్కడగా మాటల తీరులో భ్రుకుటి ముడవడంలో, నవ్వడంలో, నవ్వకపోవడంలో చిత్రించాడు. మాటలోనూ మనసులోనూ ఉండే అంతస్తులను చూపించాడు. మనిషిలో ఆశ అంకురించడాన్ని చూపించాడు. నిస్పృహ కమ్ముకురావడం చిత్రించాడు. వెనకబడిన హాస్యగాడి హాస్యాస్పదమైన హాస్యాన్ని అత్యంత హాస్యరసభరితంగా చూపించి ఏకకాలంలో రెండు లక్ష్యాలను సాధించాడు. 'ఫెర్ఫార్మింగ్ ఫ్లీ' పేరిట తీసిన దృశ్యాలు, వాటిలో చాప్లిన్ నటన చూసినవారు ఎన్నటికీ మరువరు. మేకప్ తీసివేసి రంగస్థలం మీదనుంచి జీవిత రంగస్థలం మీదకు వచ్చిన చాప్లిన్‌ను అంతకన్న మరువలేరు. అక్కడ లైమ్ లైట్‌లో ఉంటే ఇక్కడ సబ్లైమ్ లైట్‌లో కనిపిస్తాడు. ఆ చాప్లిన్‌కు ఈ చాప్లిన్‌కు దూరపు చుట్టరికం కూడా కనిపించదు. క్షణంలో సగంలో చాప్లిన్ హాస్యగాడిని వేదాంతిలా చూపిస్తాడు, అద్దె బెడద లేకుండా లావుపాటి ఇంటావిడతో మోటు సరసాలు ఆడిన పోకిరీ పెద్ద మనిషిని అరక్షణం తరవాత గౌరవభాజనుడిగా చూపిస్తాడు. నిత్యజీవన వ్యాసంగరంలో ఆ వెకిలిచేష్ట వెనకాల ఉన్న విషాద స్థితిని స్ఫురింపచేస్తాడు. క్షణంలో పసివాడిని పరిణతుడిస్థాయి కెత్తి దింపి

వేస్తాడు. ఒక ఫోటోజెనిక్ కొటేషన్ లాటి మాటతో మనని అట్టే నిల బెట్టి, దానిని క్షణార్థంలో అపహసించి నవ్వించి వేస్తాడు. నవ్వు అయే సరికి అతడు గమ్మత్తుగా అన్నమాటలో లోతు మనకి స్ఫురింప చేస్తాడు. ఆ వేళకి అతని ముఖ భంగిమ, విగ్రహం, చుట్టూరా వెలుగు నీడలూ, దూరంగా సంగీత వ్యాఖ్య అన్నీ ఆ భావానికి గాంభీర్యాన్నీ, ఠీవినీ సమకూర్చుతాయి.

ఈ చిత్రంలో దర్శకుడుగా చాప్లిన్ పనివాడితనం కూడా చిరకాలం నిలిచి ప్రశంసలు అందుకోగలది టెరిసా చిన్ననాటి ప్రేమ కథ చిత్రణ ఒకటి. ప్రేమకథ లన్నిటి రామణీయకాన్నీ, మాధుర్యాన్నీ సమీకరించి రూపొందించి నట్లుంది. అయా ఘట్టాలలో ఫ్రేం కాంపోజిషన్‌లు-, ఫ్రేములు లేకుండా ప్రేక్షక హృదయాలలో చిరకాలం నిలిచే చిత్రాలు. అనురాగోదయాన్ని అంత అందంగా చూపి అపినవి అరుదు. అలాగే చివరి సన్నివేశాలలో కాల్వెరో మరణశయ్యా మీద ఉండగా టెరిస్సా అతని పక్కన కూర్చొని దుఃఖించే దృశ్యం-ఓల్డ్ మాస్టర్స్ వేసిన త్రివర్ణచిత్రాలను వివర్ణం చేసేదిగా ఉంది. ఆ గదిలో నాటకాల సామగ్రి, పాతకాలపు సరంజామా అన్నీ ఆ సన్నివేశానికి తగినట్లు అమరాయి. చిత్రం పొడుగునా, కథా వస్తువును ఉద్ఘోషించే నేపథ్య సంగీతం ఆ ఘట్టాలలో వినవస్తూన్నపుడు ఉత్తమ కళాకారుడు, కరుణాకరుడు చార్లీ చాప్లిన్‌కు జోహార్లు చేస్తాము.♦

1959

---

పులిని చూస్తే పులీ ఎన్నడు బెదరదు
మేకవస్తే మేక ఎన్నడు అదరదు
మాయ రోగమదేమొ గాని
మనిషి మనిషికి కుదరదు
ఎందుకో తెలుసా తల్లీ!
ఉన్నదీ పోతుందన్న బెదురుతో
అనుకున్నదీ రాదేమోనన్న అదురుతో...

(సినారె) —అందాలరాముడు


బాపు కార్టూనులు
మధు మధురమైన శ్రీనివాయిస్ తేటపాట
మృదు మధురమైన స్వరాలు హాయిగా
తిరిగే నీటు బాట
అయినా కన్నడం కన్నా మళయాళం కన్నా
తమిళం కన్నా
తెలుగులో ఎక్కువ పాడక పోవడానికి
కారణం ఎన్నా?



పెద్దరికం పెద్దరికం



ధైర్యానికి పేదరికం

# సారథీ వారి పెద్దరికాలు

సవాలక్ష సందేశాలు అందిచ్చే - ఏర్పాటు పెట్టుకోకుండా ఒకే ఒక్క మంచి ముక్కను చక్కగా, మనసుకు హత్తుకునేలా చెప్పడం మంచి పద్ధతి; చెప్పగలడం ప్రతిభ.

"పెద్దరికాలు" (సారథి ఫిలింస్) చిత్రం దర్శకుడు తాపీ చాణక్య, నిర్మాత రామకృష్ణ ప్రసాద్, అటువంటి ప్రయత్నమేచేసి మంచి ఫలితం సాధించారు. అందుకు వారభినందనీయులు.

పెద్దరికం పేరిట తెచ్చుకున్న అహంకారం కొద్దీ, తోటి మనుషులను, వాళ్ళ మనసులను హింసపెట్టిన ఒక భద్రయ్య మీద ఆయన భార్యా బిడ్డలే తిరుగుబాటు చేయడం ఇందులో ఇతివృత్తం. దీంతో కలిసి దీన్ని చిక్కులుపెట్టే 'ఉపవృత్తాలు' ఏమీ లేవు. ఎటొచ్చీ ఈ చిన్న కథను పదహారువేల అడుగుల పొడుగు సాగదియ్యడానికి బాక్సాఫీస్ పగ్గాలుకట్టి లాగవలసి వచ్చింది. తత్ఫలితంగా కథ తెగిన చోట్ల, అతుకులూ, అవి లేనిచోట్ల గతుకులూ ఏర్పడ్డాయి. "ఇప్పు డెందుకిది?" అనిపించే తరహాలో పాటలు వినబడ్డాయి; నృత్యాలు

కనబడ్డాయి. హృదయాలను కదిలించే సన్నివేశాలు కొన్ని మితి దాటి పోయి ప్రేక్షకుడిలో సానుభూతి బదులు ఉదాసీన భావాన్ని కలిగించే స్థితికి వచ్చాయి. కళని డబ్బులోకి తర్జుమా చేసినపుడు, గుర్తుంచుకో తగు సరిహద్దు రేఖలు ఈ సన్నివేశాలలో లీలగా గోచరిస్తాయి.

మొత్తం మీద, చెప్పతగ్గ ఒక మంచి కథను చెప్పుకోతగినంత గొప్పగా దర్శకుడూ నటీనటులూ ఇందులో చిత్రించారు.

ఈ చిత్రం ఏప్రిల్ 25 న ఆంధ్రలో విడుదల అయింది. పత్రిక వారికి 21 వ తేదీన భరణీస్టుడియో ప్రివ్యూ థియేటరులో చూపించారు.

డబ్బంటే చాలా ఇష్టం, బోలెడు పట్టుదలా ఉన్న భద్రయ్య ఒక పెద్ద భూఖామందు. అతని కొడుకు సత్యం కథాంతం వరకూ వఠిమందుడు. నిజానికి కష్టజీవులు, స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు మొదలైన విషయాల మీద అతనికి మంచి ఊహలు చాలా ఉన్నాయి. వాటి గురించి పొలంలో ఎలుగెత్తి పాడుతూ ఉంటాడు. కాని తండ్రి ఎదట మటుకు గళం పలకదు. తలుపు చాటున నిలబడి వాళ్ళ నాన్న మీద కోప్పడుతూ ఉంటాడు. సత్యానికి ఓ కొడుకు. రెండేళ్ల బిడ్డడు. అతని అభిప్రాయా లేమిటో తెలియవు గాని, తోచినప్పుడల్లా ఏడుస్తూ ఉంటాడు. సత్యం మావగారు శేషయ్యకి దారిద్ర్యం, దాన్ని మించిన అప్పులూ ఉన్నాయి. అప్పుచేసి పప్పుకూడు తినే తరహా మనిషి. పండక్కి కూతుర్ని, మనవణ్ణి తీసుకెళ్ళి మురిసి పోతున్న ముహూర్తాన "అప్పులాడు" వచ్చి "నానా మాటలూ" అంటాడు. (నీ కూతురు పెళ్ళికోసం కాలం నాడు నేను నాలుగు వేలిచ్చాను. ఇప్పుడు నా కూతురు పెళ్ళికి డబ్బవసరంగా కావాలి.) 'రభస' చేస్తాడు. ("ఇలా చాలా వాయిదాలయ్యాయి. కబుర్లు చెప్పి లాభం లేదు. నా అవసరం గడవకపోతే కోర్టు కెక్కుతాను") చివరకి తగాదా శ్రుతిమించడంతో, కూతురు అది భరించలేకపోతుంది. అప్పుడు—

తోరణం తెగినద్వారంలా ఆమె ముఖం శోభను కోల్పోతుంది. 'మూకుట్లో పిండి వంటలా' హృదయం వేగిపోతుంది. 'కత్తిపీట మీద కూరగాయలా' కడుపు తరుక్కుపోతుంది. 'దీపావళి బాణా

సంచాలా' వెలిగిన ఆనందం అంతట్లోనే ఆరిపోతుంది...

అంతకుముందే క్రూర విధిరూపంలో గుమ్మడి వెంకటేశ్వరరావు వచ్చి ఆమె వంక చూచినందుకు పర్యవసానాలన్నీ ఇలా కనబడ తాయి. అక్కడితో ఆమెవంటి మన్న నగలన్నీ (అత్తవారు పెట్టినవి) వలిచి తండ్రి కిస్తుంది. గత్యంతరం లేక శేషయ్య వాటిని తాకట్టు పెట్టి అప్పటికి గట్టెక్కుతాడు. అయితే మర్నాడే భద్రయ్య ఇంటి నుండి కబురొస్తుంది. ఆయన కూతురుకు పెళ్ళి నిశ్చయించారు కాబట్టి తక్షణమే కోడల్ని పంపాల్సిందని. కోడలు నగలు లేకుండా వెళ్ళిన ఫలితంగా కొడుకు లేకుండా పుట్టింటికి తిరిగి వస్తుంది. భద్రయ్య అంతటి దుర్మార్గుడు. నగలు తెస్తే తప్ప గడప తొక్కద్దని శాసించి, మనవణ్ణి తన దగ్గరే ఉంచుకుని కోడల్ని వెళ్ళగొడతాడు. ఈ ఘట్టంలో, మందుడైన కుమారుడు ఉంటే ఏం చేసేవాడో మనం సుమారుగా ఊహించుకోవచ్చు. కేవలం డబ్బు కోసం అని, భార్యా బిడ్డల్ని విడదీసి భార్యని కాలితో తన్నిన దుర్మార్గుడు తండ్రే అయినా ఏ కుమారుడూ సహించడు. ఎదిరించి పోట్లాడకపోయినా, తన పెళ్లాం బిడ్డల్ని తీసుకుని ఇల్లు విడిచిపోతాడు. అక్కడికి కథన్నా అయి పోవాలి, లేదా నిరుద్యోగ సమస్యతో కొత్త వృత్తమన్నా ప్రారంభం కావాలి. చెబుతున్న కథకి ఇది పొసగదని; కథకులు, దర్శకులు ఆ కుమారుడికి ఈ ఘట్టంలో గైరు హాజరు వేయించారు. బహుశా ఆ సమయంలో అతగాడు పొలానికెళ్ళి స్వేచ్ఛా స్వాతంత్ర్యాల గురించి బృందగానం చేస్తూ ఉండవచ్చు. ఒక వేళ అలాగే అయినా, తిరుగు టపాలో పుట్టింటికెళ్తున్న కోడలు, పోతూపోతూ పొలంవేపు వెళ్ళి భర్తకి జరిగిన కథ చెప్పి మరీ వెళ్ళొచ్చు.

అలాంటి ఏర్పాట్లేమీ లేక ఆమె పుట్టింటికీ, కథ ముందుకీ భారంగా సాగిపోవడం సంభవించింది.

ఆ తరవాత, భద్రయ్య కుమార్తె, కాపరానికెళ్ళి మొగుడితో కాట్లాడి ఇంటికి రావడం, ఆమె పశ్చాత్తాపం చెందిన వేళకు, భద్రయ్య కుమారుడికి జ్ఞానోదయమై, తెగించి, తండ్రి నెదిరించి, భార్యను తెచ్చుకోడానికి బయలుదేరి వెళ్ళడం, ఈ లోపల నరహరి అనే మరొక దుర్మార్గుడు కథానాయకిని మోసగించి, బలాత్కరించ బోవడం జరుగుతాయి. సత్యం తన భార్య శీలాన్ని శంకిస్తాడు.

(స్వేచ్ఛగా ఆలోచించి మాట్లాడడానికి అతని కదే తొలిసారి) చివరికి కొండల్లె వచ్చిన కష్టాలు మంచల్లె కరిగిపోతాయి. ఈ లోగా ప్రేక్షకుల హృదయాలూ కరిగిపోతాయి. ఈ చలన చిత్రకారులు చెప్పదలచిన విషయం మనసుకి బాగా హత్తుకుంటుంది.

కథలో లోపాలు ఉన్నా, చిత్రణ సుదీర్ఘంగా ఉన్నా ఈ ఫలితం లభించడానికి నటీనటుల కృషి చాలవరకు తోడ్పడింది. భద్రయ్యగా డా॥ గోవిందరాజు సుబ్బారావు, ఆయన భార్యగా హేమలత, నాయకీ నాయకులుగా అంజలిదేవి – జగ్గయ్య; దుర్మార్గుడుగా నరహరి, 'బంగారు తండ్రిగా' రేలంగి, చేరుమాళ్లు తడిపించగల శేషయ్యగా పెరుమాళ్లు, సమర్థంగా నటించారు. డా॥ సుబ్బారావు నటన ఈ చిత్రానికి అక్షరాలా జీవం.

మొత్తం మీద అందరూ అతి సమర్థంగా నటించినా, కొన్ని సందర్భాలలో నటన అనే మాటకు బదులు అభినయం అన్న పదం స్ఫురిస్తుంది. పెరుమాళ్లు దైన్యాన్నీ శోకాన్నీ గొప్పగా ఒప్పించబోవ డంలో మితి సంగతి విస్మరించాడు. అలా మితి దాటకుండా దాదాపు ఆద్యంతం అతి సహజంగా నటించినవారు అంజలీ, గుమ్మడి వెంక టేశ్వరరావు. ఈ కథలో నాయకుడి వ్యక్తిత్వంలాగే, ఆపాత్ర రూప కల్పన కూడా నిర్బలంగా ఉంది ఉన్న అవధిలో జగ్గయ్య తన లోపం లేకుండా నటించి ఆ పాత్రను నడిపాడు. అప్పులవాడుగా ఆర్. వి. కృష్ణమూర్తి పాత్ర చిన్నదే అయినా చక్కగా ఒప్పించాడు. భద్రయ్య భార్యగా హేమలత, కుమార్తెగా గిరిజ యథోచితంగా నటించారు.

ఈ చిత్రానికి కథను నార్ల చిరంజీవి, మాటలు తాపీ. ధర్మా రావు, పాటలు కొసరాజూ వ్రాశారు. సంగీత దర్శకుడు వేణు. నృత్యాలు వి. జె. శర్మ, ఛాయాగ్రహకుడు కమల్ ఘోష్.

ఇందులో పాటలూ నృత్యాలూ కథకు అతకలేదు. బరువైన ఘట్టాల మధ్య విరామం కోసం ఏర్పాటు చేసిన వినోద కార్యక్రమాలు అనిపించాయి. రాగిణి చేసిన నృత్యం, దానికి ఆలంబనంగా చర ణానికో చెడ్డ మనిషిని కోప్పడే ఆ పాటా కూడా 'రోజులు మారలే'దని పించే ఫక్కీలోనే ఉన్నాయి.

పాటలలో ఆర్. బాలసరస్వతి ముందర లాలిగా, తరవాత జాలిగా పాడిన జోలపాట చాల బావుంది. ఈ చిత్రానికి ఆ పాట భూషణప్రాయం అనవచ్చు.

'పౌరాణికకాలం' వచ్చినా, జానపదజాలం చుట్టుముట్టినా సాంఘిక చిత్రాలే నిర్మించే సారథీవారు ఇలాటి ప్రయోజనకరమైన చిత్రాలను నిర్మించడంలో ఇంతకన్న కట్టుదిట్టమైన పద్ధతులు అనుసరించి, ప్రయోజనాలు సాధించ పూనుకోవడం వాంఛనీయం.♦

1957

---

**తలత్ మహమ్మద్ గొంతులా**
**గజగజ వణికి పోయాడు.**

—విక్రమార్కుడి మార్కు సింహాసనం

---

చిన్నదొర (కృష్ణంరాజు): కన్నప్పా! కాకేమంటుంది?

కన్నప్ప: (అల్లు రామలింగయ్య): కావ్–కావ్.

చి: పిల్లి?

క: మ్యావ్–మ్యావ్.

చి: కుక్క?

క: బౌ-బౌ.

చి: గాడిద?

క: బ్యా-బ్యా—(దీనంగా) చిన్న దొరా! నాకూ ఈ కూతలకీ కనెక్షనేవిటయ్యా?

చి: ఆ జంతువులకి ఒకటే కూతొచ్చు- దేనికూత దానిదే. నువ్వు అడ్డమైన కూతలూ కుయ్యగలవు—అదీ కనెక్షను.

—మనవూరి పాండవులు


బాపు కాప్షనులు
'నిండైన' విగ్రహం
నటనలో నిగ్రహం
అభినేత్రి సావిత్రి
రాజ్ఞి – సినీ ధాత్రి



# గిరీశం లెక్చర్లు

డామిట్! కథడ్డం తిరిగిందివాయ్ వెంకటేశం. రాత్రి మీ ఫాదరింటి కొచ్చే సరికి రెండు ఝావుఁలైవుంటుంది. నువు మాంచి గాఢనిద్రలోవున్నావు. ఇవాళ మంచిరోజుగదా యలాగయినా మన బైస్కోపు సంగతి తేల్చేద్దాముఁని, ఆయనతో ఇంకా ఫోంచెయ్యలేదూ తమకోసఁవే కూర్చున్నానూ అవట్టాన్జెప్పి, రెండో విడత ఆవకాయా పొడిమెతుకులూ మింగడానికి వడిగట్టాను. ఆయన బంతిన కూచుంటే, నేచ్చుక్క గట్టిగా విదపడానిగ్గాని, పెరుగుజిళ్ళ వెయ్యడానిగ్గాని, అత్తగారికి సొతంత్రం లేదుగదా. ఇహ నా దురవస్థ చెప్పేదేవుంది. మీనాన్న కోపంలా, మీ అక్క హృదయంలా, 'కావాలనుకున్న' ప్రధాని మనసులా, ధరలలా, గిట్టని వాళ్ళమధ్య పచ్చగడ్డిలా ఆజ్జెంచాల్ని ఆవకాయ దెబ్బకి నోరు భగ్గుమంది. అలాగే అసురుసురంటూ సబ్జెట్టు కదలేసి ఇలా బైస్కోపు తియ్యడానికి పదిహేనొందలు చాలూ మిగతా నాలుగు లక్షలూ డిస్ట్రిబ్యూటర్ దాఖలు చేసుకుంటాడూ - ఏతావాతా మనకేవిటయ్యా ఎక్స్ట్రా ప్రాఫిటూ అనగా-మన వెంకటేశానికి తంగున హీరో వేషం వచ్చేస్తుందీ అన్నాను. ఏదీ ఏదీ అబ్బిగాడికా వాడి బొంద అన్నాడాయన-యంతమాటా. కన్న తండ్రులు గాబట్టి తమఁరి దృష్టికి అబ్బిగాడేకావచ్చు కాని అస్మదాదులకూ, ముజ్జగాలకూ వాడు ఫ్యూచర్ హీరో-రాబర్టెయిలరూ, చార్లెసులాటనూ, గ్రీరుగార్సనూను. వాడు రేపు లక్షలార్జిస్తాడూ అంటూ ధోరణి ఫోర్తుగీరుకి ఎక్కించేసరికి- విఛీ-వంటింటిలోనూ తిండిదగ్గిరా కూడా ఈ పాడు ఇంగ్లీషు కూతలేనా

అంటూ ఛర్రుమన్నాడు. నేను తగ్గి మళ్లా 'పదిహేనువందల' పల్లవి కొచ్చాను. ఈ శషభిషలేం కుదరవ్వూ. మా యింటావంటా లేవీ బయ స్కోపులు, అబ్బిగాడు లక్ష లార్జించినా మానా- నా దగ్గిర మాత్రం ఇంత గరళమ్మింగడానిక్కూడా ఏగాని డబ్బులేదూ అన్నాడు. అంతట పాపం...మీ సిస్టర్—దట్ పూర్ బ్యూటిఫుల్- యంగ్ విడో బుచ్చమ్మ చల్లగిన్నె తెచ్చుకొడపెడుతూ,పోనీనన్నమ్మిన పఘ్ఘెనివిండి వందల్లోంచీ ఇవ్వరాదా! అందోయ్, అంతే. మీ పాదరు వీరభద్రుడై పోయి చల్ల తప్పేళానమాంతం ఆమె నెత్తిన బోర్లించి లేచ్చుకొక్క పోయాడు. దెర్ గోస్ అవర్ సినీ ప్రాజెక్ట్ అనుకుని విస్తట్లోది కానిచ్చి చెయి గడుక్కున్నాన్నేను. తెల్లవార్లూ నిద్దర్లేదనుకో. సరే రాబర్టు బ్రూసంతవాడు ఏడుసార్లు సాలెగూడు కట్టాడూ. మనవెంతా అనుకుని. నాకు మాడెస్టీ మహాలావులే- ఉదయవేఁ మరో ఎస్సాల్ట్‌కి సిద్ధపడ్డాను. శాస్త్రకారుడేవన్నాడూ ఇట్నించి కాపోతే, అట్నించి నరుక్కురా అన్నాడు.

అందుకని సినిమా వదిలేసి నాటకాలకని చెప్పొతస్సావేస్తే - దాన్నిగదరగ ఫిఫ్టీన్‌డేస్ సిగార్స్‌కి జరుగుబాటు సందర్భపడదా అను కుని, పొద్దుటే మీ ఫాదరరుగుమీద కూచుని దంతధావనం చేస్తూ వుండగా - 'కావ్యేషు నాటకం రమ్యమ్' అన్నాను జనాంతికంగా... పరగడుపునే సంస్కృతమ్ముక్క కక్కేసరికి ముసలాడు బుర్ర తంగున తిప్పి, మీకు దేవ భాషలో కూడా ప్రవేశం వుందా యేవిషీ అన్నాడు. నేను పకాలున నవ్వి - ప్రవేశవేవిఁటి స్వామీ భాస, భవ భూతి కాళిదాసాదుల నాటకాలు యావత్తూన్ను పఘ్ఘెనివిదో యేటికే భట్టీయం వేసినవాణ్ణి. అంతటితో ఆక్కుండా ఆ సకలాన్నీ ఆంగ్లభాష లోకి డబల్‌యూ షేక్సిపియిర్ అను కలం పేరుతో తర్జుమాయించి, అచ్చొత్తించాను - కావలిస్తే చూసుకోండి అంటూ అరుగుమీద సంసిద్ధ ముగా వుంచుకున్నట్టి బైండు బుక్కులు ముందుకు నెట్టేశాను. ముస లాడు డంగయి పోయాడంటే నమ్ము. ఇదే ఛాన్సని వుంజుకుని, ప్రస్తుతం తెలుగులో సాంఘిక నాటక రాజమొకటి రచించి, పరిషత్తు క్కట్టిస్తానని, అందులో అబ్బిగాడిచేత వేషం కట్టిస్తినా అటు ఆ యొక్క స్కిృప్టుని, అబ్బిగాణ్ణి కూడా సినిమా వారు ఎగరేసుకు పోతారనీ, ఆశ చూపించాను.

లెక్చరంతా విన్నాక ఇంతకీ ఏవిషంఛారు అన్నాడు అను మానంతో. మరేం లేదు ముందు నాటకం వ్రాయడానికో అర్ధ రీము పుల్‌స్కేపు తావులూ, ఆ పైన రిహార్సళ్ళకి సాదరు ఖర్చులూ అంటూ ఆరంభించేసరికి - శివాలెత్తినట్టు లేచిపోయాడోయ్.

నువ్వేదో బుద్ధిమంతుడివనుకున్నాను. ఇదా నువ్వు చేసే పని' నాటకం రాయాలనుకుంటే లక్షణంగా ఓ తాడిచెట్టు ఆకు దింపిస్తాను. మా తాతగారి ఘంటం వుంది రాసుకో. కుర్రాడిచేత భట్టీయం వేయించు. అంతే తప్ప కోర్టర్జీలకు వాడుకునే తెల్లకాయితాల్నిలా తగలేస్తావా అంటూ తగులుకున్నాడోయ్. మై గాడ్. హౌ బార్బేరియస్. తాటాకులమీద రాయాల్ట. కళాపోష ణిలా అఘోరిస్తూ వుంటే - ఇక నాటకాలూ సినీమాలూ ఎలా బాగుపడేడుస్తాయని - మాటాడవేం?

...అహ వద్దొద్దు...నువ్వలా సైలెంట్‌గానే కూర్చో...వదినగారు బావిలో నీళ్లు తోడుతున్నారు. మార్నింగ్ బ్యూటీని వక పక్క స్టడీ చేస్తూ నీకు నాటకశాస్త్ర రహస్యం వుపదేశిస్తాను...అహా...ఓహో... చూశావుటోయ్. మీ సిస్టర్ అలా బావిలో చేదవేసి—లోకంలో నాకు చీకూ చింతా లేదూ అన్న భంగిమలో నీరు తోడుతూందే గాని- ఆవిడలోని అగ్నిపర్వతాలను, క్షణం క్రితం భావిలో పడిన ఆ యొక్క మంచి ముత్యమంటి కన్నీటి బొట్టు వెల్లడిచేసిందోయ్. అహా...దట్ మై డియర్ వెంకటేశం-ఈజ్ డ్రామా...చూసేందుకు కళ్లుంటే సృష్టంతా డ్రామావే కదుటోయ్. అడివిగాచిన వెన్నెలనీ, ఎడారిలో పన్నీటినీ ఆ కన్నీరు స్ఫురింపచేస్తోంది...ఆవిడ భావిలోంచి తోడేది నీరుటోయ్! యంత మాత్రం కాదు—అది భూమాత కన్నీరు. లోకంలోని యంగ్ విడోస్ గురించి—ముఖ్యంగా శాపవశాత్తు ఈ అగ్గురారం ఛాదస్తుడింట పడిన దేవకన్యవంటి బుచ్చమ్మ గురించి భూదేవి దుఃఖించి రాల్చిన కన్నీళ్ళోయ్ ఆ భావిలోవి. అదుగో ఆ చెట్టుమీద' పిట్టలజంట ఏమ్మాటాడుకుంటోంది తెలుసా...ఓ పిల్లా - నీకేం భయంలేదు. అదిగో ఆ భావి దగ్గర చిన్నది కూడా నీలాటి యంగ్ విడోనే...నేడో రేపో... చదువు సంస్కారం గల ఒక నవ యువకుడితో వెళ్ళిపోతోందీ, నువ్వు కూడా నాతో వచ్చెయ్యి అంటోంది.

ఆ? ఏవిటన్నారూ వదినా...పిట్టల్లో కూడా వితంతువులుంటాయ్యా అంటున్నారా? యంతమాట. ఆదికవి వాల్మీకి వ్రాసిన

ఆదికావ్యం రామాయణంలో కథారాంభం ఇదే కదండీ. బోయవాడు క్రౌంచ పక్షుల మిథునంలో మొగదాన్ని కొట్టి చంపగానే ఆయన మానిషాద! ఓరి కిరాతకుడా ఎంత పనిచేశావు-ఇప్పుడు వితంతువయిన ఆ యంగ్ విడో గతేవిటి అంటూ శోకించి శ్లోకించాడు. మన మొదటి గ్రంథమే. విడో రిమారియేజ్‌తో స్టార్టయింది. ఆయనంతగా ఘోషించినా ఆ పక్షి మీలాగే చాదస్తం కొద్దీ రెండో పెళ్ళికి ఒప్పుకోలేదు. అందుకే తరవాతి కథలో ఆయన ఆ కథ గురించి ఎక్కడా రాయలేదు. అందువల్ల—

...ఏవిటీ, ఇలాటి విషయాలు వినడం మీకు సయించదా... చూశావా వెంకటేశం...దిస్ అగెయిన్ ఈజ్ డ్రామా - నోరు నవ్వితే నొసలు వెక్కిరించిందన్నట్టూ- ఆవిడ అనేది వేరు; అనుకునేది వేరు. షేక్స్పియర్ ఊరికే అన్నాడటోయ్—**ఆల్ ది వాల్డ్ ఇజ స్టేజనీ**—ప్రపంచమే ఒక నాటక రంగం. ఆవిడ వెళ్లిపోయింది కాబట్టి ఇక నీకు అనర్గళంగా నాటకాల మీద లెక్చరిస్తాను. నోటుబుక్కు తీసుకో. నాటకాలు లక్ష వెరైటీస్. ఒకటి సంస్కృత నాటకాలు...మనం గొప్ప చెప్పుకునేందుకే తప్ప చదువు కుందుకని రాసినవి కావు. ఒక ముక్క కూడా అర్థం కాదు. రెండు సీమ నాటకాలు అనగా ఇంగ్లీషు, ఫ్రెంచి, ఇటాలియన్, జర్మన్ వగైరా దొరల భాషవి. ఇవి చదివి ఇన్‌స్పైయిర్ కావడానికి - అనగా చెక్కేయ్యడానికి, ముఖ్యంగా తెలుగు వాళ్ళకోసం రాసినవి.

వీటిలో పరిషన్నాటకాలు, రేడియో నాటకాలు, రూపకాలు, సినిమాలు వగయిరాలు.

ఇవి కాక సినిమా స్క్రిప్టుల్లా ముందేమీ రాసుకోకుండా - అక్కడి కక్కడ మాటలనుకుని ఆడేవి. వీటిలో ఎలక్షన్ · నాటకాలు, కలక్షన్నాటకాలు, కంట్రాక్టు నాటకాలు (నువ్వనుకునేవి కావు. రోడ్లు, వంతెనలు, ప్రాజెక్టులు, ఆఫీసులు, ఆస్పత్రులూ కట్టే కంట్రాక్టు నాటకాలే) సాహిత్య సంగీత నాటక పరిషన్నాటకాలు, ఉద్యోగ విజయాలు (నువ్వనుకునే తిరుపతి వెంకట కవులవి కావు)- ఇవి వేరు.

...ఓయ్ చోటయి పోయింది. భావాలు క్రిక్కిరిసి పోతున్నాయి. ఇవాల్టికి లెక్చరాపి నిలాటి రేవుకెళ్ళి, ఎనాటమీ – అనగా సుందర శరీరశాస్త్రం, స్టడీ చేదాం గాని అమ్మనడిగి ఓ పావలా పట్రా సిగార్సు కుంటుంది. ♦

సగం స్వప్నం సగం సత్యం అయిన జానపద కథా ప్రపంచంలో, తండ్రీ కొడుకు లిద్దరు యుద్ధానికి సిద్ధపడే అసాధారణ సన్నివేశాన్ని నిర్మించి చూపే వృత్తాంతం 'రేచుక్క-పగటిచుక్క' (స్వస్తిశ్రీ ప్రొడక్షన్స్) చిత్రం. సగం కదనం సగం కథనంగా, ఆద్యంతం బ్రహ్మాండమైన సెట్‌లమీద డాన్సుచేస్తూ సాగిపోతుంది.

పగటిచుక్క విజయరాయలు, 'దొంగ' వేషం వేసుకోడానికి ముందు దొర. సి. ఎస్. ఆర్. ఒక్కడే ఒప్పించి నప్పించగల తరహా వెర్రిబాగుల చక్రవర్తి వీరరాఘవులు దగ్గిర సామంతుడు. చక్రవర్తి

స్వస్తిశ్రీ ప్రొడక్షన్స్

# రేచుక్క-పగటిచుక్క



సోదరుడు విక్రముడు (సినీ విలన్ ఆర్. నాగేశ్వరరావు) భిల్లగూడెంలో కన్నెపిల్ల (ఎస్. వరలక్ష్మి) లను చెరచి దొంగచాటుగా తప్పించుకు పోవడం తన కొడుకు ముగ్గురు బిడ్డల తండ్రి సైజుకి పెరిగినా తను విగ్గుకీ సినీమీసాలకీ రంగేసు కోవడంవంటి కుర్రకారు చేష్టల దగ్గర నుంచి, రాజ్యాధిపత్యం కోసం వేసిన తన ఐరవైరీళ్ళ ప్రణాళికకు ఒకటో రీలునించీ అడ్డు తగులుతున్న విజయరాయలును అక్రమంగా బంధించి, అతని దేవిని, కులదీపకుడిని, దేవిడీలో ఉండగా తగల బెట్టించబోవడంవంటి పెద్ద పెద్ద ఓ ఘూయిత్యాలదాకా చేస్తాడు. విజయరాయలు చెరనుండి తప్పించుకుపోయి భిల్లులలో కలిసి అడవిలో పెద్ద సైన్యం కట్టుకుని అక్రముడి విక్రమానికి సవాలుగా 'రేచుక్క' పేరిట నిలుస్తాడు. విక్రముడు, యువరాణిని ఖర్చు రాయించబోయే వరకు రేచుక్క ఆ పిల్లని ఎత్తుకపోయి తన దగ్గిర పెంచుతూ ఉంటాడు. విక్రముడు తన కొడుక్కి పట్టాభిషేకం చేయించబోయేసరికి ఆతన్ని ఎత్తుకపోయి ఖైదులో కాపాడుతూ ఉంటాడు. దానికితోడు విజయరాయలు కొడుకు, చిన్ననాటి ప్రమాదంవల్ల అడవుల పడి తిరిగి, ఈ రాజ్యపు సేనానికే దొరికి అతని కొడుకుగా పెరుగుతూ ఉంటాడు. యువరాజమాత 'కన్నాంబ', దాది వేషంలో అతన్ని సాకుతూ ఉంటుంది; సినీధర్మము కడపట జయిం చునన్న నమ్మకతో తన ప్రయత్నాలన్నిటికి (రే) చుక్కెదురు కావ డంతో విక్రముడు సేనాపతిని బెదిరించి, రేచుక్కని పట్టితెమ్మం టాడు. సేనాని కుమారుడు విజయకుమార్, రేలంగి వెంట రాగా సరాగా లాడుతూ పాడుతూ ఫొటో జెనిక్ ఆడవులలో కొంత దూరం పోయి ఒక చిన్నదాన్ని (స్వయానా రాజుగారే కన్నదాన్ని) చూసి ప్రేమకథలో జారిపడతాడు. కాగలకార్యం కథకులే తీరుస్తారన్న ధీమాతో శ్రుతిమధురమైన యుగళగీతాలు కూడా పాడుతాడు. ఆ పిల్లే వెదకపోయిన తీగ కాబట్టి ఆతని చుట్టూ అల్లుకుంటుంది. ఆమె ద్వారా విజయకుమార్ అద్భుతమైన రేచుక్క శిబిరం సెట్‌ల మీదకు వెళ్తాడు. తరువాత మెల్లిగా తనకి కావలసిన బందీ విక్రముడి కొడుకుని విడి పిస్తాడు. రాకుమారిని అతన్ని రాజ్యానికి పంపివేస్తాడు. ఇలా రేచుక్కకి కూడా చుక్కెదురుచేసిన తాను పగటిచుక్కననీ ఫలానా చోట భేటీ దొరుకుతుందనీ కబురు పెడతాడు. చుక్క లిద్దరికీ,

యుద్ధం జరుగుతుంది. పగటిచుక్క తను కన్న కుమారుడే అని రేచుక్క గుర్తించి కొడుక్కి చేజిక్కిపోతాడు. ఆపై పగటిచుక్క విజయకుమార్ అసహాయశూరుడై అధర్మాన్ని జయించడం దర్శకుడు కె. కామేశ్వరరావు యీ చిత్రం పతాక సన్నివేశాలలో చిత్రించారు.

చిక్కటి కథ అయినా రెండు తరాల వృత్తాంతాలను సమన్వయించడం, సముద్రాల జూనియర్ వ్రాసిన జాను, టార్జాను తెలుగుల లాగే జరగతగినంత కట్టుదిట్టంగా జరిగినట్లు కనిపించదు. అనేక సన్నివేశాలు విడిగా చాలా బాగున్నాయి. వాటిలో సంభాషణలూ కథోచితమైన రీతిన చక్కగా నడిచాయి. పుష్కలంగా కత్తియుద్ధాలు, తెలుగునాటి మల్లయుద్ధప్రవీణుల విద్యా ప్రదర్శనలూ, రీలు రీలునా నృత్యాలూ, పాటలూ మొదలయిన వాటివల్ల చిత్రం విసుగెత్తకుండా కాలక్షేపంగా ఉంది. తండ్రిని బంధించి చెరలో వేసిన పుత్రుడుగా రామారావు, దొరగానూ దొంగగానూ కూడా నిండైన దొరతనాన్ని చూపిన పగటిచుక్కగా రంగారావు, కన్నాంబ, పతాక సన్నివేశాలలో మంచి నటన ప్రదర్శించారు. యుద్ధాలు అన్నీ ఉత్సాహభరితంగా ఉన్నాయి. ముఖ్యంగా రామారావు, ఆర్. నాగేశ్వరరావుల ద్వంద్వ యుద్ధం చాలా బాగుంది. భిల్లుల దొరగా మహంకాళి వెంకయ్య, విక్రముడుగా ఆర్. నాగేశ్వరరావు, అతని కుమారుడుగా రాజనాల, యువ రాణిగా జానకి యథోచితంగా నటించారు. హాస్యనటులు నలుగురూ ఇందులో సమృద్ధిగా వినోదం సమకూర్చారు. పేకేటి దుష్టుడి పాత్ర భరించినా దాన్ని అహ్లాదకరంగా ధరించాడు. బాలకృష్ణ పద్మనాభం చిత్రం ఆరంభంలో చేసిన స్లాప్‌స్టిక్ మనోహరంగా ఉంది. ఈ చిత్రం మొత్తంమీద కొట్టొచ్చినట్టు కనిపించేవి తోట వెంకటేశ్వరరావు వేసిన సెట్‌లు, వాటిని నేత్రపర్వంగా చూపిన రెహమాన్ ఛాయాగ్రహణం. పాటలకు రూపకల్పన కూడా కొత్తదనంతో ఒప్పింది. కాదా ఔనా అనే యుగళగీతం, 'మనవి సేయవే' అనే పాట చాలా బాగున్నాయి. వాటికీ, మరి రెండు పాటలకూ టి. వి. రాజు కూర్చిన వరసలు కూడా హాయిగా ఉన్నాయి. ఒకటి రెండు పాటలు మటుకు పాత బాణీలను జ్ఞాపకం చేశాయి. నేపథ్య సంగీతం సెట్‌లాగే భారీ 'ఎత్తున' ఉంది.


బాపు కొమ్మనులు
అరవం, తెలుగు, హిందీ సినిమా నాయిక
అధికంగా విశాలమౌతున్న దేవిక
పేరు రాక ముందు ఈమె ఉత్త ప్రమీల
ప్రతిభ ఉంటే పేరు తెచ్చుకోడం అవలీల

BAPU

# వీర ఘటోత్కచ

సినీమాయామయుడు బాబూభాయ్ మిస్త్రీ మాయా ఛాయాగ్రహణ శిల్పం ప్రధానాకర్షణగాగల "వీరఘటోత్కచ" అను మాయాబజార్, లేక శశిరేఖా పరిణయం అను వత్సలా కల్యాణం చిత్రం గత వారం ఆంధ్రలో విడుదల అయింది. ఇది తెలుగులో లోగడ రెండుసార్లూ, హిందీలో ఒకసారీ సినీ బజార్‌లోకి వచ్చి అందరినీ సంతోషపెట్టి వెళ్లింది. భారతంలో కథల, వాటిలో సాముల, ఆసాముల తరహాలే అంత.వారిని సాధారణంగా,ఎవరెంత బాధించికిందకి దించినా సహించి, నవ్వుకుని అలా ఎత్తుగా ఠీవిగా నిలబడగలరు. నిలబడి ఎక్కడెక్కడి వాళ్ళనీ పిలవనూ గలరు...

దర్శక నిర్మాత బాబూభాయ్ మిస్త్రీ దీనిని అనితా గుహ, ఉల్హాస్, కృష్ణకుమారి (హిందీ), రాజ్‌కుమార్, మహీపాల్, వసంతరావ్ పెహల్వాన్ మొదలగువారితో తిరిగి నిర్మించారు. కొన్ని నృత్యాలను రంగులలో చిత్రించారు. కొన్నిటిని సినిమాయతో, అద్భుతాలతో నింపారు. కథ శిశుపాల వధతో ఆరంభమై, కృష్ణలీలలన్నీ గుర్తుచేసి, మయసభ సెట్‌మీద దుర్యోధనుడి భంగపాటు, ధర్మరాజు జూదం ఆడి ఓడడం, ద్రౌపదీ వస్త్రాపహరణం, కాలెండర్ కృష్ణుడు ఖటావ్ వాయిల్స్ సరఫరా చేయడం మొదలైన ఘట్టాలమీదుగా (ఈ వాక్యంలో ఉన్నన్ని అన్యభాషా పదాలతో) శశిరేఖా పరిణయం కథలోకి ప్రవేశించారు. మిగతా కథ మీ రెరిగినదే, ఇంతకు ముందు కథ మీ రెరగరని తాత్పర్యం కాదు. (నిజానికి సినీ పురాణాలలో ఎవరూ ఎరగనివి కూడా ఉంటూనే ఉంటాయి.) శశిరేఖా పరిణయకథ అంతా యథాప్రకారంగా మాయాబజార్ సినీ కథ ప్రకారంగా అందంగా ఆహ్లాదకరంగా సాగిపోయింది. కొన్నిచోట్ల శ్రీశ్రీ గారు సంభాషణలు వ్రాశారు. కె. వి. ఎస్. శర్మ, కాశీనాథ్, కాటూరి అన్నపూర్ణ, పద్మనాభం, అల్లు

రామలింగయ్య, వసంతకుమార్ మొదలగు అనువాద చిత్రగాత్ర ధారులు, 'మదరాసీ డైలాగులను' సాధ్యమైనంత జాగ్రతగా ఉచ్చరించారు. మొత్తంమీద లిప్ సర్వీస్ బాగుంది.

చిత్రగుప్త సంగీతంలో అద్భుతమైన బాణీలూ అవీ ఉంటే గుప్తంగా ఉండి ఉండాలి. ఇవతలకి తొంగిచూసి మనని పలకరించి అమోఘంగా బోలెడు అలరించటం లేదు. అలా మనని చాలా సంతోష పెట్టి పంపేవి భారతకథా, బలరాముడు తమ్ముడిని 'కృష్ణయ్యా' అని పిలవటం, సుశీల, శ్రీనివాస్ పాడిన ఒక పాటకు, కృష్ణలీలల ఘట్టంలో, వసుదేవుడికి యమునానది దారి ఇవ్వడం (దాదాపుగా టెన్ కమాండ్‌మెంట్స్‌లో ఎర్రసముద్రం చీలిపోవడం అంత కట్టుదిట్టంగానూ ఉంది), ఘటోత్కచుడి మాయలూ, మాయాబజార్‌లో గారడీలు అద్భుతంగా ఉన్నాయి. పాత్రధారుల గురించీ, నటనగురించీ చెప్పుకునేటప్పుడు 'అద్భుతం' 'ఉత్తమం' వంటి మాటలు గుర్తుకురావు.

**1959**

---

కోవెల ముందు నందీశ్వరుడి విగ్రహం చూపిస్తూ

కన్నప్ప (అల్లు రామలింగయ్య): దొరగారూ-ఈ నందీశ్వరుణ్ని
మన బంగళా తోటలో మన యింటికి
ఎదురుగాపెడితే...?

దొర (రావుగోపాలరావు): ఇంటిదగ్గర పెట్టడం బాగోదేమో!

కన్నప్ప :, ఇల్లేవిటండీ! మీ బంగళా మా పాలిట శివాలయం. మీరు సాక్షాత్తూ పరమేశ్వరులు...

దొర : కన్నప్పా! నన్ను మునగ చెట్టెంకిచేస్తున్నావ్ - పైనించి పడితే నీమీదే పడతాను. పచ్చడైపోగలవు

కన్న : దానికెంత పుణ్యంగావాల!

—మనవూరి పాండవులు



# ఎక్స్‌ఫిలింస్ వారి నెక్స్ట్ పిక్చర్

గురూ! గురూ! గుండె కరిగిపోతోంది. కరిగి నీరైపోతోంది, అంటు గురువులు పరుగుపరుగునవచ్చి గురువు పాదాలమ్రోల వాలాడు

గురువు పెద్దసైజు కారక్టర్ యాక్టరు. వాళ్ల ఊళ్లోవాళ్ళు చాలా సార్లు అతనికి నచ్చచెప్పగా, ఆయన చెన్నాపట్నం చక్కా వచ్చి, చాలామందికి, చాలాచాలా నచ్చ చెప్పజూశాడు.

అతని నటన చూచేవాళ్ళు దొరక లేదు. దొరికినవారు సాంతం శాంతంగా చూడలేరు. స్టుడియో గేటు అవతల కాస్త ఆసింటా క్యారక్ట రాక్షను చేస్తానంటే ససేమిరా వద్దన్నారు అందుకని గేటుకి అవ తలగా కాస్త ఇసింటా ఆ పని చేస్తూ కూర్చుంటాడాయన. అలా ఉండి ఉండిబోలెడు అనుభవంగడించి, గడ్డంపెంచి కొంత గొప్ప వాడయ్యాడు. చిన్నసైజు శిష్యుల గాంగుని సంపాదించాడు. మెల్లిగా ఓ ఆఫీసు తెరిచి, పుకార్లు ఉత్పత్తిచేసి పోపులో వేసి పాండీబజారులో అమ్మి సొమ్ము చేసుకునేవాడు కాస్తాకూస్తో. ఈ విధంగా సర్వజ్ఞ బిరుదాం కితు డనిపించుకున్నాడు శిష్యబృందంలో.

◆ ◆ ◆ ◆

“గురూ. గుండె కరిగిపోయె” అంటూ గురువులు గురువుగారి కాలిమ్రోల వాలిన వేళకు ఆయన కాస్త హడావుడిగా ఉన్నా, గురు

వులు ఊపిరి సలుపనివ్వనందువల్ల వాడి గోడు వినక తప్పిందికాదు.

''వత్సా! వెధవ పీనుగా, నీ సిగతరగా! అఘోరించు నీగోడు'' అన్నాడు వాత్సల్యంతో.

''గురూ. మరీ, మరేమోనూ_ఓ కుఱ్ఱాడు ఇందాకా, చెట్టుకింది కంపిణీలోకెల్లీ, మళ్లీ యాడత్తా లగెత్తుకెల్లి పోతన్నాడు. ఎందుకో తెలిసిందికాదు. అంతట్లోకి ఒవుడో అణ్ణాపి ఏదోసెప్పి, మళ్లీ లోపలికి తీసుకెల్లాడు! ఇంకోనిమిషం అయేతలికి యంతాచ్చరం! ఆ బుల్లోడు నవ్వుతా పేలుతా ఇవటాల కొచ్చాడు. ఏంటి గురూ! ఈ సోద్దానికర్దం? ఇంతట్లోకే, ఆ పార్దూసరు ఫశ్యాస్తాపడి పటుదల ఒగ్గేసి ఛానుసు ఇత్తాం బుల్లోడా అన్నాడా?'' అన్నాడు గురువులు గురుతర కుతుహాలా యత్త చిత్తుడై.

గురూజీ ఒకక్షణం కళ్లు మూసుకుని ఆలోచించి, బీడిముట్టించి, ఆ చోద్యం ఏమిటో అవగతం చేసుకుని ఇలా చెప్పాడు:

“నాయనా గురువులూ, నిన్ను చూస్తే నాకు సిగ్గేస్తున్నది. నీ దుంపతెగ. ఎందుకు పనికొస్తావు. అందులో వింతేముంది. ఆ పొడ్యూసరు మొదటిసారి ఆ కుఱ్ఱాడికి ఛాన్సు ఇవ్వనన్నమాటనిజమే. రెండో సారి ఇస్తానన్నమాట నిజమే. కాని ఎందుకు ఇస్తానన్నాడు? ఏమిటిస్తానన్నాడు?

విను. రెండోసారి ఆ కుఱ్ఱాడిని లోపలికి తీసుకెళ్ళినవాడు డిస్ట్రిబ్యూటరుగారి బావమరిది. వాడూ వీడూ చిన్నపుడు గోటీ ఆడుకుని ఉంటారు. అందుకని వాడు సిపార్సు చెయ్యడంతో, ప్రొడ్యూసరు బావుండదని ఛాన్సు ఇస్తానన్నాడు. అయితే ఎందులో?

నెక్స్ట్ పిక్చర్‌లో... అది వాడు తీసిన్నాడుమాట: వీడు వేసినపుడుమాట. సంగతి వాడికి తెలుసుగాని వీడికి తెలీదుగా అయినా వీడూ వాడూ ఇప్పటికి ఆనందపడ్డారు గదా. వెయ్యేళ్ళకే అదే కావలసింది.

అయినా ఈ “నెస్ట్ పిక్చర్” అనేదాంట్లో గొప్ప మహత్యం ఉందిలే. మాజిక్కు అది. నొప్పించక తానొవ్వక తప్పించక తిరగమని ఓ పద్యంలేదూ దాని తాలూకు ట్రిక్కు ఇదన్నమాట.

ఎవరేమడిగినా సరే నెస్ట్ పిక్చర్లో తప్పకుండా ఛాన్సు ఇస్తానంటే సరిపోతుంది. ఇప్పుడు నే నున్నానా, ఇదివరకు ఇలా లేను. ఇదివరకు నేను పది 'నెస్ట్‌పిక్చర్ల'లో మరో రోల్సు, ఇంకో పదింటిలో లీడ్‌రోల్సూ, ఇంకో మూడు నెస్ట్ పిక్చర్లలో హీరో రోల్సూ వేసేవాణ్ణి. అప్పుడు నాతో ఒక అమ్మాయి కూడా ఉండేది. అది ఎనిమిది నెస్ట్ పిక్చర్లతో హీరోయినుగా ఉండేది. తరువాత మానేసి, 'పాండీబజారుపడి', చివరకి ఇంటికెళ్ళి పోయిందనుకో. తలుచుకుంటే నా హృదయం కంపిస్తుంది. గొంతు గద్గద స్వరంతో మాట్లాడుచున్నది. అవెందుకులేగాని, అదీకథ.

నేను నెస్ట్‌పిక్చర్లలో వేసేటప్పుడు ఎంతమందికి కాఫి సిగరెట్లు తెచ్చానో చెప్పలేను. ఇంకో నెస్ట్ పిచ్చరు కవి కూడా ఉండేవాడు పాపం. రాత్తిరి తెల్లవార్లూ కూచుని, ఆ పిక్చరు అసలు కవి రాసేవన్నీ వాడేరాసేసి, ఫెయిరు కాఫీరాసి అడవాచాకిరీ చేసేవాడులే.

వాడు నెలకు వంద నెస్ట్‌పిక్చర్లలో ఉండేవాడు—వాడూ, ఇంకో సాంగులవాడూను. ఇంకోటి. ఇపుడు మామూలు మనుషులున్నారు. వాళ్ళు హార్టిష్టులు కారుగదా. మామూలు గుమాస్తాలూ వాళ్ళూను.

డబ్బు చాలదుగా.

అందుకని వాళ్లూ ఓ ట్రిక్కు కనిపెట్టారు. చాలా రోజులయిందనుకో. ఆ ట్రిక్కే 'నెస్ట్‌మంతు', తెలుగులో వచ్చేనెల అంటారు. వాళ్ళ పెళ్ళాం పిల్లలు ఒక్కటే అనుకో—'వచ్చేనెల' బోర్డు కొత్త బట్టలు కొనుక్కుంటారు. బోర్డేసి మందులూ కూడా కొనుక్కుంటూ ఉంటారులే.

ఈ నెస్టు పిక్చరూ, నెస్టుమంతూ మన వాళ్ళనే కాకుండా, దుర్మార్గుల్నీ టోకరాకొట్టడాని క్కూడా పనికొస్తాయి.

అప్పులవాడు వస్తాడా. నెస్టుమంతు నీ మొహాన తగలేస్తాననచ్చుగదా. నెస్టుమంతు వాడెవరో మనమెవరో.

నెస్టు పిక్చరూ అంతే. పెద్ద రికమెండేషను వాడొచ్చాడనుకో. అన్ని ఫిలప్పయి పోయాయిసార్. నెస్ట్ పిక్చరులో తప్పకుండా ఛాన్సు ఇస్తానని ఒట్టు వెయ్యొచ్చు. వాడు జిడ్డురకం అయి వదలకుండా మళ్ళీ ఎప్పుడో తగులుకుంటాడని భయంవేస్తే, మా బావమరిది నెస్టు

పిక్చరులో ఛాన్సు ఇప్పిస్తానండి అని ముందరే చెప్పెయ్యొచ్చు.

"మాది చాలా గొడవల కంపెనీ, మీకు ముందర చాలామంది ఉన్నారు. షేరుహోల్డార్లు పేచీకోర్లూ అందుకని మా బావ మరిది కొత్త కంపెనీపెట్టి నెక్టుపిక్చరు తీస్తాడూ. అందులో మీకు హీరోరోలు గారంటీ" అని గారంటీ యిచ్చెయ్యొచ్చు.

అందులో కూడా ఇవ్వడం ఇష్టంలేకపోతే, ఆ కంపెనీ పేరు చెప్పరు. వాడు మళ్లావస్తే, ఇది మా బావమరిదిది కాదు, ఇంకోడిదీ అనవచ్చు. అందుకని మా బావ మరిది పెట్టబోయే కంపెనీ పేరు:

''ఎక్స్ ఫిలింస్'' వారు తియ్యబోయే చిత్రం పేరు.

"నెక్స్ట్ పిక్చర్"

అని చెప్పాలి. అది చాలా బెష్టు; లేపోతే నానారొష్టూను.◆





## విఠల ప్రొడక్షన్స్ జయవిజయ

అమోఘంగా బోలెడంత 'ఐ. క్యూ:' (తెలివి తేటలని తాత్పర్యం) లేనివాళ్లు కూడా, 'జయ విజయ' పేరు చూడగానే ఇందులో రెండు శాల్తీలు ఇమిడి ఉన్నాయని చటుకున పసిగడతారు ; ఆపైన మటుకు, ఉన్న వారుకూడా కనుక్కోలేని విశేషాలు ఉండడమే 'జయ విజయ'లో విశేషం. మాట వరసకి, ఈ జయ విజయులు, గబగబా మూడు జన్మలు ఫిరాయించి అడ్డదారిన హరిని చేరిన హరిద్వార పాలకులేనని పొరబడడం బహు సులభం. అలా పడిలేచాక, 'కాదు కాదు. జయసింహ, విజయసింహ అను ఇద్దరన్నదమ్ముల యుద్ధమ్ముల కథ' అనుకుని మళ్ళీ తప్పులో కాలేయడం అతిసహజం. నిజానికిందులో ఉన్నవి రెండు హీరో హీరోయిన్ (రకానికొక చొప్పున) శాల్తీలు. ఇలాగే ఇంకా, ఇందులో బాలనాగమ్మ కథ. 'సొవర్ణ సుందరీయా' లైన మాయా తివాచీ వగైరాలూ ఉన్నాయని కనుక్కోలేము. కథ అయిపోయాక, రాజనాల కాంతారావుతో కత్తి యుద్ధం చేస్తాడని గాని తలిదండ్రులతో మోటసరసం ఆడతాడని గాని ఊహించలేము. ఎక్కడికక్కడ ఇలాటి 'సస్పెన్సుతో' సాగే చిత్రంలో కథ గురించి మటుకు మనం ప్రాణాలుగ్గబట్టుకు కూర్చోనవసరం లేదు. తరువాత

ఏం జరుగుతుందన్న దానిపై పెద్ద ఎత్తున పందాలు వేసుకోనక్కర లేదు.

అనగనగా ఒక రాజుని, ఒక రోజున ఇంకో రాజు (ఇద్దరిలో ఒకాయన సామంతుడు) భోజనానికి పిలిచి సామంత రాజ్యపు సెట్ మీద కుట్రచేసి, ఖచ్చ రాయించేసి ఆయన రాజ్యాన్ని **సొంతానికి** 'జమ' చేయించుకుంటాడు. అపుడు మంచి రాజు కొడుకు పసివాడు. మంచి రాజ భక్తులు వాడిని రక్షించి, అడవుల్లో పారిపోయి పెంచి కాంతారావుని చేస్తారు.

అందగాడైన ఆ యువరాజు తిన్నగా వుండక ఒక రోజున శత్రు రాజ కుమార్తెను చూసి ప్రేమించి మంచి మంచి ట్రాలీషాట్లలో ఫొటో జెనిక్‌గా డ్యూయెట్లు పాడబోతాడు. అతన్ని పెంచిన వాళ్లు అది చూసి కూకలేసి, అతని జన్మకథ చెప్పి, ఫలానా పరిస్థితుల్లో తామంతా అతన్ని కోటదాటవేసి అడవులలో పెంచిన వైనాన్ని ప్రకటిస్తారు. వాళ్ళ వయసూ వాలకం చూడగా, ఇలా కోటదాటి వచ్చిననాటికి వాళ్ళంతా కూడా ఏడాది రెండేళ్ళ వయస్సువారై వుండి వుండాలని మనలాగే యువరాజు విజయుడికీ అనిపించి వుండాలి. అందుకే అప్పటికది నమ్మినట్లు కనిపించినా నిజంగా గురి కుదరక జఘుమంగళ్ళ కోసం జెంగపెట్టుకునే వుంటాడు. అప్పుడీ కథకి ఏం చేయాలో తోచక సాగుదామా ఆగుదామా అనుకుంటూ వుండగా మాయలఫకీరు ప్రత్యక్షమై కథకి ధైర్యం చెప్పి కథా నాయికను హడలగొట్టి ఎత్తుకపోయి బందీ చేస్తాడు. హీరో విజయుడు కూడా అర్జెంటుగా వెళ్ళి పోయి అక్కడ బందీ అయిపోయి కృష్ణ కుమారి 'సోలో'లు వింటూ వుంటాడు.

సువర్ణసుందరిలో* లాగే గుహలోపడి సాధువు దయవల్ల గడించిన మాయా తివాచీ కమండలం, శంఖం వగైరాలతో ఏం చేయాలో, ఆ ఎందుకు పనికొస్తాయో గట్టిగా తెలీక తికమకపడుతున్న బాలకృష్ణ బాధ్యత పెరుగుతుంది. హీరో పనులకి వడిగట్టవలసి వస్తుంది. హీరో రోలు దాల్చి, శత్రు రాజును ఖైదుచేసి ఆపైన మాయలఫకీరు గుహలో జొరబడి మాయా శంఖాన్ని కాస్త మోటగా వాడి ఫకీరు పళ్లు రాల గొడతాడు. అక్కడితో మాయమాయమైపోయి, సెట్ ఇంకా వూగి అల్లకల్లోలం అయిపోతుంది. అంతా వూరికే ఉంటే బాగుండదని హీరో కాంతారావు ముక్కాములతో చూడతగ్గ యుద్ధం చేసి అతన్ని హత

మార్చి, కథను కంచికి మళ్ళించ చూస్తాడు. ఈలోగా రాజభక్తులు మిక్కిలినేని అండ్ కో వారు ఇతర రాజ్యాల నుండి అపార సేనా వాహినిని తెచ్చి దుష్టరాజు మీదకి దండెత్తడానికి కృషి చేశామంటారు గాని విఠలాచారిగారు సిసిల్ బి డిమిల్ మతస్థుడు కానివాడు కావడం వల్ల, అప్పటికే ఫకీరు సెట్ మీద బోలెడు గలభా జరిగి ఉండడంవల్లా మళ్ళీ సైనిక జనాభా ఎందుకని, అంతవరకూ పెట్‌పెల్లులో పశ్చాత్తాపంలో బొల్లు ఫల్లయిపోతున్న రాజుగారు 'నాయనా నా కూతుర్ని చేసుకో" అనేస్తాడు.

బాలకృష్ణ మాయ తివాచీ ఎక్కి అందరూ రాజ్యానికి వెళ్తారనుకుంటే మీరు మళ్ళీ పొరపడగలరు. అవన్నీ మరో చిత్రానికి పనికి రాగల ప్రమాదం ఉంది.

రాజుగారూ, రాజకుమారి జయమంగళా తమ రాజ్యం వెళ్ళిపోతారు. విజయుడూ పెళ్ళి బలగం అంతా వెనక బయల్దేరి రాజధానికి తరలి వెళ్ళేవరకూ, కోటలో ఉన్న దుర్జనుడు దుర్జయుడు (రాజనాల) ముక్తాయింపు కుట్రచేసి, తలిదండ్రులను ఖైదులో వేస్తాడు. దంపతులు కాబట్టి వారిని ఒకే గదిలో ఉంచాలని భయంకరమైన తెలుగు మాట్లాడుతాడు. అతనీమాట అన్నందుకు శిక్షగా ఆ తరువాత విజయుడు కాంతారావుతో చేసిన ద్వంద్వ యుద్ధంలో ఎంత బాగా పోట్లాడినా చివరికి చచ్చిపోతాడు. అప్పటికే రీలాతీతం కావడంతో కథ ముగిసింది.

దర్శకుడు విఠలాచార్యగారు తాపీగా స్థిమితంగా నికార్సయిన జానపద పథంలో చూపించిన ఈ కథలో నటన 'హైకీ'లో, పై స్థాయిలో సాగింది. మాటలూ అంతే. తెలుగు రానివాళ్ళు (మనకి రాని తెలుగు గూడా కొంత ఉంది) కథ కమామీషూ సులభంగా తెలుసుకుందికి నటన ఉపయోగపడింది. ఇది సాధించడం కోసం, ఇంతకన్న తక్కువ నటించే సామర్థ్యం ఉన్న కాంతారావు, రాజనాల, మిక్కిలినేని కూడా ఇందుకే కృషి చేశారు. బాలకృష్ణ అభిమానులందరికీ, ఇందులో అతడు చాలాసేపు కనిపిస్తాడన్న వార్త అసలు రేకెత్తించినా, అతని నటన చాలవరకు సంతోషపెట్టి, ఆ పైన, కథ బలీయంగా అనిపింప చేస్తుంది. అల్లు రామలింగయ్య ప్రేమలో పడడం ఒకటి ఆహ్లాదకరంగా ఉంది.

మొత్తానికి బాగా నలిగిన జానపదపథాల షికారు తీసుకు వెళ్తుంది. ఈ చిత్రం దారిలో అందమైన ప్రకృతి దృశ్యాలు కని పిస్తాయి. హాయిగొలిపే పాటలు వినిపిస్తాయి.◆

1959

---

జె. బి. (నాగభూషణం) : డబ్బుతో కొనలేని దేవుందండీ! నే తలచు కుంటే ఫ్రాన్సునించి పెసరట్టు, అమెరికా నించి అల్లప్పచ్చడి తెప్పించగలను. నాకు ఉక్కపోస్తే గోదారికంతా ఏర్ కండీషన్ చేయించి పారేస్తాను. దోమలు తోలడానికి తొంభైమంది గుమాస్తాలను పెట్టగలను..."

రామం (అక్కినేని): నీకు ఎంత డబ్బున్నా ఆహార నిద్రా భయ మైథునాదులు స్వయంగా చేసుకోవలసిందే!

అప్పారావు (రాజుబాబు): తెలుగే నాకు సరిగా రాదు. సంస్కృతం నిల్లు.

—అందాలరాముడు

---





# ఇంతకింతౌ
## అను - సత్యాబేడు

ఎక్స్ ఫిలింస్‌వారి 'నెక్స్ట్' చిత్రానికి పెద్దఎత్తున ప్రేడ్‌షో జరుగుతోంది. చలన చిత్రకారులు యావన్మందీ విచ్చేశారు. ఇంటర్‌వెల్ వేళకి సినిమావరండా చాలా సందడిగా ఉంది. నమస్కార బాణాలు రివ్వు రివ్వున ఎగురుతున్నాయి.

ఒకవారగా చిత్ర నిర్మాత నిలబడి ఉన్నాడు. తనకి పరిచయం ఉన్న పెద్దలను ఒక్కొక్కరినే సైగచేసి పిలుస్తున్నా డాయన.

"సార్! / బ్రదర్! / ఏమండీ! / అంతకింతైంది; ఇంత కెంతవు తుంది?" అని ఒకొక్కరినే అడుగుతున్నాడు చేతులు పట్టుకుని.

చాలామందికి తెలియలేదు ఆయన ప్రశ్న.

ఏది నువ్వడిగేది? పిచ్చరా. పిచ్చరు బ్రహ్మాండంగా ఉంది పొమ్మన్నారు కొందరు.

నిర్మాణానికి ఖర్చెంతయిందో ఊహించాలి కాబోలని, ఐదారు లక్షల యుంటుంది. రైటేనా అన్నారు ఒకరు.

ప్రశ్న అడుగుతున్న నిర్మాతకి ఈ జవాబులు నచ్చటం లేదు. పెదిమ చప్పరించి మరో మిత్రుడిని పిలుస్తున్నాడు.

చివరికో పెద్దమనిషి వచ్చాడు. ఆయన చేతిలో ఓ కుండకూడా వుంది.

"మీరైనా చెప్పండి. అంత కింతైంది; ఇంత కెంతవుతుంది?" అన్నాడు నిర్మాత ఆతుర్దాగా.

ఈసారి ఈ పెద్దమనిషి తెల్ల మొహం వెయ్యలేదు మిగతా వాళ్ళలా. చేతిలో వున్న కుండ నేలమీద పడేసి బద్దలుకొట్టి "గురూ జీ! అంత కింతైతే అయిందిగాని, ఇంతకింతే, కుండ బద్దలుకొట్టి మాట్టాడ్డం నా తత్త్వం" అన్నాడు.

నిర్మాతకి ముచ్చెమటలు పోశాయి.

"అయ్యా! తమరెవరో ఫాన్సీడ్రెస్‌లో వచ్చిన మహాపురుషులు! నన్నెదిరించ గలిగిన శూరాగ్రేసరా! నీ వెవరు? నిజం చెప్పేటట్టున్న ఓ సాహసీ! నీ పేరేమి? నా పిచ్చరు మీద జోస్యం చెప్పిన ఓ శకున పక్షీ! నీ వూరెయ్యది?

"ఓ పరేంగితజ్ఞుడా! నేను అడిగిన ప్రశ్నలో నీకేమి అర్థమైంది? నీ జవాబు నేనెలా అర్థం చేసుకోవాలి?" అన్నాడు.

పెద్దమనిషి మందహాసం చేశాడు. గొంతు సవరించుకొని, వినండి అన్నాడు. అయ్యా అంత కింతైంది. ఇంతకెంత—అని మీరు ప్రశ్న వేశారు. అందులో మొదటి భాగానికి అర్థం. రెండేళ్ల క్రితం మీరు నవయువకులు. మంచి ఉద్దేశ్యాలతో, ఉత్సాహంతో పట్టుదలతో ఈ ఊరువచ్చి ఫిలిం తీశారు. చక్కని కథ తెచ్చుకున్నారు. అందరి కన్న మంచి చిత్రం తీయాలని, జాగ్రత్తగా ఆలోచించి కథకి అనుగుణ మైన కమామిషు ఏర్పాటుచేసి అందంగా, ఆకర్షించగల సత్తాతో ఆ చిత్రం తీశారు. అందులో అంతా చిన్న నటులే. చిన్న ఊహలే. చిన్న కథే. అయితేనేం అన్నీ కొత్తవే. అందులో బాక్సాఫీసూత్రాళ్లు మోకాళ్ళకి బందాలుగా అడ్డుపడలేదు. బాగుండేలాతీస్తే డబ్బురాక పోదని మీనమ్మకం. అది బాగుంది. బాగా డబ్బువచ్చింది. అంతకి నూరింతలు వచ్చింది. ఆనాటి ఇంతవారు మీరు, ఈ నాటికి యిలా ఇంత పెద్దవారయ్యారు. ఇపుడు మీ దృక్పథమే వేరు. ఆ ఫింలికి డబ్బొచ్చిందని, ఆ ఫిలిం కథ, అందులో కమామిషు, నటులూ, పాటలూ డాన్సులూ అన్నీ యథాప్రకారం మళ్ళీ ఈ ఫిలింలో పెట్టారు. ఆఖరికి ఇంటర్వెల్ కూడా అందులోలాగే సరిగా అలాటి సీను దగ్గిరే పెట్టారు. ఇవన్నీ అందులో ఉన్నందువల్ల డబ్బొచ్చింది కాబట్టి ఇవన్నీ ఎందులో ఉన్నా ఎన్నిసార్లున్నా డబ్బొస్తుందని మీ దురభిప్రాయం. ఫిలిం బాగాతీస్తే డబ్బు వస్తుందన్న మీ పాతసూత్రాన్ని తిరగేసి,

డబ్బొచ్చేలాతీస్తే బాగా ఉంటుందన్న సత్యాన్ని స్థాపించుకున్నారు. **ఇది సత్తు బేడ కాసులాటి సత్యం. చెల్లదు. అందువల్ల నేను చెప్పే జవాబులో తాత్పర్యం ఇదే! అంతకింతైంది కాని, ఇంత కింకింతో అవదు, ఇంత 'కింత' కూడా అవక** పోవచ్చు. పాడిందే పాటరా అన్నట్లు మీరు పాత్రటిక్కులే, జనం వన్స్‌మోర్ అనకపోయినా మళ్ళీ ప్రయోగించారు గనక–ముఖ్యంగా ఈసారి మీ ఊహ సుభ్భరమైంది కాదు గనక, మొదటిసారి వూహవల్ల అంతకియింత వచ్చినా, ఈ సారిమటుకు మహా అయితే ఇంత కింతే వస్తుంది. మీరు దీనివల్ల ఎవరెస్టు శిఖరాలను అందుకోలేరు" అని గంభీరోపన్యాసం చేసేశాడు ఆ పెద్దమనిషి.

ఇది బొత్తిగా పచ్చి నిజంలా కనిపించినందువల్ల నిర్మాత భయపడి ఫక్కున నవ్వి "తమబొంద తమరికేం తెలీదు ఈ పిచ్చరు హిట్టవుతుందండి. పెద్ద హిట్టవుతుంది" అంటూ అతన్ని తిట్టేవరకూ కంట నీరు తిరిగింది.

నిజం చెప్పిన చిన్న పెద్ద మనిషి చిన్న బుచ్చుకున్నాడు. తనకి అబద్ధం చెప్పే పాటి కల్చరు లేనందుకు చుట్టూ ఉన్నవాళ్ళు కూడా అతన్ని చూసి జాలిపడ్డారు.

వారం తరువాత చూడగా అపిక్చరు బ్రహ్మాండమైన బాక్సాఫీస్ హిట్టయింది.

'చూశారా' అన్నాడు నిర్మాత తనపాత మిత్రుడిని బజారులో నిలేసి.

"విన్నా **సత్తు** బేడలు కూడా అప్పుడప్పుడు చెల్లుతాయని నాకు తెలిసిందికాదు" అన్నాడాయన తేలికగా నాలిక కరుచుకుని.... ◆

---

**బాక్సాఫీసు తోకలు పట్టుకుని గోదావరి ఈదినట్టు...**

—విక్రమార్కుడి మార్కు సింహాసనం

---

**పిక్చరు తియ్యకుండా స్టోరీ ఏమిటండీ! మీరూ మరీ విట్టీగా మాటాడుతారు!**

—విక్రమార్కుడి మార్కు సింహాసనం



# బాపు కార్టూనులు

మనిషి బిగువు మాట బిగువు
లఘు పాత్రలు మరీ తగవు
రఘు పాత్రలు మరీ లఘువు
నోరు నగవు ; నొసలు నగదు
పొగరు విగర్ పొంగు నగవు
పగల వగలమారి నగవు
ఒలుకును గోరోజనాల
చూడడుగో రాజనాల !

# ఆమూర్తీ - సుబ్బారావూ





సెట్ మీద సందడి జోరుగా వుంది. అంతా హుషారుగా నవ్వు తున్నారు. ఎవరో జోక్ చేస్తున్నారు. ఇంకెవరో సన్నగా ఈల కూడా వేస్తున్నారు. మళ్ళా అంతా నవ్వుతున్నారు. "ఇంకా మానీటర్ రాలేదల్లే ఉందే" అన్నారు అప్పుడే సెట్ చూడవచ్చిన ఒక పెద్ద మని... "మానీటరు కాదండి, డైరెక్టరంటారు. వచ్చారండి. యాక్టర్లూ ప్రొడ్యూసరూ అంతా ఇక్కడే ఉన్నారు. అదుగో ఆ సన్నగా బక్క పలచగా ఉన్నాయన మానీటరు. అదే డైరెక్టరు." అన్నాడు ఆయనను తీసుకొచ్చిన జర్నలిస్టు.

"ఏదీ ఏదీ ఆ పసుప్పచ్చ బట్టేసుకున్నాడు. అతనా అతనూ..."

"అవి పసుపు బట్టలు కావండి. ఓ గంటక్రితం ఆయన వచ్చినప్పుడు అవి తెల్లటివేలెండి."

"సర్లేవయ్యా... ఇంతకీ ఆ పిల్లాడు మన చిట్టిబాబు కాడూ మన రాజమండ్రీ తాసిల్దారుగా రబ్బాయి."

"ఆ చిట్టిబాబు కావడానికి నా అభ్యంతరం లేదండి. ఇక్కడా యన్నంతా ముద్దుగా అదుర్తి సుబ్బారావని పిల్చుకుంటారు."

"అందుకే నన్నుమాట ఇట్టా అల్లరిగా ఉంది మీ స్టుడియో. మా తాసిల్దారుగారబ్బాయిని చేరనిస్తే ఎక్కడేనా యింతే... ఎంతల్లరనీ ఎంతల్లరనీ..."

నిజమే. తాసిల్దారుగారి చిట్టి బాబుకు ఆ పేరు ఈ నాడూ ఉంది. కాదు ఈ పేరు ఆనాడేవుంది.

చాలామంది గొప్పవాళ్ళు, పెద్దవాళ్ళు సెట్ మీద కొస్తే అంతా నిశ్శబ్దం అయిపోతుంది. గాంభీర్యం మీసం మెలేసుకూర్చుంటుంది. అదుర్తి సుబ్బారావు సెట్ మీదికొస్తే సెట్ జనులకు ప్రాణం లేచొస్తుంది. వస్తూనే ఆ గాంభీర్యం మీసాలను గిలిగింతలు పెట్టి పకాల్న నవ్విస్తాడాయన. ఆయనతో పని నవ్వులాట కాదు. కాని, అంతా నవ్వుతూ ఆడుతూ పాడుతూ సంతోషంగా శ్రమ తెలీకుండా పనిచేస్తారు.

సెట్ మీద కొచ్చిన గంటలో ఆయన పసుపురంగు బట్టల్లో హాయిగా. స్వేచ్ఛగా పెళ్ళికొడుకులా కళ కళ్ళాడుతూ ఉంటాడు. కావాలని మట్టి పూసుకుంటాడని కాదు. పని అంటూ వస్తే ఆయనకి అక్కర్లేనిది, గౌరవానికి తక్కువనుకునేదీ లేదు. అన్నిటికీ పూసుకు తిరుగుతాడు. శ్రామికుడి నుదుట చెమట బొట్టులా, చంద్రుడి మధ్య కళంకంలా, చిట్టిబాబుకి బట్టల మీద దుమ్ము, రంగులూ అలంకార ప్రాయాలు. అవే శోభ. కాని తహసిల్దారు సత్తెన్న పంతులుగారుగాని, చిట్టిబాబు మేష్టర్లుగాని ఇలా భావించడానికి సావకాశం అనాడు లేక పోయింది.

అల్లరివాడనేవారు. చిన్ననాడే పేరు, ఏదో ఒకటి తెచ్చుకోవడం గొప్ప: దాన్ని ఇలా నిలబెట్టుకోవడం మరీ గొప్ప. అతను అల్లరి చేసిన

కొద్దీ ఆయన ముద్దు చేసేవారు. ఇద్దరాడపిల్లల తరవాత కలిగిన కొడుకు, కులదీపకుడు, వంశోద్ధారకుడు, వారసుడు, కాబోయే కరణం, అని ఆయన చాలా వుప్పొంగి పోయేవారు. చదువులో— ముఖ్యంగా లెక్కలలో చురుకుదనం చూసి గర్వపడ్డారు. ఆటల్లో గోదారి షికార్లలో, సైకిలు విహరాలలో చురుకుదనం చూసికొంచెం కంగారు పడ్డారు. కుర్రాడికి బాడ్మింటన్ మీద సరదా అని బాట్లు, బంతి కొనిచ్చారు. ఫోటోగ్రఫీ మీద మోజని, కామెరా ఫిలింకొనిచ్చారు. కాని ఆటలు ఎక్కువ కావడంతో బాటు విరగ్గొట్టి పారేశారు. (మళ్ళీ ఒకటికొన్నారను కొండి). ఫోటోల మోజు చూసి చీవాట్లేశారు.

"ఏమిత్రా అది కూడు బెట్టనా గుడ్డ పెట్టనా చదువుకునేడు" అని.

కాని ఒకనాడు అదే చిట్టిబాబు భవిష్యత్తుకు శ్రీ కారం అవు తుందనీ అదే, తమ యింటికి, ఈ వూరికి కూడా పేరు తెచ్చిపెడు తుందనీ ఆయన వూహించలేదంటే, అది ఆయన తప్పుకాదు.

సుబ్బారావు చదువులో ఎన్నడూ వెనకబడలేదు. పధ్నాలుగో యేటికే స్కూలుఫైనల్ పాసై కూర్చున్నాడు. సత్తెన్నగారు ఎగ్జంప్షన్ తెప్పించి కాకినాడ పి. ఆర్ కాలేజిలో వేశారు. రెండోయేడు ఇంటరు చదువుతుండగా సుస్తీచేసి ఇంటికి వచ్చాడు సుబ్బారావు. మూడో యేడాది సెకండియర్ రాజమండ్రిలోనే చదవ బోయాడు. కాని సాహిత్య గ్రంథాల మీద పడింది బుద్ధి. ఫోటోగ్రఫీ మీదికి పోయింది మనసు. తమ్ముళ్ళను కూర్చోబెట్టి ప్రబంధాలు చదివి బోధ పరుస్తూ వుండేవాడు. వాళ్ళనే కూర్చోబెట్టి ఫోటోగ్రఫిలో రక రకాల ప్రయో గాలూ చేసేవాడు. సినిమాలు చూసి తనూ కామెరామెన్ కావాలని కలలు కనేవాడు. తాసీల్దారుగారు రెండిటినీ ఆమోదించలేదు. పాఠాలు చదూ అన్నారు. కుర్రవాడు అది ఆమోదించలేదు. "ఆ చదువు ఇంకొద్దు, బొంబాయి వెళ్తాను" అన్నాడు ధైర్యంగా.

బొంబాయిలో సినిమాటోగ్రఫీ కోర్సు చదివితే సినిమాలు తియ్యా వచ్చునని ఎవరో చెప్పారు.

"నీకేం మతి పోయిందా" అన్నాడు తండ్రి. "ఒద్దు నాయనా... అన్నారు తల్లి రాజ లక్ష్మమ్మగారు.

సుబ్బారావులో "ఆదుర్తి" సై అన్నాడు. సుబ్బారావు తండ్రి మాట కాదన్నాడు.

"నేను వెళతానండి. నాకు దాని మీదనే నమ్మకం వుంది. మీరింకోటి చెప్పించినా రాదు" అన్నాడు ఖచ్చితంగా.

తాసిల్దారుగారిది అంతా ఖచ్చితమైన పద్ధతి.

"ఈ జిల్లాలో అందరూ నా మాట మన్నిస్తారు. ఇన్నాళ్ళకి నువ్వు కాదన్నావు. సరే వెళ్ళు..." అంటూ ఆయన ఆస్తి వాటా వేశారు.

స్వార్జితం అలా వుంచి, పిత్రార్జితంలో అతని వాటా మాత్రమే ఇచ్చారు. ఇంట్లో ఇంకా ఏడుగురు పిల్లలున్నారు. వాళ్ళ భవిష్యత్తు నేను చూసుకోవాలి. నీ భవిష్యం నీ చేతుల్లోకి తీసుకున్నావు వెళ్లు" అన్నారాయన.

'ఆదుర్తి'—, సుబ్బారావుని వెంటబెట్టుకొని బొంబాయి వెళ్ళిపోయాడు.

అతని వాటా ఆస్తిని మళ్ళీ ఎక్కడో అయినకాడికి తెగనమ్మకుండా, అది తన దగ్గరే తాకట్టేసుకుని, రెండువేల నగదు యిచ్చి పంపారు. సుబ్బారావు బొంబాయి వెళ్ళి సెంట్ జేవియర్ కాలేజ్ ఆఫ్ సినిమా టోగ్రఫీలో చేరాడు. మూడేళ్ళు కోర్సు అన్నారు. ఊహలో సినిమా వ్యాకరణం దాకా వెళ్ళిన బుర్రకి ఈ బళ్ళో ఓనమాలు దగ్గర ఆరంభించడం ఇది మూడేళ్లు సాగడం నచ్చలేదు.

"ఇక్కడొద్దులేవోయ్ ఏదేనా స్టుడియోలోకి పోదాం" అన్నాడు ఆదుర్తి.

"సరే పద" అన్నాడు శిష్యుడు సుబ్బారావు.

ఆ తరువాత నిజమైన విద్యాభ్యాసం ఆరంభమైంది. జీవితం ఆరంభమైంది. సంగ్రామం ఆరంభమైంది. సుఖజీవితంలో కష్టాల పోపు వేస్తే వుండే మజా తెలిసింది. ఆకలి తెలిసింది. అవమానం తెలిసింది. ఆశల అంచులు కనిపించాయి. నిరాశల ఆటంకాలు తగిలాయి.

"సారీ బ్రదర్" అన్నాడు ఆదుర్తి.

"ఇట్సాల్ రైట్" అన్నాడు సుబ్బారావు నీరసాన్ని. చిరునవ్వుగా పరిమార్చి,

"ఇంకొంచెం గట్టిగా నవ్వు. ఎవడో వస్తున్నాడు. ఈలపాట పాడు. నమస్కారం చెయ్యి" అన్నాడు ఆదుర్తి.

"నాకా డ్రిల్లు మాత్రం చెప్పకు. చిరాకు. నీకేం— ఆశలు భోంచేస్తావు. ఇక్కడ నాకు సోషొస్తోంది." అన్నాడు సుబ్బారావు.

"ఆదుర్తి"కిది వినబడలేదు. దీనానార్వేకర్‌గారు, ఎడిటింగ్ గురించి ఏదో సూత్రాలు చెప్తూంటే వింటున్నాడు.

ఎడిటింగ్ టేబుల్ దగ్గరకు చేరడానికి ముందు కొన్నాళ్ళపాటు ఆదుర్తి కెమెరా డిపార్టుమెంటులో అసిస్టెంటుగా పనిచేశాడు. "రామ రాజ్య"లో కొన్నాళ్ళు పని చేశాడు. కామెరా కాదు; ట్రాలీని ముట్టుకున్నా, పెద్దలు కోంబడే రోజులు. ఆదుర్తికి బోరుకొట్టింది. "ఇక్కడస ల్లాభం లేదు" అన్నాడు.

"సుబ్భరంగా నాన్నగారి మాట విని యింట దగ్గరుండిపోతే..." అని గొణుక్కున్నాడు సుబ్బారావు.

"ఛఛ! వొద్దు..." అన్నాడు ఆదుర్తి.

తిరిగి ప్రాసెసింగ్, ప్రింటింగ్, చాలా గొప్ప విద్యలని ఎవరో చెప్పారు. బాంబే ఫిలిం లాబ్‌లో చేరాడు ఆదుర్తి.

కొన్నాళ్ళ తరవాత, ఒక శ్రేయోభిలాషి హితవు చెప్పాడు. 'ఇక్కడెందుగ్గాని, ఎడిటింగ్ నేర్చుకో. వృద్ధి కొస్తావు" అని.

నెలకి పాతిక రూపాయలు జీతం మీద, ఎడిటింగ్ శాఖలో దీనానార్వేకర్‌గారి దగ్గర అసిస్టెంటుగాచేరి పని నేర్చుకున్నాడు ఆదుర్తి.

ఇంతకాలమూ, అతనికోసం సుబ్బారావు చాలా అవస్థలు పడ్డాడు 'ఆదుర్తి' విద్య నేర్చుకోవాలంటే సుబ్బారావు ఎలాగో అలా తిని తిరిగే శక్తి గడించుకోవాలి. చపాతీలు, బటాణీలు, వేరుశెనకాయలు, ప్రశస్తమైన మంచి నీళ్ళు...

ఇంటికి డబ్బుకోసం రాసేవాడు అప్పుడప్పుడు.


చక్కా చిలకా గోరింకల్లాటి సమ్మంధం!
అబ్బాయి తండ్రి ప్రొడ్యూసరు -
అమ్మాయి తండ్రి డిస్ట్రిబ్యూటరు!


న్యాయం ధర్మం వర్ధిల్లాలని లేడీ లాయర్లు
డ్యాన్సు చేసే మహిళా ప్రబోధాత్మక సన్నివేశం -
న్యాయదేవత కాస్ట్యూంలో కళ్లగ్గంతల బదులు
నా పెళ్లి కోసం మేడమ్ గారే చిన్నమార్పు చేశారు

సమానమైన ప్రేమ ఉండడంవల్లనూ, ఇందులో పెద్దలకు బుద్ధిచెప్పేది స్వయానా వారి బిడ్డలే కావడంవల్లనూ, పెద్దల మనసులు నొవ్వకుండా సున్నితంగా ఆ పని చేయవలసి వచ్చింది. దండనార్హమైన అకార్యాలకు పాల్పడిన ఋణాన్న ఖుక్కు రామదాసుగారు, ఈ విధమైన సదుపాయంచేసి తనకు దండనేకాక చివాట్లుకూడా తప్పించినందుకు పిల్లలను అభినందించాడు.

ఈ విధంగా ఎక్కడా దిగులు లేకుండా ప్రహసనం పద్ధతిల ఆడుతూ పాడుతూ (రాజేశ్వరరావుగారి వరసలలో), సాగిపోయే ఈ చిత్రంలో నటీనటులందరూ యథోచితంగా తమ పాత్రలు నిర్వహించారు. సంగీతం జనరంజకంగా, పూర్వపు విజయచిత్రాల స్థాయిలో తరహాలో హాయిగా ఉంది.

ఘంటసాల, రాజా, లీల పాడిన 'త్రిగళ గీతం' రచన, సంగీత రచన, ప్రకటన కూడా ఆహ్లాదకరంగా కుదిరాయి. సరోజ గేవా కలర్ నృత్యం ఒకటి ఈ చిత్రంలో విశేషం. ఒక విషాదగాధ ఆలంబనంగా రూపొందించిన ఈ నృత్యానికి సెట్ చాలా బాగుంది. అలాగే రామారావు కన్న పౌరాణిక స్వప్నం 'దమయంతి స్వయంవరం' కూడా బాగుంది. విజయవారి పూర్వ చిత్రాల స్థాయిలో అన్నివిధాలా చేరుతుందనిపించకపోయినా, అనేక విధాల ఈ కొత్త ప్రయత్నం అభినందనీయం.◆

చక్రపాణి పింగళి 1959





# స్వరలహరి



## నౌషద్

ఆధునిక భారతీయ చలనచిత్ర సంగీత చరిత్రలో దాదాపు ప్రతి అధ్యాయానికీ మొదటి వాక్యంలో ఉండతగ్గ పేరు నౌషద్ అనడం అతిశయోక్తి కాదు.

నౌషద్ చేసిన పాట, అచ్చు నౌషద్ చేసిన పాటలాగే నిండుగా, తీవిగా లోతుగా ఉంటుంది. అందులో మధుర శిల్పాల నైపుణ్యం, నైగనిగ్యం ఉంటాయి. మహాకవి వాక్యంలా అర్థపుష్టి ఉంటుంది. ప్రబంధనాయిక అంగసౌష్ఠవం ఉంటుంది. త్రికాలాలలో త్రిలోకాలలో విహరించివచ్చే ఖాన్‌సాహెబ్ కంఠస్వరవిన్యాసాల తీవి, సొగసు, లతా స్పృశించగల స్వరదిగంతాల దూరం, సైగల్‌పాట మార్దవం నౌషద్ సంగీత రచనాశిల్పంలో స్ఫురిస్తాయి.

గాయకుల పరిభాష ప్రకారం ప్లానింగ్ కమీషన్ వారికి పదింతలైనా "ప్లానింగ్" ఉంటుంది.

ఈనాటి సంగీత రచనా రీతులలో, స్వర కల్పనా శిల్పంలో వాద్య సమ్మేళనంలో, ప్రయోగంలో నౌషద్ చేసిన వాటిలో ఏదో ఒకటి ఎక్కడో అక్కడ కనబడితే కనబడవచ్చుగాని, ఆయన చేయనిది కనబడదు. ఒక చిత్రంలో అన్ని పాటలూ జనరంజకాలు కావటం ఆయనతోనే ఆరంభమైంది. ఫ్లూటూ క్లారినెట్ కలిపి, సితార్ మాండలిన్‌లు కలిపి అందమైన బహువ్రీహి సమాసాలు సృష్టించినది ఆయనే. అకార్డియన్, బీన్ మొదలైన పాశ్చాత్య వాద్యాలను సినిమాలో ప్రవేశపెట్టినవా డాయనే. సింఫనీ సంగీతాన్ని భారతీయ సంగీత భాషలోకి గొప్పగా, అందరికీ అర్థమై హాయి గొలిపేటంత నిండుగా అనువదించినవాడు ఆయనే. ఎప్పుడూ మార్పులుచేసే వాడు ఆయనే. శాస్త్రీయ రాగాలను కల్తీ లేకుండా శుద్ధ స్వరాలలోనే సులభ శైలలో వరసలుకట్టి మధుర స్వర సరోవరం నిర్మించినవాడు ఆయనే. అందులో ఇంగ్లీషు కెరటాలు లేపినవాడూ ఆయనే. ఇన్ని పనులు చేసిన నౌషద్ సీమ బాణీలను అనుసరించడంలో కూడా వెనకబడలేదు. అయితే ఈ విద్యలో రామచంద్రాలు, నయ్యర్‌లు మొదలైన వారితో పోటీచేసి ప్రథమ బహుమతి అందుకోలేదు.

కాని సినిమా సంగీతానికి ఒక స్థాయిని గౌరవ స్థానాన్ని కల్పించడానికి కృషి చేసిన పెద్దలలో నౌషద్‌కు సర్వదా గౌరవనీయమయిన ప్రముఖస్థానం ఉండి తీరుతుంది.

నౌషద్ శకానికి పూర్వం ఉజ్జ్వలంగా వెలిగి నేటికీ పూజనీయమయిన స్థానంలో నిలిచిన వారిలో ఘులాం హైదర్, ఖేమ్‌చంద్ ప్రకాష్, శ్యామ్‌సుందర్‌లను చెప్పుకోవాలి. ఖజాంచీ, హుమాయూన్ వంటి చిత్రాలలో ఘులాం హైదర్ చేసిన పాటలు ఇప్పుడూ ఎప్పుడూ కూడా బాగుంటూనే ఉంటాయి. సినిమా సంగీతంలో, (ఇటీవల బాగా ప్రచారంలోకి వచ్చిన) పంజాబీ జానపదగీత రీతులను ప్రవేశపెట్టిన వాడు ఈయనే. ఢోలక్ ఈయన కానుకే.

నౌషద్ ఈయనదగ్గర శుశ్రూష చేశాడు. చేసి గురువంత శిష్యుడై సినిమా సంగీతాన్ని నవరాగ తాళాలతో అలంకరించాడు.

బేరీజులు వేస్తే, నిజానికి, నౌషద్ పనిచేసిన చిత్రాలు మిగతా వారి కన్న తక్కువ ఉంటాయి. ఘులాం హైదర్, ఖేమ్‌రాజ్ జీ, రామచంద్రలు పది నిముషాలలో ఒక పాటకి వరస కడితే, నౌషద్ పదిహేనురోజులు తీసుకుంటాడు. అందుకే అందరూ సాలుకు పది చిత్రాలకు పనిచేస్తే నౌషద్ ఒకటి రెండింటికి మాత్రం చేస్తాడు. అలా చప్పున పని చెయ్యడం చాలా తప్పు అనటం లేదు కాని, ఇలా స్థిమితంగా, ప్రతి స్వరాన్నీ ప్రతి స్వరం ముందూ వెనకా ఉంచి పరీక్షించి నిగ్గు తేల్చి, జాగ్రత్తగా కాశ్మీరీశిల్పిలా నగిషీలు చెక్కడం ఒక ప్రత్యేకత. అందుకే ఉపమానాలు వెతికితేవడం కష్టమైన వాటిలో నౌషద్ పాట చేరుతుం దనిపించుకుంది.

"నౌషద్ శిల్పం, ఆయన పాటల స్నిగ్ధత్వం నిరుపమానమైనవి" అని ఒక సందర్భంలో లతామంగేష్కర్ జోహార్లు అర్పించింది.

సత్యాన్వేషికి సమాధానం ఏమిటని గణితశాస్త్రజ్ఞుడిని అడిగితే "స్క్వేర్ రూట్ ఆఫ్ మైనస్ వన్" అంటాడు. నౌషద్‌ను అడిగితే సప్త స్వరాలను అడగమంటాడు. అది ఆయన తపస్సు.

కష్టపడి చిత్తశుద్ధితో చేసినపని నిష్ఫలం కాదన్న నినాదానికి బలం చేకూర్చింది నౌషద్ కథ. అంతవరకూ సినిమాలలో ఒకటి అర పాటలు జనంనోట వినబడేవి. నౌషద్, 'రత్తన్' చిత్రంతో భారతీయ ప్రేక్షకుల శ్రోతలహృదయాలను సంగీతంతో నింపి వేశాడు. నాటి నుండి ఒక చిత్రంలోని పాటలన్నీ ప్రజాదరణ పొంది చిత్రవిజయానికి కూడా దోహదం చేయడం ఆరంభమయింది. అదే,చిత్రాలలో సంగీతం ప్రాముఖ్యాన్ని పెంచింది. 'రత్తన్'లో పాటలు, పాట రానివాళ్ళకి కూడా పాడాలనిపించేటంత సులభంగానూ సుఖంగానూ పాట వచ్చిన వాళ్ళు మెచ్చుకునేటంత అందంగానూ కూడా వుంటాయి. ఆ పద్ధతిలో కొంతకాలం పాటలు చేశాక నౌషద్ మళ్ళీ కొత్త పద్ధతి, కొత్త వరవడి దిద్దుకున్నాడు. పద్ధతి మార్చడం నౌషద్ పద్ధతులలో ముఖ్యమైనదని ఆయనను ఎరిగినవారంతా కూడా అంటారు. అయినా సంగీతాన్నిబట్టి ఆయనను అర్థం చేసుకునేవారికి కాలాన్ని శ్రోతల అభిరుచినిబట్టి నౌషద్ కొత్త పద్ధతులు ఆరంభిస్తాడా, ఆయన కొత్తపద్ధతి ఆరంభించడంతో కొత్తకాలం, కొత్తఅభిరుచి ఆరంభమవుతాయా అన్నది సమస్య.


నేడే చూడండి!
ఆ పిల్లది మావూరే!
ఒంటిమీద నూలుపోగులేనప్పుడు
ఎరుగుదును!


పోనీ మీరొక్కరూ
వెళ్లిరండి సినిమాకి.
ఆనకొచ్చి కథ
చెబుదురుగాని-

ఈ మార్పులు క్రమంగా సినిమాలో ఫేడింగ్ షాట్‌లలా, ఒక దానిలో ఒకటి కరిగిపోతాయి. వీణమీద స్వరాలలా పాత పద్ధతి కొత్త దానిమీదకి సాగిపోతుంది. 'శారద' 'స్టేషన్ మాస్టర్' చిత్రాల నుండి 'రత్తన్' వరకూ స్థూలంగా ఒక ఘట్టం. ఆ తర్వాత కొద్దిగా మార్పులు వచ్చాయి. అనోఖీ ఆదా తరవాత పద్ధతి పూర్తిగా మారిపోయింది.

రత్తన్‌లో పాటలరూపం అప్పటికి చాలా కొత్తది. పల్లవి, దానికి సరిపడే బరువుతో ఆర్కెస్ట్రా, ఆ తరవాత చరణం, మళ్ళీ అంత పొడుగునా ఆర్కెస్ట్రా, తిరిగి మాట వరసమారి (పాటవరస అంతే,) చరణం ఇలా వచ్చేవి. ఈ పాటలు సంచలనం కలిగించాయి. మిగతా వాళ్ళు చాలమంది నౌషద్ పద్ధతిని హఠ మార్చేశారు. పల్లవి నౌషద్ పెట్టినంత పొడుగుగా పెట్టేవాళ్ళు అరుదు. అన్మోల్‌ఘడీలో సురయా పాడిన సోజా క్యా, దిల్లగీలో శ్యామ్, సురయాలు కలసి పాడిన 'తూ మేరీచాంద్, మై తేరీచాందినీ', షాజహాన్‌లో సైగల్ మధురస్వరం విని పించిన 'గమ్‌దియే ముశ్కిల్...' నజీంఅక్తర్ పాడిన 'ఆగ్ లగీ' ఈ కోవకి చెందినవి. ఈ పాటలు వింటున్నపుడు ఉవ్వెత్తున లేచిన కెరటంమీద కూర్చొని అది ఎక్కడ ఆగుతుందో కూడా తెలీయకుండా వెళ్ళిపోతున్నట్టనిపిస్తుంది. 'గమ్‌దియే' లో కొద్దిపాటి మంద్రస్వరాలతో వరసను కట్టి వివరించాడు నౌషద్. 'ఆన్' లో పాటల రచనాశిల్పం ప్రత్యేకించి చెప్పుకోవలసినది. రెండు మూడు స్వరాలనే కలియబోసి విసుగెత్తకుండా వరసలుకట్టి దాదాపు నూటిబాట మీద—పొడుగుపాటి పల్లవులు కట్టాడాయన.

స్వరవిన్యాసానికి చెప్పుకోవలసినది అందాజ్ చిత్రంలో ముఖేష్ పాడిన 'తోడ్‌దియా దిల్ మెరా..' ఇందులో స్వరాలూ అనుస్వరాలూ మొత్తం పదహారింటినీ రచయిత స్పృశించాడు. కేవలం ముట్టుకుని చక్కారావడమేకాక, వాటిలో ప్రతి స్వరాన్నీ సార్థకంగా ప్రయో గించాడు. అన్నివిధాలా ఉత్తమం అనదగ్గ పాట ఇది (ఆల్ రౌండ్ మాస్టర్ పీస్) అని లతా దీనిని అభివర్ణించి మెచ్చుకుంది. ఇదీ ఇలా టివీ వింటూన్న కొద్దీ కొత్త అందాలు స్ఫురిస్తాయి. కొత్తరంగులు కని పిస్తాయి. ఈ పాటతోటే ముఖేష్ ఒక్కసారిగా తారాపథాన్ని అందు కున్నాడు.

అనోఖి అదా వరకూ-నాటక్, దిల్లగీ, దాస్తాన్, అందాజ్, దర్ద్ వంటి చిత్రాలలో అనేకరకాల ప్రయోగాలు చేస్తూ త్రిస్థాయిలా షంషాద్, ముఖేష్, రఫీ, లతాల కంఠాలతో విహరిస్తూ సినిమా సంగీతానికి అపూర్వమైన ప్రజాదరణను సంపాదించి పెట్టాడు.

దీదార్‌లో రఫీపాట మేరీకహానీ, దులారీలో రఫీ, లతా పాడిన సుహానీరాత్, జాదూలోని ప్యార్ కె సాగర్ సే (రఫీ), అనోఖి అదాలో భూల్‌గయా సావరియాం (లతా) ఎవరూ మరచిపోలేరు. సంగీత ప్రియులకు ఈ పాటలలో వాద్యాల ఉపశ్రుతులు కూడా కంఠతా వచ్చు. అసలు ఏ సంగీత దర్శకుడికైనా, ఆర్కెస్ట్రాలో అపారమైన ప్రతిభచూపే అవకాశం ఉంటుంది. పాటకి యతులు, ప్రతులు, ఉపశ్రుతులు, 'సమానాంతరాలంకారాలు', రూపకాలు, విశేషణాలు, అర్థవివరణలూ, కారికలూ అన్నీ ఈ వాద్యాలలో పొందుపరచవచ్చు. పాటలో సాహిత్యాన్ని, అందులోని భావాన్ని రాగరేఖలలో చిత్రించ వచ్చు. వర్ణచిత్రాలు స్ఫురింపచేయవచ్చు. ఇవి, ఇంకా మరెన్నో ఇలా చేయవచ్చునని నౌషద్ కాంపోజిషన్‌లు విన్న మీదటనే బాగా తెలియవచ్చింది. ఆయన ఆర్కెస్ట్రాలో 60 వాద్యాలనుంచి (కొత్త చిత్రం 'మొగలే అజామ్' కోసం) 200 వాద్యాల వరకూ ఉంటూ ఉంటాయి. ఇరవై వయొలిన్‌లు చెప్పగల సంగతిని ఆరు వయొలిన్లతో చెప్పించడం అయనకు గిట్టదు. 19 తో సరిపెట్టవచ్చునేమో అని అనుమానించేందుకు కూడా వీలులేనంతగా ఆయన వాటిని ప్రయో గిస్తాడు. పాశ్చాత్య వాద్యాలన్నిటి గురించి నౌషద్ తెలుసుకున్నాడు.

సింఫనీని చాలా సమర్థంగా కల్పించి నడపడం అభ్యసించాడు. 'నాటక్' చిత్రంలో ఉమాదేవి (ఇప్పటి హాస్యనటి తున్‌తున్) పాడిన 'దిల్ వాలె' ఆంగ్లేయ విధానంలో చేసిన పాటల్లో చాలా మంచిది.

కేవలంవాద్య సంగీతం (పాటలేకాకుండా) కూడా నౌషద్ మాజిక్ వాండ్‌లోంచి వస్తే శ్రోతలను మంత్రముగ్ధుల్ని చేయగలదు. దులారీచిత్రంలో టైటిల్ మ్యూజిక్ రికార్డు ఆ రకం వాట్ అమ్మకంలో రికార్డులన్నీ చితగ్గొట్టేసి కొత్తరికార్డు పెట్టింది. అలాగే దాస్తాన్, మేలా చిత్రాలలో కథావస్తువును ఉద్ఘోషించే వాద్య సంగీతం రికార్డులు విశేష

ప్రజాదరణ పొందాయి. మేలాలో 'ధర్తీకో ఆకాష్ పుకారే' అన్న వాక్యాన్ని ఆయన వాద్యసంగీతంలోకి అనువదించినవుడు అంత పనీ జరుగుతుందనిపించి గుండె ఝల్లుమంటుంది. ఏ పాటచేసినా ముందర అదంతా విని అందులోని ఈ పాటవచ్చే సన్నివేశం అక్కడి పాత్రల స్థితిగతులూ కుణ్ణంగా తెలుసుకుని, ఆ పైననే ఆయన రచనకి ఉపక్రమిస్తారు. అందువల్లనే ఆలస్యం, అద్భుతమైన సంగీతం సంభవిస్తాయి. అందువల్లనే ఆయన పాటలు కొన్ని ఆపాతమధురాలు కాకపోయినా, అన్నీ విధిగా 'ఆలోచనా మృతం' అనిపిస్తాయి. అయితే ఇంత ఆలోచించి పనిచేసి, ఆ సందర్భం పాటకు యోగ్యమని తనకు అనిపిస్తేనే పాటనుకూర్చే స్వాతంత్ర్యం సంపాదించి, ఇంత ఆలోచించి పనిచేసే నౌషద్, 'మదరిండియా' చిత్రంలో "నగరీ నగరీ ద్వారే ద్వారే" అనే పాటను సందర్భశుద్ధిని వెయ్యికళ్లతో పరిశీలించి మరీ పెట్టారని అనుకోము. ఇది చిన్న అపశ్రుతి. మదరిండియాలో పాటలన్నీ నిండుగా, అర్థంచేసుకొన్న కొద్దీ చవులూరేవిగా ఉన్నాయి. ఆర్కెస్ట్రా పేరు చెప్పి, చెప్పుకోవలసిన చిత్రం, మరొకటి ఉంది. ఉరన్ కతోలా. 'నదియాధరీ బహు' అనే పాటలో స్వరకల్పన, నది ఎంత మెల్లిగా నిండుగా ప్రవహిస్తోందో వర్ణించింది. దానికి నేపథ్యంలో వాద్యాలుగా మానవ కంఠ స్వరాలనే ఉపయోగించి ఒక మంచి ప్రయోగంచేశారు. ఈ చిత్రంలోనే, టైటిల్ మ్యూజిక్‌కు ఆయన చేసిన ఆర్కెస్ట్రేషన్ (ఇది నౌషద్ స్వంతంగా నిర్మించిన చిత్రం) ఆయన అభిమానులకు కూడా బాధ కలిగించింది.

ఇది సన్మాన పత్రాలలో పేర్కొనవలసిన అంశం ఎంత మాత్రం కాదు.

ఈ ఉరన్ కతోలా చిత్రంలోనే శాస్త్రీయమైన సంగీతం కూడా వినిపించారు. మొహబత్ కె రాహెూమే (రఫీ) అనే అపాట నౌషద్ రచనలలో చాలా గొప్పది. సినిమా సంగీత రచయితలు సాధారణంగా రెండేసి మూడేసి రాగాలను కలిపి పాటలుచేస్తారు కొందరు ప్రజ్ఞానిధులు ఒక రాగం అనుకుని చేస్తూఉంటే, వాళ్ళకి తెలీకుండానే అది ఇంకోదాంట్లోకి జారిపోవడం వేరేసంగతి. రాగాలను మేళవించి ఎన్నో పాటలు చేసిన నౌషద్, కొన్ని చిత్రాలలో శుద్ధమైన రాగాలను

యథాతథంగానే వాడి, ప్రయోగం తెలిస్తే దేనినైనా ప్రజలాదరిస్తారన్న మాటను ఋజువు చేశారు. బైజుబావ్రాలో పాటలన్నీ అలాటివే. (అందులో 'హరిఓం' ను మొదట ఖాన్‌సాహెబ్ బడేగులామాలీఖాన్ చేత పాడించాలనుకున్నారు.) లతా, రఫీ పాడిన 'ఝూలేమే పవన్‌కీ ఆయా బహార్' మరొకటి. ఇది పీలూ రాగంలో చేసినది. సాధారణంగా ఈ రాగాన్ని బాధ పలకడానికి ఉపయోగిస్తారు. నౌషద్ దీనిని ప్రేమగీతానికి మనోహరంగా తొడిగాడు. షబాబ్‌లో రఫీ 'అయేనబాలమ్' జయజయ వంతి రాగానికి లలితానువాదం. షబాబ్‌లో పాటలన్నీ ఈ శ్రేణి లోనివే. లతా పాడిన 'మర్ నా తెరీ గలీమే' మరపురాని పాట. ఇటీవలి 'సోనీ మహివాల్' చిత్రంలో కూడా అన్నీ శాస్త్రీయమైన వరసలే చేశారు. ఇందులో మహేంద్రకపూర్ అనే కొత్త గాయకుడిని నౌషద్ పరిచయం చేశారు-

నౌషద్ సృజనాత్మక ప్రతిభగల విద్వాంసుడు. కళ పరిణామ శీలమైనదని గుర్తించి, వ్యాపారపు వత్తిడినిబట్టి వ్యవహరించకుండా ఉండగల వివేకి. సంగీతం ఆయనకి సర్వమూ అని నమ్మి అందు లోంచి తీసి ఇవ్వదగ్గ సర్వస్వాన్నీ తీసుకోడానికి నిరంతరం కృషిచేసే కళారాధకుడు. ఈ ప్రయత్నంలో ఆయన భారతీయ చలనచిత్ర సంగీతాన్ని ఎన్నో కొత్త మార్గాలలో నడిపారు. ఎన్నో వరవడులు పెట్టారు. అందుచేతనే ఆధునిక చలనచిత్ర సంగీత చరిత్రలో ప్రతి అధ్యాయానికి మొదటి వాక్యంలో నౌషద్ పేరు కనబడుతుంది.◆

---

**భగవంతుని సృష్టిలోనే తేడాలున్నాయి. పొట్టి పొడుగు, లావు సన్నం, ఆడ మొగ — అందాక ఎందుకు-**
**భగవంతుళ్ళలోనే అంతస్తులున్నాయి. పెద్ద కొండ మీద కెళ్తే పదిరూపాయలేస్తారు. చిన్న కొండమీద కెళ్తే పది పైసలేస్తారు.**

**—అందాలరాముడు**

# చెత్తేర్ చెదారేర్



అనగనగా ఒక మదరాసీ నిర్మాత. అందువల్ల అతను బెంగాలీ కథ కావాలనుకున్నాడు. అందువల్ల కలకత్తా వెళ్లాడు బోలెడు డబ్బు పెట్టుకుని జోలెడు కథలు కొనాలని. తెలుగూ మదరాసీ అంటే బావుండ దని బొంగాలీబాబు డాబు తొడుక్కుని అషాబోషో అంటూ, మద్రాసీ కథలు చెత్తేర్ చెదారేర్ అనుకుంటూ వెళ్లాడు. ఒక హొటలుకెళ్లి బసకి రేటెంత అన్నాడు. 'ఏవుంది సార్ మీ ఫీల్డులో తెలుగుకథ కిచ్చేటంత' అన్నాడు మానేజర్. ఓస్ ఇంతేనా అయితే గొప్ప హొటలు కెళ్తా నన్నాడు నిర్మాత. అంతలోనే ఆశ్చర్యపడి లేచి మొహం కడుక్కుని టీ తాగి తందనాలాడి పాడి, సార్ మీరు గొడ్డుతెలుగు మాట్లాడుతున్నారే. మీరు తెలుగూసా! అన్నాడు. యస్సార్. అవునుగాని ఏవిటి సార్ వాళ్ళంతా కలకటామీద పడుతున్నారు. ఈ పాటి మనవాళ్ళు రాయ లేరండీ అన్నాడు. ఆ మనవాళ్ళట్టి వెధవాయలోయ్ అన్నాడు నిర్మాత. ఈ మాట నిర్మాతలనే అన్నాడని అపోహ పడబోయి ఆపుకుని బహుశా కథకులనే అయివుంటుందని సమాధాన పరచుకుని వూరుకున్నాడు మానేజరు.

ఆ తర్వాత నిర్మాత ఎక్కడికి వెళ్ళినా ఇదే వరస అయింది. కొంపతీసి కలకటా అనుకుని విశాఖపట్నంలోనో, విజినారంలోనో దింపెయ్యలేదుకదా రైలువాడు అని భయపడ్డాడు. కారణం ఊరంతా మదరాసీలే. బెంగాలీలు ఒకటీ, అరా తగుల్తున్నారు. అలా తగిలిన వాళ్ళలో ఒక చక్కని చిన్నది గిరుక్కున వెనుదిరిగి చురు క్కున చూసి ఇడియట్! కళ్ళు కనబళ్ళేదా? అంది. అరె, మీరు కూడా తెలుగూనేనా? అన్నాడు నిర్మాత కళ్ళు విప్పార్చి. అఫ్‌కోర్సు కాదు. మా నాన్న బెంగాలీ ప్రొడ్యూసరు. మా యింటికి కథలకోసం మదరాసీలు వస్తారు. వాళ్ళమాటలు వినగా వినగా తెలుగు తగులు కుంది. బట్ ఇటీజ్ స్వీట్ లాంగ్వేజ్. ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్ అంటారుటగా. దేశ భాషలందు తెలుగు లెస్సంటారుగా. తెలుగు చాలా తియ్యనిభాష అందా చిన్నది తియ్యగా. ఆ అమ్మాయి డైలాగులో మొదటివాక్యం విని నిశ్చేష్టుడైపోయిన నిర్మాత చేష్టుడై సిగ్గుపడి, మా మొహం, మీ ముందు మా యిదెంత, అసలు మా వాళ్ళందరికీ బెంగాలీ అంటేనే యిష్టం తెలుసక్కన్న. ఐ లవ్ శరత్ ఐ లవ్ ఆల్ బెంగాలీ హిట్ పిక్చర్స్. ఐ లవ్ బెంగాలీస్, ఐ లవ్ యు. మీ కళ్ళు బెంగాలీ హిట్‌లో డైలాగుల్లా మెరుస్తున్నాయి. మీ యవ్వనం బెంగాలీ హిట్ కథలా బింకంగా వుంది. మీ జుట్టు బెంగాలీ హిట్ కథలా పొట్టిగా వుంది. దీనికి తెలుగుసవరం కలిపి సరోజాదేవి జఘ నాల వరకూ జడల్లి అరవపూలు తురిమితే అయ్యబాబోయ్ నే చెప్ప లేను అన్నాడు నిర్మాత. ఈ ముఖస్తుతితో ఆ చిన్నదాని గుండె ఝల్లు మంది. హఠాత్తుగా ఆ యువకుడికి హృదయం సమర్పించింది. అయింది తనంది పుచ్చుకుందామనేవరకూ సదరు హృదయం తన లోనే ఉన్నట్లు గమనించి సిగ్గుపడి పైట సవరించుకుని, చాలు కొంచెం అసింటా కూర్చోండి నాన్నొస్తున్నాడు అంది. నాన్నగారొస్తూనే ముక్కు పుటాలెగరేస్తూ, "ఎవరక్కడ, ఇక్కడ తెలుగుప్రొడ్యూసరు ఉన్నాడు ఎవరూ?" అన్నాడు.

"నేను కాదు నాన్నా" అంది అమ్మాయి. తండ్రి, నిర్మాత వంక చూశాడు. "ఆయన కూడా కాదు. ఆయన మనవాడే. ఘెంకటరావు. తెలుగువాళ్ళు మన కథలతో పిక్చర్లు తీసి బాగుపడిపోతున్నారన్న దీనితో ఆయనే అక్కడకెళ్ళి తీదామని చూస్తున్నారు అంది అమ్మాయి.

ఖెంకటరావు సిగ్గుపడి ముడుచుకుపోయాడు.

అయితే రండి అని గర్భగుడిలోకి తీసుకెళ్ళి ఐదారు హిట్‌లు చూపించాడాయన.

ఐదారూ నాకిచ్చెయ్యండి అన్నాడు నిర్మాత. అన్నీ మీకెందుకు ఒకటేగా తీస్తారు అన్నాడు బూషోబాబు. చిత్రం, సాయింత్రం మెయిలుకి మళ్ళీ ఓ బోగీడు జనం వస్తున్నారు. కాంపిటీషను, నాలుగు నా కంట్రోల్లో వుంటే...

ఆ మాటొద్దు. ఇక్కడ కంట్రోలయ్యే ఒకాయన ఉన్నాడు. మదరాసీయే. ఎవరికొక్కవలసినా ఆయన ద్వారా రావాలి. ఆయన ఇక్కడ టోకు రాక్షసుడు. అసలు మీకివి చూపించడమే నేరం. ఆయనకి తెలిస్తే కొంప మునుగుతుంది. అమ్మడం అసలు వల్ల కాదు...

నిర్మాత, ప్రియురాలి వంక దీనంగా చూచాడు. ఆమెలో ఉన్న అతని హృదయం గొల్లున ఘోషించింది.

పితాజీ అంది బెంగాలీలో.

యే ఖాన్‌దాన్‌కీ ఇజ్జత్ అని నాలిక కరచుకొని, క్యా మేరీ బేటీ అన్నాడాయన. అమ్మాయి సిగ్గుతో నవ్వి, నిర్మాత పాణిని గ్రహించింది. ఇయం సీతా మమ సుతా అనుకుని తండ్రి పొంగిపోయాడు. నీ మనసుని కాదంటానామ్మా. తప్పకుండా. నువ్వతన్ని పెళ్ళాడితే ఒక టేమిటి ఐదారు పిక్చర్లూ అతనికే అమ్మేస్తాను అన్నాడు తండ్రి ఉదారంగా.

నిర్మాత ఎగిరి గంతు వేశాడు.

మర్నాడు కలకత్తాలోని తెలుగు నిర్మాతలందరికీ పార్టీ ఇచ్చాడు. వాళ్ళూ సన్మాన సభ జరిపారు.

నాదే అదృష్టమంటే, జన్మ ధన్యమైంది. ఏకదమున ఐదారు హిట్ పిక్చర్లు దొరికాయి అన్నాడు నిర్మాత, ఉత్సాహంగా, గర్వంగా.

ఆ మాట వినగానే అమ్మాయి గుండె గుభేలుమంది. ప్రాణం నీరుగారిపోయింది. అయితే...అయితే...నువ్వు నన్ను ప్రేమించడం లేదు. మా నాన్న దగ్గిరున్న పిక్చర్ల కథలకోసం నాకు మనసిచ్చి

పెళ్ళాడతానన్నావు అంతే అంది కిటికీలోంచి బయటికి చూస్తూ. కిటికీ తలుపు మూసివున్నందువల్ల, గొళ్ళాలు ఓ పట్టాన ఊడి రానందువల్ల వెనక్కి తిరిగింది కోపంగా.

నిర్మాత కిటికీ మీద కోపంకూడా తనమీదే అనుకుని ఆమెకెంతో నచ్చచెప్పాడు. నేను నిన్ను నిజంగా ప్రేమిస్తున్నాను. కథల రైట్సు కోసం కాక నీకోసం కూడా నిన్ను ప్రేమిస్తున్నాను అని పరిపరి విధాల చెప్పాడు. ఆమె వినలేదు.

ఇక్కడిలా ఆలస్యం చేస్తే, ఈ పిక్చర్ల నింతకుముందు చూచి వుండగల ఇతర మదరాసీ కథాధరులు వీటిలో అయిడియాలు, క్లైమాక్సు, ట్విస్టులు కొట్టేసి మదరాసీ కథల్లో కలిపేసి పిచ్చర్లు తీసేస్తారని భయపడి హడావుడిగా పరిగెత్తాడు నిర్మాత. అర్నెల్లు తిరిగేసరికి అతను రెండు పిక్చర్లు తీశాడు.

ఈ లోపల ఆ అమ్మాయికి ఎన్నో వుత్తరాలు రాశాడు మీ పిక్చర్ల కోసం కాదు; నీ కోసం నిన్ను ప్రేమించాను అంటూ.

ఒకనాడు ఆ పిల్ల బొంబాయికెళ్లేసరికి ఆమెను చూసి బొంబాయి బాలిక అనుకుని ఒక మద్రాసు నిర్మాత హిందీ పిచ్చరులో మద్రాసీ యువతి వేషానికి బుక్ చేయడంతో ఆమె బంధుమిత్ర సపరివారంగా విమానం ఎక్కి మద్రాసువచ్చి విడిసింది. అనుకోకుండా తన మాజీ మనోహరుడు తీసిన చిత్రాలు రెండూ ఒక స్టూడియాలో చూసింది.

ఒక్కసారిగా ఆమె కళ్ళు తెరుచుకున్నాయి. అపోహ చెరిగిపోయింది. నిర్మాతకి నిజంగా తనతండ్రి కథలమీద మోజులేదని రుజువైపోయింది. ఎందుకంటే అతను కొని తీసుకొని వచ్చిన కథలు ఆధారంగా అని చెప్పి మరీ, ఈ పిచ్చర్లు తీసినా, వాటికీ వీటికీ ఏ కోశానా పోలిక లేదు. అంత పూర్తిగా పరిమార్చి మదరాసీ పిచ్చరు తీశాడు! అనుకుంది. ఎంత నిర్మల హృదయం అనికూడా అనుకుంది

పక్కఫ్లోర్‌లో రీ రికార్డింగు ఆర్కెస్ట్రా గొల్లుమంది. ప్రాణనాథ్ నిన్ను అపార్థం చేసుకున్నాను అంటూ నిర్మాత కాళ్ళమీద పడి లేచి కౌగిలించుకోబోయింది ఆ అమ్మాయి.

నిర్మాత ఆమెవంక ఎగాదిగా చూశాడు. ఆమె మద్రాసీ పిక్చరుకు కావలిసిన సౌతిండియన్ వేషంలో ఉంది.

"నువ్వు నా మనసు హరించిన బెంగాలీ పిల్లవి కావు. నువ్వు ఎవరో మదరాసీవి, నువ్వు నా కక్కలేదు..." అంటూ హెవీప్రాజెక్షన్ బిల్లు పట్టుకుని బరువుగా అడుగు వేసుకుంటూ వెళ్ళిపోయాడు నిర్మాత...

(జ్యోతి ప్రారంభ సంచిక నుంచి)

---

పెసరట్ల కొట్టుదగ్గరసీత (లత) :
అవ్వగారూ అట్టులు పెట్టరూ?
రామం (అక్కినేని) : అట్టులు ఉట్టినే పెట్టరు.
ఇట్టులే పెట్టెదరు (డబ్బు లివ్వాలని వేళ్ళతో సైగ చేస్తాడు).
సీత :- అట్టులే యిచ్చెదము (డబ్బు లిస్తుంది).

—అందాలరాముడు

---

రామచామిది భారీ విగ్రహం. తెలుగుసినిమా అంత—ఆమాట కొస్తే దాదాపు అరవసినిమా డైలాగంత పొడుగ్గా వుండేవాడు—కాగా నగటు భారతీయ హీరోయిన్ అంత లావుగా వుండేవాడు.

—విక్రమార్కుడి మార్కు సింహాసనం

---

ఆస్పత్రిమందులందు-అంటేమి కానబడదు
ఇస్కూళ్లో చదువునపుడు-పుస్తకము మైలపడదు
దేవుడికి మొక్కినపుడు హోటల్లో మెక్కినపుడు
రైళ్ళల్లో ఎక్కునపుడు బస్సుల్లో చిక్కినపుడు
హెచ్చన్నమాటరాదు-తగ్గన్నమాటలేదు
సహపంక్తి భోజనాల-కొంపేమి మునగిపోదు

—అందాలరాముడు


బాపు కార్టూనులు
కామెడీ సజ్జ మార్కు ఫార్సుల్లో బతాకో
హాలీవుడ్ మార్కు బొంబాయి వాళ్ళ విలనీలో ఫైటో
బొట్టూ కాటుకా పెడితే చక్కటి ఆడపడుచు
ఇజీనారం వేసబాస తొడిగితే కోడెపడుచు
తెలుగు సినిమాలో గిరిజ మార్కు వేషాలు
ఉంటే హుషారుగ గడుచు
లేకపోతే ఇంకా చురుగ్గా నడుచు...




# రేలంగి — వెంకట్రామయ్యా

"మీకు బాగా నచ్చిన వాటిలో బెస్ట్ జోక్ ఏమిటి?" అని ఒక మిత్రుడు అడిగితే, ఏముందీ, "లైఫ్, అనగా జీవితం" అన్నాడు రేలంగి వెంకటరామయ్య.

రాళ్లూ రప్పలూ తిని హరాయించుకోగల రోజున మరమరాలు కూడా దొరకవు; తీరా వజ్రాలూ వైడూర్యాలూ పోగేసుకొన్నాక మరమరాలు కూడా అరగవు... రేలంగీ, వెంకటరామయ్యా తెరమీదా జీవితం మీదా షికారు వెళ్తూన్నపుడు తరుచు ఈ మాట చెప్పుకుని పగలబడి నవ్వుకుంటూ ఉంటారు. దొరక్క వీడూ, అరక్క వాడూ అనుకుంటూ ఉంటారు.

నవ్వడం, నవ్వించడం, నవ్వుకోవడం రేలంగికి ఈనాటి విద్య కాదు; కాకినాడ యంగ్‌మన్స్ హేపీ క్లబ్‌లో చేరిన "అన్ హేపీ మెంబర్ల"తో కలిసి తిరిగిన నాడు కూడా నవ్వడం నవ్వించడమే

రేలంగి ఉద్యోగం. సినిమా పేటలలో వేషాల వేట సాగించినపుడు, హేళన మాటలు పడినపుడు, జార్జిటవున్‌లో ఉల్లాసంగా సినిమా చూసి నిశిరాత్రివేళ, ఆరుమైళ్ళ దూరాన ఉన్న ఆళ్వారుపేటకి రాజబాట కొలుస్తూ వచ్చి బార్లీగంజి తాగి కళ్లు మూసుకు పడుకున్నపుడు, ఉచ్ఛస్థితికి వెళ్ళి జారిపడినపుడు, తననిచూసీ, తనని చూసి నవ్విన వాళ్ళని చూసీ కూడా నవ్వుతూనే వచ్చాడు. నవ్వుకుంటూనే వచ్చాడు, అతను కష్టాలుపడ్డా దుఃఖం ఎరగడు. భోజనంలేక శోషవస్తే నిద్ర నటించి జీవితంతోనే సరసమాడి దాన్ని నవ్వించాడు. మెప్పించాడు. లాంగదీసుకు సవారీ చేస్తున్నాడు. ఈ విధంగా ఎంతసేపూ తన కష్టాలు తలుచుకు కుమిలిపోయి తనమీద తనే జాలిపడుతూ కూర్చున్నవాడుకాడు కాబట్టి తనచుట్టూ ఉన్నవాళ్ళ కష్టసుఖాలు చూడగలిగాడు. ఇలా హాలాహలంలోంచి అమృత భాండాలను, వాథలను చిలికిచిలికి తీసిన అతని నవ్వు; అతని హాస్యం, సినిమాలో అతను పలికే మాటలు కొన్ని వెలితిమాటలయినా అతనినోట వచ్చినపుడు నిండుగా ఉండడానికి ఒక కారణం ఇదే.





పాత "చింతామణి" చిత్రం నుంచి నేటివరకూ నూటికి పైబడ్డ చిత్రాలలో నటించినా హాస్యం మటుకు పాత చింతకాయ పచ్చడిలా తయారవకుండా ఉండడానికి అతను చేసిన కృషి అపారం. సినిమాలో వేషానికి సాధారణంగా రచయితా దర్శకుడూ రూపకల్పన చేయడం నిజమే అయినా, రేలంగి అందులో జీవం పూరించి ఏదో కొత్తదనం తేవడానికి, సమకాలిక జీవితానికి దగ్గర కావడానికి కృషిచేస్తూవచ్చాడు. కొత్తల్లో చేసిన ఆ కృషివల్లనే పాత్రల బదులు రేలంగే ప్రజాదరణ పొందాడు. 'రేలంగి ఉంటే చాలండీ' అనే జనం పెరిగారు. చివరికి, రేలంగి తత్వాన్నిబట్టి, జీవితంపట్ల ఆయన దృక్పథాన్నిబట్టి ఆయన ధరించే పాత్రలకు రూపకల్పన చేయడం, వేషభాషలు నిర్ణయించడం జరిగింది. సినిమా ఏదైనాసరే– కథ ఏదైనా సరే రేలంగి, హాస్యానికి ఒక వ్యవస్థ అనిపించుకున్నాడు. తెలుగు సినిమాలో ఒక శకం నెలకొల్పాడు. నిజంగా ఒక నటుడుగా వ్యక్తిగా ఆయన ఘనతకు ఇది జోహారు చేయడమే కావచ్చుకాని, సినీవిపణివీధిలో ఇది బాక్సాఫీసు సూత్రమైపోయింది. దుమ్ముకొట్టింది

క్రమంగా రేలంగి పేరునే తప్ప ప్రజ్ఞని వాడుకోడం మర్చిపోతున్నారు సినీపారిశ్రామికులు. రేలంగి కూడా కొంత పరాకు చిత్తగించడం, కొంత మొహమాటాలకు లొంగడం జరిగిందని ఆయన విమర్శకులు అంటారు. ఇలాటివి మిశ్రపరిశ్రమలో తప్పవు. అయితే ఇలాటివి వచ్చినా రేలంగి ఓడిపోడు.

పదేళ్ళనాడు పైకివస్తున్న రేలంగిని కిందకి కొట్టింది అదృష్టం; రెట్టించిన జవసత్వాలతో బంతిలా పైకి ఎగిరాడు తను. అదీ అతని తరహా.

తెరమీద రేలంగి ఎంత సందడయినవాడో జీవితం మీద వెంకటరామయ్యగారూ అంత సందడయిన మనిషీను. సినిమాలో పాత్రలు మన సొమ్మేం పోయిందన్నట్టు దయాదాక్షిణ్యాలు వెదజల్లితే, జీవితంలో రేలంగి అంతకన్న దర్జాగా ఉదారంగా ధారాళంగా మంచి పనులు చేస్తాడు. కష్టాలను, కష్టాలలో ఆదుకున్న మిత్రులను



మరచిపోలేడు. తిరుపతి విశ్వవిద్యాలయానికిచ్చిన విరాళం వంటివి కాక, గుప్తదానాలు ఎన్నో చేశాడు. పెళ్ళిళ్లు చేయించి ఇళ్ళు నిలబెట్టడం అతని సరదా. ఎప్పుడూ దిగులు తన పోలికిరాకుండా చుట్టూరా పది మందిని కూర్చోబెట్టుకుని కబుర్లాడుతూ తిని తిరగడం సరదా. తన యింట్లో రోజూ పాతిక ముప్పై విస్తళ్లు లేవగా చూడడం సరదా. నిత్యకల్యాణం పచ్చతోరణం అన్నట్టుగా జీవించడం—సందడిగా జీవించడం సరదా.◆

---

మామగారు (కాంతారావు) : ఇంటికిరామ్మా, అబ్బాయి ఎంత క్షోభ పడుతున్నాడో తెలుసా ? వాడికి నేను నచ్చచెబుతాను.

లక్ష్మి (సంగీత) : పదేళ్ళుగా నేను పడిన క్షోభ ఎప్పుడేనా ఆలోచించారా ? అయినా మావగారూ - సిఫార్సులతో కాపురాలు చక్కబడవు.

—ముత్యాలముగ్గు

---

రాము డేమన్నాడోయ్ సీతారాము డేమన్నాడేయ్
నేడు రాజులంతా మంత్రులయితె మెచ్చుకున్నాడోయ్
కొందరు మంత్రులు మా రాజులైతె నొచ్చుకున్నాడోయ్—

(ఆరుద్ర)—అందాలరాముడు

---

కంట్రాక్టరు (రావుగోపాలరావు) - క్లయంటుతో :

పంచదార మీద కంట్రోలు తీసేశారు. నీకాడ పదివేల బస్తా స్టాకుండిపోయింది. రేటుపడిపోద్దని బయమేసొచ్చావు అవునా? నీ దగ్గర స్టాకు చెల్లేదాకా బజారులోకి పైనించి బస్తాలు దిక్కొడదు అంతేనా? సరే సమ్మెలు చేయించో, జైల్లో పెట్టించో, ఓడలు ముంచో ఓ నెలాపుతాను. ఈ బిగినెస్‌లో నీకు ఏడు లకారాల్దాకా మిగులుద్ది. ఓ రెండున్నరిప్పించండి పనుల్జరిగిపోతాయి.

—ముత్యాలముగ్గు



బాపు కార్టూనులు
ఎత్తుకి రెండెత్తులు నటించే ఫీల్డులో
బాలయ్యా!
'ఎందుకూ సగంచాల'న్నట్టు నటిస్తావు
ఏలయ్యా?



శ్రీ మహాలక్ష్మి కోరిన సిరుల నిచ్చు
చదువు లిచ్చు జనని సరస్వతియె గాని
ఒకరు మసలెడిచోటు వేరొకరు పోరు
అత్తకోడండ్రు వారలైనందు వలన!

అనుపమ చిత్రం

# అత్తా ఒకింటి కోడలే!

నిర్మాత. దర్శకుడు తిలక్

బొమ్మల కథ

రచన. ఆరుద్ర

బొమ్మలు బాపు

వెల 6 నయాపైసలు

అనగనగ ఒకయింటి ఆసామిగలడు
అతను సుబ్బారాయుడను పేర బరగు
భార్య తాయారమ్మ పరమగయ్యాళి
తల్లి పార్వతమ్మయు - తంటాలమారి





అత్త అధికారమ్ము మొత్తమై పోయి
కోడలి సాధింపు కొండంత పెరిగె
విసిగియా అత్తమ్మ వేరొక్క పంచ
చేరుకొనె - తాయారు పోరు పడలేక

పోవుచూ చెప్పింది ముసలమ్మ ఇట్లు

కోడలా కోడలా కొడుకు పెండ్లామ
నేటైన రేపైన నీ కోడలొచ్చు
అపుడు న గతి నీకు అబ్బుము గట్టు



మీలాగ నేనెపుడు మెలగను సుంతి
కోడల్ని చూసెదను కూతురి లాగ

ఈ మాటలను విన్న యింటి యజమాని
తనయుని రకకై తానెదురుచూసె



పెండ్లీడు తనయుని
పేరు రఘురాము
పట్నాన బియ్యేను
పఠియించుచుండె





అతనితో చదువుకొను అందాల శోభ
ఈమెనే రఘురాము ప్రేమించినాడు
చదువులు ముగియించి స్వంత గ్రామాలు
శోభ రఘురాములు సూటిగా చేర

తలవని తలంపుగా తయారు-శోభ
తెలుసుకొన తయారు తలపోసెనిట్లు

ఈమె కోడలుకాగ ఎంత బాగుండు



శోభ రఘురాములకు
శుభ ముహూర్తాన
పెండ్లి చేయాలని
పెద్దలనుకొనిరి

శోభకొక తల్లుంది సుందరమ్మనుచు
అన్నయ్య చంద్రయ్య-అతగాడు మెతక



కొడుకు పెండ్లైనమా కోడలు లక్ష్మి
నేలకోవద్దంది ఈ సుందరమ్మ

లక్ష్మిని మాయింట లక్షణంగాను
పెట్టుకొంటే నేను పెండ్లాడుతాను



అను షరతుతో రఘు అంగీకరించె
పెండ్లి జరిగినదంత-వేడుక మీర

కోడల్ని తాయారు కూతురి లాగ
చూసుకొనె నెంతయో చోద్యముగను





కలలు నోములు పండి నెలతప్పె లక్ష్మి
కన్పుయున్నది. గయ్యాళి గంప
సుగుణరాశియైనట్టి కోడల్ని రాసి
రంపాన పెట్టింది - రక్కసి యత్త

వేయి దేవుళ్లకూ విధిగ మొక్కించి
పూజలూ వ్రతములు పూర్తి చేయించి
తాయారు కోరికలు తీయగా పండి
శోభయూ నెలతప్పె శోభస్కరముగ





లక్ష్మమ్మ జనకుడు రంగయ్య గారు
శుభవార్త విని తాను సూడిదలు తెచ్చె
అవమానమొనరించి - ఆ సుందరమ్మ
వియ్యంకుడిని తాను వెళ్లగొట్టింది

మంచి ముహూర్తాన - మగపిల్లవాణ్ణి
కన్నది లక్ష్మమ్మ కడుపే పండ్రమిహార
ఈ వార్త విని శోభ ఎగిరి గంతేసె
కాలుజారి పడింది కడుపు పోయింది



భంగపాటొందిన రంగయ్య కొడుకు
మనసు గాయాలతో మంచమ్మ పట్టె
చనిపోవు సమయాన మనుమణ్ణి తాను
ఒకసారి చూడంగ ఉబలాట పడెను



అంతతో తయారు - ఆగ్రహించెంది
సాధించుకోవాల్ని వేధించసాగె

బిడ్డనివ్వక యత్త వెళ్ళగొట్టంగ
తండ్రింటికెళ్లింది తడికంట లక్ష్మి



తల్లి సాధింపులకు తనయుడు విసిగి
ఉద్యోగమును చేయ ఊరొదిలి పెట్టె



చెట్టుకో పిట్టగా చెదిరిపోయారు
బాబుతో లక్ష్మమ్మ బస్తీకి చేరె

తల్లిభార్యల మధ్య తగవులు చూసి
విసుగెత్తి రఘు కూడ వెళ్ళె బస్తీకి
అటుకొక్క యుద్యోగ మతనికి దొరికె
భార్యతో బామ్మతో బాగుగా నుండె



కోడల్ని కొడుకుని
కొట్టి పంపేసి
అల్లుణ్ణి కూతుర్ని
ఆ సుందరమ్మ
తన యింట నుంచుకొన
తలపోసె బాల





అత్తనా కోడల్ని
ఆరళ్ళు పెట్టి
పంపించి వేసిన
పరమ గయ్యాళి
తయార్ని మార్చంగ
తలచెను భర్త

కొడుకుతో తల్లితో గూడుపుఠాణి
చేసి ఒక పథకాన్ని వేసినాడతడు



తసుమోతుగ రఘు తందనాలాడి
అత్తగారిని తాను హడలకొట్టాడు



దయ్యాల భయమున్న
తాయార్ని చాల
భయపెట్టె నటించి
పార్వతమ్మయును



తాయారు, సుందరి
తమయిళ్ళ వీధి
ఏటి పడవలపైన
ఎదురుపట్టేరు




సిగలుపట్టుకు వారు
తగువాడుగాను
నట్టేటమునిగారు
కట్టుకట్టుకొని



మాయ సాధువులాగ
తాయారు భర్త
వారిని కాపాడి
దరికి తెచ్చె



మదినున్న గర్వమ్ము మాసిపోవంగ
దర్శిలో అత్తయూ ఒకే ఇంటి కోడ
లను మాట మరువక హాయిగా వారు
కొడుకు కోడండ్రతో కడుసుఖపడిరి





సుబ్బారాయుడు
(రమణారెడ్డి)



తాయారు
(హేమలత)



పార్వతమ్మ
(లక్ష్మీకాంతం)



రఘురామ్
(జగ్గయ్య)



శోభ
(గిరిజ)



రంగయ్య
(పెరుమాళ్లు)



లక్ష్మి
(దేవిక)



చంద్రం
(రమణమూర్తి)



సుందరమ్మ
(సూర్యాకాంతమ్మ)

ఇది 'అత్తా ఒకింటి కోడలే' చిత్రం బొమ్మల కథ ప్రకారం సర్వం సమాప్తం
ఇది చదివిన వారికి, సినిమా చూసిన వారికి సర్వకష్టాలు పోయి సర్వశుభాలు కలుగుతాయి



రాజమండ్రి
చింతపల్లి
సినిమాకి కోయపాట
రాయాలట - షూటే
చెయ్యాలంటూ
పొద్దున్ననగా వెళ్లారు
మా బావ - అరుగో -
ఇక్కడేమో లాస్టు బస్సు
వేళయింది!




# విఠల్ ప్రొడక్షన్స్ వద్దంటే పెళ్ళి.

నిడివి : 3 మైళ్ళు-5 ఫర్లాంగుల-9 గజాలు
లేక 3 గం-37 ని-10.5 సె.

హుషారైన ప్రహసనం చూచి సరదాగా కాలం గడపాలంటే, 'వద్దంటే పెళ్లి' (విఠల్ ప్రొడక్షన్స్) చిత్రం ఆడుతున్న సినిమాకు వెళ్ళి కూర్చోవచ్చును. రెండో ఆటకి పిల్లాజెల్లాతో వెళ్లేవాళ్లు పకోడీలు, జంతికలు వగైరాలు చేసుకుని, రెండు మరచెంబులతో మంచినీళ్లు పట్టుకుని మరీవెళ్ళడం మంచిది. ఎందుకంటే ఈ చిత్రం పొడుగు **19,600** ఆడుగులు. నడక **3** గంటల **37** నిముషాలు. అయితే నిజానికిది చాలసేవు పరుగెడుతుంది. అందువల్ల విసుగుండదు. అనగనగా ముగ్గురమ్మాయిలు. కాశీమజిలీ కథలో రాజకుమారుడూ వాళ్ళలాగా వీళ్ళూ నేస్తాలుగా పెరిగి, పెళ్లి ఘట్టంలో విడిపోయి

నా... పో... ఛా!





ముగ్గురూ మూడు కొమ్మలెక్కి మూడువేపులకు బయల్దేరుతారు. అందులో ఒక చిన్నదాని పేరు విద్య. అల్లారుముద్దుగా పెరిగినందు వల్ల రణపెంకిగా తయారైంది. అందుకని వాళ్ళింటి గుమాస్తా రమణారెడ్డికి, ఈ రణపెంకిని ఓ రాలుగాయ పిల్లాడికి కట్టబెడితే క్షేమగ్గా ఉంటుందని ఊహపోతుంది. ఏనాడో దేశాలు పట్టిపోయి, వేళకి తిరిగొచ్చిన పశుపతి అనే కుర్రాడికి సంగీతం మేష్టరువేషం వేయించి విద్యకు అవిద్య నేర్పిందికి కుదురుస్తాడు. తీరా వాళ్ళిద్దరూ 'సా...పా...లు' పట్టే వేళకి 'ఛా' వీడికేంరాదనిపిస్తుంది గుమాస్తాకి. కథ అడ్డంతిరిగేలోగానే జాగ్రత్తపడాలని, విద్య దృష్టిని పెళ్ళిమీదకు మళ్ళిస్తాడు. 'నేను ఆడాళ్ళని పెళ్లాడను' అని బడాయిపోయిన పశుపతి మీద కోపం కొద్దీ పంతంపట్టి, అతన్ని పెళ్ళాడేస్తుంది విద్య. ఇక, ఆ పిల్లకి, అదేకోవలో మనిషి అమె తల్లికీ బుద్ధిచెప్పడానికి, ఇంటాయన పరంధామయ్యా, గుమాస్తా హనుమంతయ్యా, అల్లుడు పశుపతి, కనే వినే వాళ్ళకి హుషారూ, తృప్తీ కలిగించే విధాన ప్రహసనం ఫక్కీ ఉపాయాన్ని అవలంబిస్తారు. దర్శకుడు విఠలాచార్య, కొత్త రచయిత రామచంద్, నటులు చలం, కృష్ణకుమారి, సి.ఎస్.ఆర్., రమణారెడ్డి, రమాదేవి, శివరాం, బాలకృష్ణ సమష్టిగా చక్కని కృషిచేసి, అత్యంత ఆహ్లాదకరంగా ఈ "కథ"ను నడిపారు.

ఈ తరహా కథలలో, సన్నివేశాల స్వభావాన్నిబట్టి నటులు, మామూలుకన్న ఒక ఛాయ ఎక్కువ చలాకీగా నటించడం పరిపాటి. మితిమీరతగు ఈ నటనకూ ఒక పరిమితి ఉంది. అది దాటితే చలాకీతనం వెకిలితనం అనిపించుకుంటుంది. ఒకటీ రెండు ఘట్టాల మీద ఈ రెండో లక్షణం క్రీనీడలు పడినా, మొత్తంమీద మెచ్చుకోతగ్గ స్థాయిని మొదట్నించి చివరదాకా నిలబెట్టారు. ముఖ్యంగా సి.ఎస్.ఆర్., చలం ఈ దృష్ట్యా ప్రశంసనీయులు. "ఎంటర్టెయిన్ మెంటాలిటీలు" ఉన్నవాళ్లు పోగల షోకైన పోకడలు, మాటలలో చేష్టలలో వాళ్లుచేసే విన్యాసాల సొగసులు, సి.ఎస్.ఆర్. నటనలోను, ఆయన పాల్గొన్న కొన్ని సన్నివేశాలలోనూ చూడవచ్చు. రచయితలు రామ్‌చంద్, జి. కె. మూర్తి వీటికి తగ్గట్టు, తేలికగా హుషారుగా సాగేలా సంభాషణలు వ్రాశారు. రామ్‌చంద్ వ్రాసిన పాటలు కూడా బాగున్నాయి.

ఇదీ ఒక అమ్మాయి కథ. ఇదికాక ఇంకో ఇద్దరమ్మాయిల కథలు కూడా ఉన్నాయి.

మొదటి కథలో నవ్వించే సన్నివేశాల మధ్య పాటలతోపాటు ఇవీ చోటుచేసుకుంటూ సమానాంతరంగా వచ్చాయి. ఆ కథలకు 'ఇల్లాలు' 'పతిత' అని పేర్లు పెట్టవచ్చు. ఇల్లాలు కథలో పతివ్రత గౌరిగా శ్రీరంజని, భర్తగా అమర్‌నాథ్ నటించారు. గౌరి సినిమా కష్టాలను, భర్తను అలా భరించి నీతిగా బ్రతుకుతుంది. ఈ ఘట్టంలో ఆమె విలవైన ముక్క చెబుతుంది. "కోట్లాది కుటుంబాలున్న యీ భారతదేశంలో, మనకన్న కనాకష్టపు స్థితిలో అవస్థపడుతున్న వాళ్ళెందరో ఉన్నారు" అని భర్తకు ధైర్యం చెబుతుంది. నటి శ్రీరంజని, ఈ మంచి మాటను నిండుమనసుతో స్మరణీయమైన విధాన చెప్పింది....చివరకి ఆమె ప్రాణంమీదకు వచ్చినవేళ, భర్త భాగ్యరేఖ, నాగులచవితి వంటి చిత్రాలలో ట్రిక్కులు గుర్తుకు తెచ్చుకుని గట్టిగా ఓ మంచి పాట పాడుతాడు. వైద్యులు కూడా లాభంలేదని వదిలేసిన గౌరి, ఆ పాటధాటికి మేలుకుని, తనూ మెల్లిగా ఓ చరణం అందుకుని, భర్తచేత పాట మానిపిస్తుంది. ఈ కథ అవధులమేరకు ఇద్దరూ బాగా నటించారు. మూడోది, పెళ్లీపెడాకులూ లేకుండా స్వేచ్ఛగా తిరగొచ్చునన్న దురభిప్రాయంతో బయల్దేరిన కమల కథ. ఆమె నీతి నేర్చుకునేసరికి కాలాతీతం అయిపోయింది. ఇందులో గిరిజ, రాజనాల, చంద్రశేఖర్ అభినయం చేశారు.

గొప్ప ట్రిబుల్ ప్రోగ్రాం. **1957**

విఠలాచారి




నా వీక్‌నెస్ పట్టేశారు
శెట్టిగారు!


నేను సమకున్నది కొన్వెంట్లైనా
తీరిక వేళల్లో పాత హిందూ వంటలు
చేసుకోడం నా హాబీ!
మేడమ్!
ఆ కుంపటి పొజిషన్ గురించి
చిన్న సజెషన్...

# ప్రభా ప్రొడక్షన్స్ ఆడపెత్తనం

మామూలుగా సినిమాలలో, కథపాలు కొంత, ఆ పాలలో నీరు పాలు కొంత ఉంటుంది. సిసలైన రాజహంసని కేకేసుకొచ్చి సినిమాలో 'నీరూ పాలూ' వేరుచేయమంటే అది నవ్వేస్తుంది. "ఇది పాలు కాదు; కాఫీ! నీరుందని తెలుసుకోడం తప్ప నీటిని విడదియ్యడం బ్రహ్మతరం కాదు; సైంటిస్టులు కూడా ఏం చెయ్యలేరు." అని చెప్పి, ముక్కు చప్పరించి చక్కాపోతుంది.

జోడు కథల బగ్గీమీద వెళ్లే 'ఆడపెత్తనం' (ప్రభా ప్రొడక్షన్స్) చిత్రంలో ఈ పని చేసిపెట్టడానికి-సైంటిస్టులుగాని, బ్రహ్మగాని, ఆఖరికి హంసకూడా- అవసరం లేదు. 'విశ్రాంతి' కాలమే ఈ రెండిటికీ సరిహద్దు. విశేషం ఈ రెండిటినీ అందంగా కలపడంలో దర్శకుడూ, ఎడిటరూ చూపిన నేర్పు; అపైన, మువ్వల రంగమ్మ పాత్రధారిణి, ఈ కథకు సూత్రధారిణి అయిన శ్రీమతి కన్నాంబ ప్రజ్ఞ. ఈ రెండూ, ఈ చిత్రానికి చెప్పుకోతగ్గ ఆకర్షణను చేకూర్చాయి. మీరీ చిత్రాన్ని తప్పక చూడబోవడానికి గల ముఖ్యమైన మూడు కారణాలలో పై రెండూ పోగా మూడోది కుటుంబరావు నటన.



రంగమ్మ అనే ఆవిడకు బోలెడు ఆస్తి, అంతకుతగ్గ తిక్క మెతక మొగుడూ, సవతి కొడుకూ, సొంతకూతురూను. కొడుకు కృష్ణ పట్నంలో చదువుకొంటున్నాడు. సెలవివ్వగానే బయల్దేరివస్తాడు. బండిలోంచి కథలోకి దిగీదిగుతూనే తన పాలిట అంజలీదేవి రాధను చూసి, భేటి ఏర్పాటుచేసుకొని మరీ యింటికెళ్ళాడు. రాధా కృష్ణులు చిన్నపుడే ప్రేమించుకున్నారు. పెళ్ళాడాలనుకుంటున్నారు. కాని రాధ బీదపిల్ల. కృష్ణకి వేలువిడచిన మేనమామకూతురే. 'వేలు' విడవడం అంటే సుతరామూ గిట్టని రంగమ్మగారు, పదివేలు కట్నం యిస్తేగాని పెళ్ళి వల్లకాదని శాసిస్తుంది.

రాధాకృష్ణులు యుగళగీతాలు మొదలుపెట్టకుండానే అపశ్రుతి పలుకుతుంది. అప్పుడు రాధ తండ్రి ఊళ్ళో మోతుబరి రామయ్యకు పొలం తెగనమ్మి డబ్బు పుట్టిస్తాడు. కాని, కథ అన్యథా ఉందని తెలియక, రాధని తనే చేసుకోవాలన్న పేరాశతో రామయ్య ఆ డబ్బుని రాత్రికి రాత్రే దొంగిలించి, మరీ పొగరుమోతుబరిగా ప్రవర్తిస్తాడు.

ఇక లాభం లేదని, కృష్ణ బరితెగించి, రాధ మెడలో తాళి కట్టేసి, తన కుటుంబంతోపాటు తీసుకుపోతాడు మామగారింటికి. 'పెద్దరికాల'వల్ల ఇంత పని జరిగినా ఎవరింట్లో వారు సుఖంగానే కాలక్షేపం చేస్తూ ఉంటారు.

మురార్జీదేశాయిగారుగనక ఈ చిత్రాన్ని చూడవస్తే, ఈ ఘట్టంలో లేచి నించుని, 'నే చెప్పలేదూ, 8 వేల అడుగులలో భారతీయ చిత్రాలను గూడ తెమిల్చివేయవచ్చు'నని అనేవారు. ఆయనేకాదు, ఎవరైనా సరే అలా అంటే పొరబడేవారనక తప్పదు.

ఈ చిత్రం రెండో రీలులో, రేలంగి సరదాగా కబుర్లు చెబుతూ కథలో జొరబడతాడు. ఇలాంటి యిబ్బంది వస్తుందని ఆయనకు (బహుశా స్క్రిప్టు చూచినందువల్ల) తెలిసి ఉండాలి. కథ తటపటాయిస్తున్న వేళ రేలంగి పుంజుకుంటాడు. ఇందులో రేలంగి పేరు లోకం. మంచి టోకరా సురుడు. రంగమ్మగారింట అద్దెకు దిగి, మెల్లిగా

అల్లుడై గద్దె నెక్కుతాడు. మెల్లిగా డబ్బు కాజేస్తూ, దాన్ని బస్తీలో ఉన్న సినీ వాంప్‌కు జారేస్తూ ఉంటాడు. అతనికి పెద్ద మొత్తాలు అవసరమైన వేళకు, మావగారు ఆస్తిని భార్యపేర రాసి, మంచం బట్టి, పోతాడు. దుడుసుదనం తప్ప గడుసుదనం లేని అత్తగారు అల్లుడి చేతిలో కీలుబొమ్మ అయిపోయింది. అతగాడు, తన పేర ఆస్తికి 'పవరాఫ్‌టర్నామా' రాయించేసుకుని, డబ్బునీ, కుటుంబ గౌరవాన్నీ జాయింటుగా నాశనం చేస్తూ ఉంటాడు. రైతుల్ని నానా బాధలు పెడతాడు. అతనూ, అందాకా ఏంతోచక కూచున్న మోతుబరి రామయ్యా ఏకమౌతారు. ఇటు పనిలేక దిగులుగా ఉన్న కృష్ణ, రైతులను వెనకేసుకుని బరి మీది కురుకుతాడు. రైతుల కోసం సహకార పద్ధతిపై బ్యాంకు పెడతాడు. చివరి సీనుకోసం సాముగరిడీలు కూడా మప్పుతాడు. (హెచ్చు వడ్డీకి అప్పులిచ్చి), సన్నకారు రైతులను కాలి కింద అదిమిపట్టే వడ్డీ వర్తకుడు, ఊరి మోతుబరి అయిన రామయ్యకూ, అతని జోలికి పోకుండా బ్యాంకు ధర్మమా అని స్వతంత్రంగా ఉండ గలుగుతున్న రైతులకూ భీకర నిశ్శబ్ద సంగ్రామం—ఈనాడు మన దేశంలో పల్లె పల్లెలా జరుగుతున్నది—జరుగుతుంది. రైతుల సంఘీ భావాన్ని సహించలేక సంఘాన్ని నాశనం చేసి, భావాన్ని (కృష్ణని) వెళ్ళగొట్టడానికి ప్రయత్నిస్తాడు రామయ్య. 'ఆడపెత్తనం అనర్థం' అని ఋజువు చెయ్యబోతున్నాడో లేక నిజంగానే దుష్టుడై డబ్బు అపహరిస్తున్నాడో తెలియనివ్వకుండా అందాకా నటిస్తూ వచ్చిన అల్లుడు లోకం కూడా ఈసారి ఆఘాయిత్యానికి వడిగట్టి, అత్తగారి ఆస్తినంతటిని తెగనమ్మి పోజూస్తాడు.

తన ఉనికివల్ల కథ అటూ ఇటూ అవుతుందేమోనన్న సద్భావంతో అనేక సన్నివేశాలలో జోక్యం చేసుకోని కృష్ణ ఈసారి మటుకు ఉభయపక్షాలూ కర్రలతో కొట్టుకున్నాక గట్టిగా కలగజేసుకుని దుష్టుల్ని సకాలంలో దండిస్తాడు.

దుష్టుడైన లోకం తన తప్పుకి తలుపుచాటున బోలెడు సిగ్గుపడి పశ్చాత్తాప పడి, మురిపించి మురిపించి మరీ కలుస్తాడు గ్రూపు ఫోటో లోకి. అనర్థాలకు కారణమైన ఆడపెత్తనం, వంటింటికి పరిమితం

అవడం మంచిదని రంగమ్మగారు అంగీకరిస్తుంది. అప్పుడంతా సుఖంగా ఉంటారు - దంపతులు కారమ్సు ఆడుతూ, రంగమ్మగారు పిండివంటలు చేస్తూ.

అంజలీదేవి, నాగేశ్వరరావు, గుమ్మడి వంటి నటుల ప్రజ్ఞకు, ఇందులో పాత్రలు చిన్నవైనా, ఉన్న అవధులలో సాధ్యమైనంతగా వారు పాత్రలను ఒప్పించారు. ఎప్పుడూ మంచివాడి పాత్ర ధరించే రేలంగి ఈసారి మంచిచెడ్డల సరిహద్దు రేఖమీద సాగినా ఇటీవలి చిత్రాలలోకన్న హుషారుగా నటించాడు. ఈ చిత్రం మొత్తం మీద అందరినీ మెప్పించగల ఇద్దరు నటులు కన్నాంబ, కుటుంబరావూను. కుటుంబరావుకు చాలాకాలం తరువాత, సమగ్రంగా రూపురేఖలు దిద్దిన పాత్ర లభించింది. ఒకవంక నవ్విస్తూనే మరొకవంక ప్రేక్షకులలో జాలికలిగించే శిల్పం ఇందులో వుంది. దాన్ని ఈ నటుడు మెచ్చతగ్గరీతిన సద్వినియోగం చేసుకున్నాడు. పెరుమాళ్లు నటించిన భూమిక పాతదే అయినా, అయన నటన, ఆ వ్యక్తిని ప్రేమపాత్రుణ్ణి చేస్తుంది. ఈ చిత్రంలో సుపరిచితం అనిపించే ఇతర పాత్రలు, సన్నివేశాలూ కూడా ఎబ్బెట్టుగా లేకుండా కొన్ని చిత్రాలలోవలె జుగుప్స కలిగించకుండా, మితితెలిసిన దర్శకుడు సుబ్బారావుగారి చేతిలో దర్శనీయంగా భాసించాయి....

కొంత మితితప్పినవి సంభాషణలే. మొదట్నించి చివరదాకా హుషారుగా సాగినా, అశ్లీలాలు, హాస్యవచనాలవలె ఫాన్సీడ్రెస్ వేసుకు తిరిగాయి. పదేళ్ళ తరవాత రెండర్థాల మాటలు మెండుగా విని పించాయి. ఇవి మినహాయిస్తే మిగతా సన్నివేశాలలో రచన నిండుగా, పాత్రోచితంగా ఉంది.

సంగీతం రాజేశ్వరరావుగారి అసంఖ్యాక అభిమానులకు గొప్పగా చెప్పుకోతగ్గ కానుక అనిపించకపోయినా వింటున్నంతసేపూ హాయిగా వినబడింది. ఛాయాగ్రహణం దీనికి అమూల్యాభరణం కాదు. ♦

1958





## శ్రీ రాజరాజేశ్వరీ వారి 'అన్న-తమ్ముడు'

సినిమా నవకాలమానం ప్రకారం పద్దెనిమిదిరీళ్ళ పాటు (మానవ కాలమానం ప్రకారం విలన్, దుర్మార్గపు పనులు మొదలు పెట్టాక పాతిక-ముప్పై ఏళ్ళు తిరిగి కోరిక లుడిగే వరకూ) అధర్మం విచ్చలవిడిగా విహరించి విజయం చేపడుతుంది. సెమీ ఫైనల్స్‌లో కూడా దానికి ఢోకా ఉండదు. 19 వ రీలులో జరిగే ఫైనల్ రౌండులో ధర్మమే జయించుట పరిపాటి. అప్పుడు హీరో, హీరోయిను యుగళ గీతం పాడడం అలవాటు.





ఈ ఏర్పాటు అక్షరాలా ఇలాగే మూస పోసినట్లు ఉండకుండా, చెప్పుకోతగ్గ (మన చిత్రాలకు సంబంధించి నంతవరకు) కొత్త పద్ధతిలో కథను అపుజేయాలన్న సంకల్పంతో రూపొందించిన చిత్రం 'అన్న-తమ్ముడు'. కథాంతాన నాయికా నాయకుల యుగళగీతం బదులు నేపథ్యగానం ఏర్పాటు చేయడం వంటివి అలా ఉండగా 'ధర్మము తప్పక జయిస్తుంది' అన్న సత్యాన్ని తిరగేసి, "అధర్మము తప్ప కుండా ఏదో ఒక రీలులో పరాజయం పొందగలదు" అని చాటడం చిత్రకథలో విశేషం. దీని తరువాత కొసమెరుపులాంటి జీవిత సత్యాన్ని పొదిగి అలంకరించారు. అది: 'నిర్దోషి' అని చివర వరకు మీరు అనుకునే వ్యక్తికి యావజ్జీవ కారాగార శిక్ష పడడం...ఇదే ఈ చిత్రానికి ఒక విధమైన విలక్షణతను సమకూర్చిందని చెప్పుకో వచ్చు.

ఇద్దరన్నదమ్ములు చెరో దారీ తొక్కడంతో కథ ఆరంభ మవు తుంది. పెద్దాయన జడ్జి. మంచివాడు. రెండో ఆయన బహు అయో గ్యుడు. దుర్వ్యసనాలకు హెడ్డాఫీసు లాంటివాడు. తన వంతు ఆస్తి అంతా వాటికై ఖర్చు పెట్టేసి, ఆపైన అన్నగారి సొత్తుకోసం కృషి చేస్తాడు. వజ్రం అనే ప్రియురాలూ, బ్రహ్మండం అనే గౌరవ బావ మరిదీ అతనికి తోడౌతారు. ఈ దుష్టుడు అన్నకి విషం పెట్టి చంపే స్తాడు. గర్భిణి అయిన వదినెను, ఆమె కొడుకుని కూడా చంపబోతాడు గాని, వాళ్ళు పారిపోతారు. అనక ఆ పిల్లడిని వాళ్ళింటి నౌకరు పెంచుతాడు. తల్లి, ఒక క్రైస్తవ మిషనరీ ఆశ్రయం సంపాదించి అక్కడే కష్టపడి పనిచేసి జీవనం సాగిస్తూ ఉంటుంది. అధర్మానికి మంచి రీళ్ళు కాబట్టి, అట్టే రభస లేకుండానే ఆమె మీద నిష్కారణం హత్యానేరం, తత్ఫలితంగా పన్నెండేళ్ళు కారాగార శిక్ష పడతాయి. ఆమె తిరిగి వచ్చేవరకు పెద్దకొడుకు ఎన్. టి. రామారావు లాంటి రవి గానూ, చిన్నవాడు జగ్గయ్యవంటి రాజేంద్రగానూ పెరుగుతారు. రవి కాయకష్టం చేసుకు బతుకుతాడు. రాజేంద్ర లాయరై పేరూ, కారూ సంపాదిస్తాడు. నవ దర్శకుడు సి. యస్. రావు పాత పద్ధతిలో పుట్టు మచ్చలూ, గంట్లూవంటి కొండ గుర్తులకు ఆస్కారం ఇవ్వనందువల్ల తల్లి శాంతమ్మ వాళ్ళని గుర్తించదు. ఎవరన్నా చెబితే బావుణ్ణని

ఎం. ఎస్. రామారావు నేపథ్యంలోంచి శ్రావ్యంగా సూచించినా ఎవరూ చెప్పరు. అయినా అనిర్వచనీయమైన అనురాగం పెల్లుబికినందు వల్ల రవి తల్లిని కనికరంకొద్దీ చేరదీసి, తల్లిలాగే పూజిస్తూ ఉంటాడు. ఈలోగా, అతని పినతండ్రి నాగేశ్వరరావు నానా అఘాయిత్యాలూ చేస్తూ ఉంటాడు. రవి చెల్లెలువలె పెరుగుతున్న పద్మను చెరచబోయి ఆమె మరణానికి కారకుడవుతాడు. పగ తీర్చుకోవచ్చిన రవిని చంప బోయి, తన ప్రియురాలు వజ్రం మరణానికి కారకుడౌతాడు. ఆ నేరాన్ని రవి మీదకు తోసేస్తాడు. ఆ తరవాత, లాయరు రాజేంద్ర భార్య రాణిని బలాత్కరించే వేళ, తన పాతశత్రువు రవి మళ్ళీ సిద్ధ మవుతాడు. ఆయుధం చేతబట్టి ఉన్న ఆ దుష్టుడి బారినుండి, రాణిని, తనను కాపాడుకోవడానికి జరిపిన పోరాటంలో రవి, నాగేశ్వరరావును చంపివేస్తాడు.

ఇక్కడనించి, కథ ఇంకోదారి పట్టడమే ఈ చిత్రం విశేషం.

రవి, ముద్దాయిగా కోర్టులో హాజరయేసరికి, అతని తమ్ముడు రాజేంద్ర న్యాయమూర్తి పదవికి వచ్చేస్తాడు. అలా బజారు కెళ్ళొస్తా నన్నట్టు రోమ్ నగరం వెళ్ళొస్తానన్న 'ఫాదర్', ఆ వేళకు తిరిగొచ్చి రాజేంద్ర శాంతమ్మకు కొడుకేనని వెల్లడిస్తాడు. "అయితే రవి నీకు అన్నయ్యే"నని, ఆ సంగతి క్రితం రోజే తెలుసుకొన్న శాంతమ్మ వెల్లడిస్తుంది.

న్యాయస్థానంలో, రవి, "న్యాయవాదు లనే సవతి తల్లుల" సహాయం అక్కరలేదని, హత్యకు సంబంధించిన కథ యావత్తు తనే చెబుతాడు. ఒక దుష్టుడినుండి, ఒక అబలను (ఆమె జడ్జిగారి భార్యే) కాపాడడానికి, తన ప్రాణం కాపాడుకోవడానికి రవి, హత్య చేశాడన్నది స్పష్టంగా తేలినా, రవి, పూర్వం నుండీ పగబట్టి ఉన్నా డన్న విషయాన్ని కూడా లెక్కలోకి తీసుకొని, దుష్టశిక్షణ ప్రభుత్వం పని కాని, వ్యక్తులకు ఆ అధికారం లేదన్న శిక్షాస్మృతి అధికరణాన్ని అక్షరాక్షరంగా ఈ వివాదానికి పట్టించి 'నిందితుడు' తన అన్న అయి నప్పటికీ, దోషి అనే ఎంచి, యావజ్జీవ కారాగార శిక్ష విధించినట్లు రాజేంద్ర తీర్పు చెబుతాడు.

చాలా గొప్ప విషయం. ఉత్తమ ఆదర్శం.

కాని, ఎంతవరకు న్యాయం? అన్న సందేహం కలుగుతుంది. లాయర్ల మాట దేముడెరుగు; హత్య జరిగినపుడు అక్కడ ఉన్న నౌకరు, రవివల్ల తనప్రాణం, మానం కాపాడుకొన్న రాణిని ఐనా సాక్ష్యం ఇచ్చారు గాదు. రవి వాళ్ళని పిలువకపోయినా, పోలీసులు ఆ సమయంలో వాళ్ళని అక్కడ చూశారు గాబట్టి వాళ్ళనా తీసుకు వస్తారు. ఆ సదుపాయాలు లేవు. కాగా, ఆత్మరక్షణ కోసం, నేరం తప్పనిసరి అయింది అని పరిస్థితులు నిరూపిస్తున్న సత్యాన్ని గూడా పట్టించుకోకుండా, 'ఫస్ట్ డిగ్రీ మర్డర్' గా పరిగణించి శిక్ష వేయించారు. పాత కేసులు తిరగేసి, 'ప్రిసిడెంట్స్' ఎలా ఉన్నాయో చూసినా, 8వ రీలులో "చిన్నపిల్లని నగలకోసం హత్య చేసిందన్న" ఆరోపణపై శాంతమ్మకు పన్నెండేళ్ళు శిక్ష పడిందన్న సంగతి బయట పడేది. 'ఎలాగా హీరోయిను లేదు గాబట్టి ఎక్కడుంటేనేం?' అని జడ్జిగారు అనుకున్నారేమో తెలీదు.

"మొత్తానికి పొయటిక్ జస్టిస్ లేకపోయినా, మామూలు జస్టిస్ కూడా చెయ్యలేదు జస్టిస్ రాజేంద్ర" అన్నారు ఈ చిత్రం చూచిన ఒక "న్యాయవాది".

కథకు పుష్టి చేకూర్చడం కోసం, మంచివాడైన రవికి అంత పెద్ద శిక్ష వేసి తీరాలనే సంకల్పిస్తే, ఆ పాత్రకు ఒకటో రెండో దండనార్హమైన వంకలుపెట్టి ఈ కేసును కాస్త కట్టుదిట్టంగా కట్టుకు రావలసిందని ఆయన అభిప్రాయం. లేకపోతే, ఇప్పటి కేసు ప్రకారం, ఇందులోని సిసలైన దుష్టుడు చచ్చి కూడా పగ సాధించాడని సూచించినట్లవుతుంది.

♦ ♦ ♦ ♦

కథకి సంబంధించినంతవరకూ ఇది ఎలా ఉన్నా, నటనను లెక్కలోకి తీసుకుంటే, పై వాదాలు గట్టిగా నిలబడవు. జస్టిస్‌రాజేంద్ర ఈ అభియోగాన్ని సాకల్యంగా వంట బట్టించుకున్న మీదట, ముద్దాయికి

శిక్ష విధించకపోవడం అధర్మం అని మనస్ఫూర్తిగా నమ్మి మరీ ఆ పని చేశాడన్న నమ్మకం కలిగేలా జగ్గయ్య నటించాడు. నేటి ప్రేమ ఘట్టాలు మటుకు, కొండగుర్తు పోజులకు మించి నటించడానికి ఆస్కారం లేకుండా ఉంటున్నాయి కాబట్టి వాటిని మినహాయించు కున్నా, ఇతర సన్నివేశాలన్నిటిలోనూ జగ్గయ్య నటన, పాత్రకు ప్రాణ ప్రతిష్ట చేసేదిగా ఒప్పింది. బ్రతికి చెడ్డ ఇల్లాలుగా, బిడ్డలకోసం ఆరాటపడ్డ తల్లిగా మాలతి ప్రదర్శించిన నటన కూడా సహజంగా సాగి, ఆ పాత్రకు ప్రేక్షకుల సానుభూతిని సంపాదించి పెట్టింది.

ఒక వేషంలోనే, రకరకాల వేషాలు వేస్తూ హుషారుగా తిరిగిన రవిగాను, ధర్మదేవత కన్న ధర్మశాస్త్రానికే ఈనాడు ఎక్కువ పలుకు బడి ఉందన్న సంగతి తెలుసుకోలేక దండన పొందిన అమాయకుడు రవిగానూ ఎన్. టి. రామారావు సమర్థంగా నటించి, ఉన్న మేరకు పాత్రను ఒప్పించాడు. సినీ దుష్టుడు నాగేశ్వరరావు పాత్రను, ముక్కామల ఎన్నతగ్గ సౌలభ్యంతో సొగసుతో నడిపాడు. అతడి ప్రియురాలుగా రాజసులోచన, బావమరిదిగా చదలవాడ, వంట వాడుగా పద్మనాభం, క్రైస్తవ మతాచార్యుడుగా కె. వి. యస్. శర్మ, పోలీసు ఆఫీసరుగా ఆర్. నాగేశ్వరరావు, జడ్జిగా ఎ. వి. సుబ్బారావు, రాజేంద్ర భార్యగా జానకి మొదలగు వారంతా తమ తమ పాత్రలను యథోచితంగా నటించారు. తొలిసారిగా ఎన్నతగ్గ పెద్ద భూమికను నిర్వహించిన మిక్కిలినేని నటన ప్రశంసనీయంగా ఉంది. పోలీసుగా రేలంగి ఎప్పటికి మల్లేనే, వీలైనంత హడావుడి చేసి నవ్వించాడు.

చెంచులక్ష్మి నాటకంవంటి హంగులన్నీ ఆహ్లాదకరంగా ఉన్నాయి. ఆశ్వత్థామ కూర్చిన పాటలలో రాజేంద్ర, రాణిలకు గాత్రధారులుగా శ్రీనివాస్, సుశీలలు పాడిన పాట చాలా హాయిగా ఉంది. పాటను చిత్రించిన చోటుకూడా చాలా సినిమాటిక్‌గా ఉంది...

రెండుతరాల మనుషుల కథను చిత్రించబోవడం దర్శకుడికి గురుతరమైన కార్యభారం. అయినా, విసుగు కలగకుండా, తెర మీద చెప్పూకు వచ్చారు. 1958

## స్రవంతి సాయి వారి భలేబావ

ఎంత పల్లెటూరి మొద్దు అయినా ఫాషన్ల గుట్టూమట్టూ తెలుసుకుంటే నాజూగ్గా తయారవడం అసాధ్యం కాదని ఉద్ఘాటించారు సి. యస్. ఆర్.

ఈ మహత్తర సత్యాన్ని నిరూపించి నలుగురికీ ఆ సంగతి చెప్పడానికి తీసిన చిత్రం ఒకటి మొన్న విడుదల అయింది. పేరు 'భలే బావ'.

ఇది అందరినీ వంచించి డబ్బు గడించడం మరిగిన ఒక టోకరాసురుడి కథ; లేదా టోకరాసురుడికి టోకరా యిచ్చి తానూ తిన్న బలే బావ (మరిది) కథ. అదీ కాదంటే పొగరుతో తనను విడనాడిన పతిని, మంగమ్మ శపథం మార్కు మార్గంలో (పొగరు, దుర్గుణాలు చెడకుండా) మంచి చేసుకున్న మగువ కథ. సహృదయులంతా ఇలా పరిపరి విధాల చెప్పుకోవచ్చు దీన్ని గురించి. పై జాతి వారికి ఓపిక వుండే పక్షంలో ఇందులోని తప్పులన్నీ ఏరి, వాటిని (రేలంగి కథారంభంలో చేసిన సూచనమేరకు) ఒప్పులుగా భావించవచ్చు. లేని పక్షంలో బాగున్న అంశాల గురించి మాత్రం చెప్పుకోవచ్చు.

**అవి:** 1. మొట్టమొదట చెప్పుకోతగ్గది-తలాతోకా లేని ఈ కథను దర్శకుడు రజనీకాంత్ తెరమీద చెప్పిన విధం 2. అరుదైన రెండు మూడు పాటలూ (దక్షిణామూర్తి), ఒకరిద్దరి నటనా బాగున్నాయి. ఒకరు గుమ్మడి వెంకటేశ్వరరావు; మరిద్దరు రేలంగి, జగ్గయ్య.

జగ్గయ్యకు ఇందులో ఒకచోట 'కర్కు (20 తౌజండ్ లీగ్స్) డగ్లస్ మార్కు బనీను తొడిగి, రూడాల్ఫ్‌వాలంటినో పోజులో నిలబెట్టి ఫోటో తీశారు. హీరో పాత్ర కేవలం కల్పితం. ఎవరికీ దీనితో పోలికలు లేవు. కాబట్టి ఏ వేషం వేసినా ఫర్వాలేదు. అందుకని వేసిన ఈ వేషం చూట్టానికి బాగానే వుంది.

ఈ చిత్రం మొత్తం మీద చాలా బాగున్నది సి. నాగేశ్వరరావు ఛాయాగ్రహణం.

కథ : శేఖర్ (లేక హీరో) తన భార్య పల్లెటూరి మొద్దు అని

ఆమెను వదిలేశాడు. అందుకని ఆ పిల్లా కష్టాలూ కలిసి కాపరం ఉండడం జరుగుతుంది. ఉద్యోగం, డబ్బులేని శేఖర్ పట్నంలో ఓ పెద్ద మేడ సెట్టు వేయించుకుని, గిరిజతో డూయెట్లు పాడడానికని విశాలమైన డాబా, డాన్సుల కోసం ఒక తోటా, చెక్కవంతెనా, స్టూడియో సెలయేరూ, నిజమైనదనిపించే చందమామ, వయారిభామా (ఈమె మంచిదా, చెడ్డదా అన్న యదార్థం 'సహృదయు'లే తేల్చుకోవాలి) అందుబాటులో ఉంచుకుని, పాటలు పాడుతూ, వాళ్ళకి వీళ్ళకి టోకరాలు తినిపిస్తూ, తింటూవుంటాడు. పెళ్ళాన్ని కాపరానికి తీసుకురావడానికి అతడి అభ్యంతరం 'అది పల్లెటూరు మొద్దు.'

"అయితేనేం, నీ చిత్తం వచ్చినట్టు తీర్చి దిద్దుకోవచ్చుగా" అంటాడు అతని శ్రేయోభిలాషి. అలా అని బోలెడు డబ్బూ, బోలెడు ఫిలుమూ ఖర్చు పెట్టించి ఆ సత్యాన్ని నిరూపించ ప్రయత్నిస్తాడు.

అతని ప్రయత్నాలు ఫలిస్తాయా? పల్లెటూరిపిల్లకి షోగ్గా డ్రెస్ బనాయించడం చాతనవుతుందా? ఈ మహత్తర సత్యం రుజువవుతుందా? శేఖరు దాన్ని నమ్ముతాడా? అవన్నీ ఎలా వున్నా, మానినా, ఈ చిత్రం చివరికంటా చూస్తే నీతిలాటిది ఒకటి తెలుస్తుంది.

"పెళ్ళాన్ని వదిలేసి, ఎంతమందికి టోకరాలిచ్చినా, ఎన్ని దురభిప్రాయాలను పరమ సత్యాలుగానమ్మి, అమ్మినా మరేం ఫర్వాలేదు. చివర్ని 'పెళ్ళాన్ని ఏలుకుంటా'నంటేచాలు. 'అదే పదివేలు' అని అందరూ అనందిస్తారుసుమీ!" అని భలేబావ చిత్రకథ భరోసా ఇస్తుంది.

ఈ కథలో మనుషులకన్నా ఫాషన్లే ప్రధానమని నమ్మిన శేఖర్ 17 వేల అడుగులు తిరిగినా ఆ అభిప్రాయం మార్చుకోడు. తన పెళ్ళాం బస్తీ దుస్తులు వేసుకోడం నేర్చుకుంది కాబట్టే ఆమెను స్వీకరించాడు. అతనిదే గెలుపు. ఆ మర్నాడే ఇంకో అతిలోక సుందరిని, ఇంకో కొత్త ఫేషన్ను చూచి మతిపోగొట్టుకుని మళ్ళీ ఓ సినిమా కథంత గ్రంథం జరపడన్న గారంటీ లవలేశం లేదు.

అంతగా అతనలా చేస్తే ఈ చిత్ర నిర్మాతలు ఇంకో సినిమా తియ్యొచ్చు.

**1957**


భస్మం
ఇంత అవకతవక
కంగాళీ సినిమా
నా జన్మలో చూళ్లేదు..